## హోల్‌సేల్ రేట్లకే రిటైల్ అమ్మకం.

- పట్టుచీరలు
- కంచి
- ఆరణి
- ధర్మవరం
- వెంకటగిరి
- గద్వాల్
- వరయూర్
- వెండి జరీచీరెలు
- చందేరీ
- సాఫ్ట్‌శిల్కు
- గార్డెన్ శిల్కు



# చందన బ్రదర్స్ (A.C)

**లేడీస్ & జంట్స్ క్లాత్ షోరూమ్**

జగదాంబ సెంటర్

**విశాఖపట్నం**

గమనిక:

వివాహాది శుభకార్యములకు ప్రత్యేకమైన పట్టుచీరలు; ఉన్నత ప్రమాణాలు కలిగిన సూటింగ్స్, షర్టింగ్స్ అందించటం మా ప్రత్యేకత.

## ప్రియమైన పాఠకులారా!

మీరు 10 నుంచి 80 సంవత్సరాల మధ్యలో వున్న ఏ వయస్సు స్త్రీపురుషులైనా, ఏ వృత్తిలోనివారైనా, ఏ ప్రాంతానికి చెందినవారైనా ఈ ప్రశ్నావళిని పూర్తిచేసి మీకు కావలసినది ఏమిటో తెలుసుకోండి...

### ప్రశ్నావళి

1. మీకు సినిమా ప్రపంచం గురించి తెలుసుకోవాలని వుంటుందా? [అవును] [కాదు]
2. మీరు సాధారణ పత్రికలలో ప్రచురించే సినిమావార్తలతో సంతృప్తి చెందక పూర్తి సినిమా పత్రిక చదవదలచుకున్నారా? [అవును] [కాదు]
3. మార్కెట్‌లో విడుదలయ్యే ఏదో సినిమా పత్రికను కాకుండా అత్యధిక సంఖ్యలో పాఠకులు చదువుతున్న సినిమా పత్రికను మాత్రమే కుటుంబసమేతంగా చదవాలనుకుంటున్నారా? [అవును] [కాదు]
4. వారం, వారం విడుదలయ్యే చిత్రాల్లో మీ భావాలకు అనుగుణంగా వుండి, మీరు చూడదగ్గ చిత్రమేదో తెలుసుకొందుకుగాను మీకు తగు సలహాలిచ్చే మంచి రివ్యూలు కావాలని వుందా? [అవును] [కాదు]

5. కేవలం కాలక్షేపంకోసం సినిమా సమాచారం అన్నట్టుగాకాక సినిమా లోకాన్ని గురించిన ఉపయుక్తమైన ప్లస్ విజ్ఞానదాయకమైన విషయాలను కూడా తెలుసుకోవాలనుకుంటున్నారా? [అవును] [కాదు]

6. మీ అభిమానతారలను గురించిన తాజావార్తలు, విశేషాలు, ప్రత్యేకంగా తీసిన వర్ణచిత్రాలు, ఇంటర్వ్యూలు ఎప్పటికప్పుడు మీకందించే ఏర్పాటు కావాలని వుందా? [అవును] [కాదు]

7. ముచ్చటైన ఆఫ్‌సెట్ ముద్రణలో, రంగుల పేజీలతో సినిమా పత్రిక మీకు అతిచౌకలో లభించాలనుకుంటున్నారా? [అవును] [కాదు]

8. తెలుగు చిత్రరంగాన్ని గురించేకాక స్వదేశీ విదేశీ చిత్రరంగాల తీరుతెన్నులను గురించి, ఆయా రంగాలలో తారలు సృష్టించే సెన్సేషన్ గురించి కూడా తెలుసుకోవాలని వుందా? [అవును] [కాదు]

9. కేవలం సినిమా తారల కబుర్లు, షూటింగ్ విశేషాలు మాత్రమేకాక సినీరంగానికి సంబంధించిన అనేక శీర్షికలు కూడా మీకు కావాలనుందా? [అవును] [కాదు]

పై ప్రశ్నలలో 6 అంతకుమించి 'అవును' అనేది మీ జవాబు అయితే మీరు చదవలసింది
అన్ని తెలుగు సినిమా వారపత్రికలకన్నా అత్యధిక సంఖ్యలో పాఠకులు చదువుతున్న

తారలకు తార

# సితార

# చతుర ప్రపంచం



## ఫ్లోటింగ్ యూనివర్సిటీ

విద్యార్థి దశలో నేర్చుకొనే చదువు దైనందిక జీవితంలో ఉపయోగపడేదిగానూ, తాము ఎన్నుకోబోయే వృత్తికి సంబంధించినదిగానూ ఉండేందుకు విద్యావిధానాల్లో అనేక ప్రయోగాలు, మార్పులు చేస్తున్నారు. ఈ ప్రయోగాల్లో ఒక భాగంగా 1976లో అమెరికాలోని పిట్స్‌బర్గ్ విశ్వవిద్యాలయంవారు 'ఫ్లోటింగ్ యూనివర్సిటీ'ని ప్రారంభించారు. ఈ కొత్త తరహా విశ్వవిద్యాలయాన్ని ఒక నౌకలో నిర్వహిస్తున్నారు. వీరు ప్రపంచంలోని వివిధ సంస్కృతులను, నాగరికతలను, కళలను అధ్యయనంచేయడానికి విద్యార్థులను ప్రోత్సహిస్తారు. ఆ అధ్యయనం కేవలం తరగతిగదుల్లో పుస్తకాల ద్వారా కాకుండా వివిధ ప్రాంతాలకు వెళ్ళి అక్కడి నాగరికతను, సంస్కృతిని స్వయంగా పరిశీలించి, అనుభవంలోకి తెచ్చుకొనేలా చేయడమే ఈ విశ్వవిద్యాలయ ప్రత్యేకత.

పద్దెనిమిదివేల టన్నుల నౌకలో ఈ 'ఫ్లోటింగ్ యూనివర్సిటీ'ని నిర్వహిస్తున్నారు. పూర్తిగా ఎయిర్ కండీషనింగ్ చేయబడిన ఈ నౌకా విశ్వవిద్యాలయంలో 500 మంది విద్యార్థులు, 20 మంది ప్రొఫెసర్లు, 150 మంది నౌకా సిబ్బంది, ఉండటానికి కావలసిన అన్ని సదుపాయాలూ వున్నాయి. ఇందులో ఒక పెద్ద ఆడిటోరియం, విశాలమైన లాంజ్, 13 తరగతి గదులు, యూనివర్సిటీ ఆఫీసు గదులు, ఆసుపత్రి, పదివేల పుస్తకాలున్న ఒక గ్రంథాలయం, ఈతకొలను, ఆటస్థలములున్నాయి. ఇవేకాకుండా శాటిలైట్ ద్వారా పనిచేసే టి.వి.లు కూడా ఉన్నాయి.

ఈ నౌక సముద్రంలో ప్రయాణిస్తూండగానే అనేక సెమినార్లు, కాన్ఫరెన్సులు జరుగుతూ వుంటాయి. అమెరికాలోని వివిధ విద్యాసంస్థలు ఆయా రంగాల్లోని ప్రముఖులను ఆహ్వానించి ఈ సెమినార్లను నిర్వహిస్తుంటాయి. వీటికి తోడుగా సంగీతం, నృత్యం, నాటకాలు మొదలయిన కార్యక్రమాలు కూడా ఉంటాయి. ఆడిటోరియమ్‌కు దగ్గర్లోనే ఒక 'బార్' కూడా ఉంటుంది. పద్దెనిమిదేళ్లు దాటిన విద్యార్థులందరు 'బార్'లో విస్కీ, వైన్‌లాంటి పానీయాలు తీసుకోవచ్చు. అయితే యల్.యస్.డి. వంటి మాదక పదార్థాలను మాత్రం నిషేధించారు. ఈ నౌకా విశ్వవిద్యాలయంలో అమెరికా దేశపు చట్టమే అమల్లో ఉంటుంది. ఈ విశ్వవిద్యాలయాన్ని లాభాలనార్జించేదృష్టితో నడపడంలేదు. అయినా దీని నిర్వహణకు అయ్యే ఖర్చు నిమిత్తం ప్రతివిద్యార్థి లక్షరూపాయలు కట్టవలసి ఉంటుంది. ప్రపంచంలోని వివిధ దేశాల మధ్య అవగాహనను, స్నేహసంబంధాలను నెలకొల్పడమే ఈ అంతర్జాతీయ విద్యా సంస్థ ఆశయం. ఈ సంస్థకు వివిధ దేశాలకుచెందిన డైరెక్టర్లు ఉంటారు. హాంకాంగ్, న్యూయార్క్, పిట్స్‌బర్గ్ పట్టణాలలో





వీరి కార్యాలయాలు ఉన్నాయి.

ఈ విశ్వవిద్యాలయంలో 'సెమిస్టర్ ఎట్ సీ' అనే ఓ కొత్తతరహా కోర్సు ఉంది. ఇది చదవదల చుకున్నవారు, ప్రపంచంలోని వివిధ దేశాలకు, జాతులకు చెందిన విద్యార్థులందరి మధ్యా మెలుగుతూ 100 రోజుల్లో ఈ కోర్స్ పూర్తిచే యాలి. ఈ వందరోజుల్లో ఈ నౌక ప్ర పంచంలోని ముఖ్యదేశాలన్నింటినీ దర్శి స్తుంది. ఆయాదేశాల ప్రజల సంస్కృతిని, ఆచార వ్యవహారాలను, భాషలను, వారి అంత ర్జాతీయ స్నేహసంబంధాలను విద్యార్థులంద రూ పరిశీలిస్తారు. ఇప్పటికి వివిధ దేశాలకు చెందిన, దాదాపు 14,000 మంది 'సెమిస్టర్ ఎట్ సీ' కోర్స్‌ను పూర్తిచేశారు. ఇటువంటి సెమిస్టర్లు యేడాదికి రెండు నిర్వహిస్తారు. పద్దెనిమిదేళ్ళ వయసు నుండీ, ఎనభైఏళ్ల వయసుదాకా ఎవరయినా ఈ కోర్స్‌లో చేరవ చ్చు. కానీ ఒక్కొక్కరు లక్ష రూపాయలు చె ల్లించవలసి ఉంటుంది. దాంతో ఇది ధన వంతులకు మాత్రమే అందుబాటులో ఉంటోంది. **ఆర్థిక స్థోమత** ఉన్నవారిలో కూడా, విశ్వవిద్యాలయం వారు నిర్వహించే ప్రవేశపరీ క్షలో ఉత్తీర్ణులయినవారికి మాత్రమే ఇక్కడ ప్రవేశం ఉంటుంది.

## ముద్దు- ముచ్చట

**పాశ్చాత్య** దేశాలలో 'వాలెంటైన్‌డే'ని ఎంతో ఉత్సాహంగా జరుపుకుంటారు. ఏటా ఫిబ్రవరి 14వ తేదీన సెయింట్ వాలెంటైన్ జ్ఞాపకార్థం జరుపుకొనే ఈ పండుగరోజుకు ప్రేయసీ ప్రియులు కానుకలు ఇచ్చిపుచ్చుకోవడం ఆన వాయితీ.

కెనడా దేశంలో వాన్‌కోర్ అనే ఊళ్లోని ఓ మిఠాయి దుకాణం యజమాని ఈ 'వాలెంటైన్ డే'ని ఓ వినూత్నమైన పద్ధతిలో జరుపుతాడు. 'వాలెంటైన్‌డే' నాడు ఈయన అత్యంత సుందరమైన పెదాలకు బహుమతి ఇస్తాడు. ఈ పోటీలో స్త్రీలందరికీ ప్రవేశార్హత వుంటుంది. పాల్గొనదలచిన స్త్రీలు అతని దుకాణంలో 'ఫడ్జ్' అనే ఒకరకం మిఠాయిని కొనుక్కొని తినాలి. తరువాత ఆ మిఠాయి అంటుకొన్న



పెదాలను ఒక కాగితంమీద అద్దాలి. పెదాల ముద్ర వున్న ఆ కాగితాన్ని ఆ పెదవుల తాలూకు స్త్రీ ప్రవేశపత్రంగా పరిగణిస్తారు. మగవాళ్ళు ఆకతాయిగా ప్రవర్తించకుండా వుండటానికి ఆ కాగితాలమీద పాల్గొన్న స్త్రీలపేర్లు లేకుండా నంబర్లు మాత్రమే వుంటాయి. తరువాత ఈ కాగితాల తోరణాన్ని తలుపుదగ్గర కడతారు. న్యాయనిర్ణేతలు వాటిని పరిశీలించి 'మోస్ట్ కిస్సబుల్ లిప్స్'కు బహుమతి ప్రకటిస్తారు. ఈ పోటీలో అనేకమంది స్త్రీలు ఎంతో ఉత్సాహంగా పాల్గొంటారు. గెలుపొందిన స్త్రీకి ప్రత్యేకంగా తయారుచేసిన 'ఫడ్జ్' మిఠాయిని బహుమతిగా ఇస్తారు. అయితే ఏటా ఇది చూస్తూ వచ్చిన మగవాళ్లకి కోపంముంచుకొచ్చి "అందమైన పెదాలు ఆడవాళ్లకేనా ఉన్నది? మాకు లేవా? మేమూ పోటీలో పాల్గొంటాము" అంటూ ముందుకొచ్చారు.

ఈ ఏడాది ఆ ఊళ్లోనే మరో కొత్తరకం పోటీకూడా ప్రారంభించారు. కొంతమంది యూనివర్సిటీ విద్యార్థులు కలిసి 'ముద్దులపోటీ'ని ఏర్పాటుచేశారు. ఇందులో పాల్గొనదలచుకొన్నవాళ్లు తమ జంటను తామే తెచ్చుకోవాలి. ప్రవేశరుసుం ఒక డాలరు. అంపైర్ 'స్టార్ట్' అనగానే ఒక్కసారిగా అన్ని జంటలూ ముద్దుపెట్టుకోవడం మొదలుపెడతారు. న్యాయనిర్ణేతలు అందరి ముద్దుల్నీ జాగ్రత్తగా గమనించి, ఏ జంట 'ముద్దు' ముచ్చటగా వుందో నిర్ణయించి బహుమతి ప్రకటిస్తారు. ఈ ముద్దుల పోటీలో వసూలయిన డబ్బును హృద్రోగ నివారణకోసం పరిశోధనలు జరుపుతున్న ఓ వైద్యసంస్థకు విరాళంగా ఇవ్వడం విశేషం.

## 'డ్రాక్యులా' సృష్టికర్త

నవలలు, సినిమాల ద్వారా డ్రాక్యులా అందరికీ చిరపరిచితుడే. అయితే డ్రాక్యులాను సృష్టించిన నవలా రచయిత 'బ్రామ్‌స్టోకర్' గురించి చాలా మందికి తెలీదు. బ్రామ్‌స్టోకర్ 1847లో ఐర్లండ్ దేశంలోని డబ్లిన్ పట్టణంలో పుట్టాడు. చిన్నతనంలో అతనెంత బలహీనంగా, రోగిష్టిగా ఉండేవాడంటే అతనికి



ఏడోఏడు వచ్చేదాకా నడవటంకూడా రాలేదు. అయితే దుర్బలుడైన బ్రామ్‌స్టోకర్ కొన్నేళ్లలోనే డబ్లిన్ విశ్వవిద్యాలయం మొత్తంలోనే గొప్ప ఫుట్‌బాల్ ఆటగాడుగా తయారయి అందరినీ ఆశ్చర్యపరిచాడు. తరువాత 'డబ్లిన్‌కాసిల్'లో ఒక సాధారణమైన ఉద్యోగిగా పదేళ్లు గడిపాడు. అనుకోకుండా అతనికి 'డబ్లిన్‌మైల్' పత్రికలో కళావిమర్శకుడుగా ఉద్యోగం దొరకడం సుప్రసిద్ధనటుడు 'సర్‌హెన్రీ ఇర్వింగ్'తో పరిచయానికి దారితీసింది. తరువాత బ్రామ్‌స్టోకర్ ఇర్వింగ్ చనిపోయేదాకా, ఇరవైఏడు సంవత్సరాలు అతనికి కార్యదర్శిగా పనిచేశాడు.

బ్రామ్‌స్టోకర్ అమెరికాలో ఇర్వింగ్‌తో కలిసి చాలాకాలం పర్యటించాడు. అతడు ఇర్వింగ్ పేరుతో రోజుకు కనీసం యాభై ఉత్తరాలు రాయవలసి వచ్చేది. ఈ రకంగా అతడు తనకు తెలీకుండానే భవిష్యత్‌లో రచయిత కావడానికి తగిన అనుభవం సంపాదించాడు. 1890లో అతడు తన మొట్టమొదటి నవల 'దస్నేక్‌పాస్' రాశాడు. తరువాత ఏడేళ్లకు 'డ్రాక్యులా' రాశాడు. డ్రాక్యులా తరువాత అతడు 'దమిస్టరీ ఆఫ్‌ద సీ', 'దజీవెల్ ఆఫ్ సెవెన్‌స్టార్స్', 'ద లేడీ ఆఫ్‌దస్వోర్డ్' అనే మరో మూడు నవలలు రాసినా ఏదీ డ్రాక్యులా అంతటి ప్రాచుర్యాన్ని పొందలేదు. 'డ్రాక్యులా' నవలను అతడు ఒక డైరీ రూపంలో రాశాడు. ఇంగ్లాండ్‌లో జరిగినట్టుగా రాసిన ఈ కథలోని నాయకుడు 'డ్రాక్యులా'కు కన్నె పిల్లలరక్తమంటే మహాప్రీతి.

జానపద గాథలు, బానిసలకుండే మూఢనమ్మకాలు, మతపరమైన కొన్ని విశ్వాసాలు ఆధారంగా బ్రామ్‌స్టోకర్, 'డ్రాక్యులా' నవలను రాశాడు. పాపాత్ములు దెయ్యాలుగా మారుతారనే నమ్మకం బానిసల్లో ఇప్పటికీ ఉంది. రాత్రివేళ శవపేటిక నుండి చెడ్డవారి ఆత్మ గబ్బిలం రూపంలో బయటికి వచ్చి తన రక్త దాహాన్ని తీర్చుకొని తిరిగి సూర్యోదయంలోపల శవపేటిక లోనికి వెళ్లిపోతుందని వీరి నమ్మకం. ఈ ప్రేతాత్మలకు నీడ ఉండదని, అద్దంలో వాటి ప్రతిరూపం కనబడదని, పవిత్రమైన శిలువను చూస్తే భయపడుతాయని, వెల్లుల్లిపాయల హారం ధరించిన వారి దరిదాపులకు వెళ్లవని, చెక్క దిమ్మలు వాటిగుండెల మీద దిగవేస్తే చచ్చిపోతాయని కూడా నమ్ముతారు. 'క్రిస్మస్'కు 'లేడీ డే'కి మధ్యకాలంలో అంటే డిశంబరు 25వ తేదీ నుండి మార్చి 25వ తేదీ లోపల పుట్టిన వారు చనిపోయిన తరువాత దెయ్యాలుగా మారతారని మెసిడోనియా, దక్షిణ అమెరికా దేశస్థులు నమ్ముతారు. అలా జరగకుండా ఉండటానికి సమాధిమీద కొన్ని రోజులపాటు ఒక మంటను ఉంచుతారు.

1922లో మొదటిసారిగా 'డ్రాక్యులా' నవల ఆధారంగా ఒక నాటకాన్ని ప్రదర్శించారు. తరువాత 1927లో జర్మనీ దేశంలో 'డ్రాక్యులా' చలన చిత్రాన్ని నిర్మించారు. నవలలో కొద్ది మార్పులు చేర్పులు చేసి 1931లో అమెరికాలో కూడా 'డ్రాక్యులా' చిత్రాన్ని నిర్మించారు. 'డ్రాక్యులా' 'సూపర్‌స్టార్'గా వెలగడానికి అతడు అతి భయంకరుడు కావడమేగాకుండా 'సెక్స్ అప్పీల్' కూడా ఉండటం కారణం కావచ్చు.

కెనడా దేశంలో పర్యాటకులను ఆకర్షించడానికి నయాగరా జలపాతానికి దగ్గరలోనే 'కాసిల్‌డ్రాక్యులా' అనే ఒక భవనాన్ని నిర్మించారు. ఆ భవనం బయట టికెట్ కౌంటర్ దగ్గర ఒక అందమైన యువతి టికెట్లు అమ్ముతూ ఉంటుంది. లోపల అడుగుపెట్టగానే చల్లటి వాతావరణం వళ్లు జలదరింపజేస్తుంది. అక్కడ ఎర్రటి వెలుగుతో నిండిన 'హాల్'లో నల్లటి దుస్తులు ధరించిన డ్రాక్యులా దర్శనం ఇస్తాడు. నవలలో వర్ణించిన మాదిరిగానే అతడు పాలిపోయిన మొహంతో నల్లటి జుట్టును వెనక్కి దువ్వి భయంకరమైన కోరలు కనిపించేలా చిరునవ్వునవ్వుతూ ఉంటాడు. చనిపోయిన వారి ఆత్మలు ఏవిధంగా దెయ్యాలుగా మారుతాయో వివరిస్తూ 'టేప్‌రికార్డర్'లో నుండి మాటలు వినబడుతూ ఉంటాయి.

ఆ వాతావరణమంతా నిజంగానే డ్రాక్యులా ఒకప్పుడు బతికి ఉండేవాడనే నమ్మకం కలిగేలా చేస్తాయి. అక్కడినుండి బయటికి వచ్చేస్తుంటే కౌంటర్ దగ్గరున్న అమ్మాయి చిరునవ్వుతో వీడ్కోలు పలుకుతుంది. అందమైన ఆమె పలువరుసలో రెండు కోరలు మెరుస్తూ కనబడతాయి. 

కవర్‌పేజీ ఫొటోగ్రాఫర్: అరుణ్ ఏ సేకర్

# 'పావులు' నవలపై చతుర సమీక్షలు

**'చతుర' నవలల పోటీలో ప్రత్యేక బహుమతి పొంది ఏప్రిల్ సంచికలో ప్రచురితమైన 'పావులు' నవలపై మాకు అందిన 'చతుర సమీక్ష'లలో ఉత్తమంగా వున్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాము. ఈ శీర్షికలో పాల్గొన్న పాఠకులందరికీ మా కృతజ్ఞతలు బహుమతులు పొందినవారికి మా అభినందనలు.**

## నేటి "పావులు"

(ప్రథమ బహుమతి రు. 100/- పొందిన సమీక్ష)

**నే**టి అస్తవ్యస్త సామాజిక వ్యవస్థలో విద్యార్థులు, యువకులు ఏవిధంగా కొన్ని స్వార్థపర శక్తులకు "పావులు"గా తయారవుతున్నారో రచయిత మరింత బలంగా చిత్రీకరించలేక పోవడం మూలాన టైటిల్‌ని దృష్టిలో పెట్టుకుంటే నవల అసంపూర్తిగానే వుంది. అయితే స్థూలంగా నవల బాగుందని మాత్రం ఘంటాపథంగా చెప్పవచ్చు. పరిణతి చెందని ఆలోచనలతో ఏదో తెలియని స్వేచ్ఛ కోసం వెంపర్లాడే కాలేజి దశలో వుండే విద్యార్థులకూ, క్రమశిక్షణ అంటూ ఇష్టం వచ్చినరీతిలో తమ పిల్లలపై ఆధిపత్యం చెలాయించబూనుకునే తల్లి దండ్రులకూ మధ్య జరిగే సంఘర్షణలు రచయిత అద్భుతంగా, సహజంగా, సజీవంగా చిత్రీకరించారు. మానసిక వైరుధ్యాల్ని ఎఫెక్టివ్‌గా ఎక్స్‌ప్రెస్ చేశారు రచయిత. నేటి సాహిత్యం గురించి, పత్రికల గురించి, "ఏ పత్రిక చూసినా ఏమున్నది గర్వకారణం! ప్రతి పేజీ సమస్తం వంటింటి ప్రేమసాహిత్యం" అని వ్యక్తం చేయడం ద్వారా రచయిత కోరే అభిరుచులు ఉన్నతమైనవని తెలుస్తుంది. అలాగే "తెలుగు సినిమాలు" ఎలా వున్నాయో, వాటికి, నిజజీవితానికి ఎంతగా పొంతన లేకుండా పోయిందో 'కాంతి' ద్వారా చెప్పించారు. 'చెందూ'కి వచ్చిన జబ్బేమిటో, దానికి, అతడి వ్యభిచారానికి సంబంధమేదైనా వుందో, వుంటే ఏమిటో, ఏ విధంగానో అనేవి స్పష్టీకరించకపోవడం పెద్దలోటు. కుక్కలుగల వాళ్ళు తమ ఇంటి గేటుకి "బివేర్ ఆఫ్ డాగ్స్" అనే హెచ్చరిక బోర్డు తగిలించినట్లుగా, కొంత మంది రాజకీయనాయకుల వ్యక్తిగత ప్రయోజనాలకు, స్వార్థాలకు "పావులు"గా మారి పతనంచెంది ఏవిధంగా బలవుతారో కాశీరామ్, రమేష్‌లను సూచనగా ఉపయోగించి హెచ్చరికనే సందేశంగా మలచి ముగించారు రచయిత.

— యస్.కె. జకీర్ రామవరం.

## 'పావులు' కాదు 'భ్రష్టులు'

(ద్వితీయ బహుమతి రు. 75/- పొందిన సమీక్ష)

**చ**దువుకు సంధ్య వార్చి; సంస్కారం, విజ్ఞానం, గౌరవాలకు తిలోదకాలిచ్చేసి- సామాజిక బాధ్యతను విస్మరించి; తనేమిటో, తన ఉనికేమిటో మరచి, మందు, మగువ, మార్ఫియా మత్తులో చిత్తుగా కూరుకుపోయి, నైతికంగా పతనమై, అగమ్యంగా అయోమయంగా చూస్తోంది నేటి యువత!

పిల్లల పెంపకం ఒక కళ— అని తెలుసుకోక క్రమశిక్షణ పేరుతో దండించి, హింసించి పిల్లల అవసరాలను గుర్తించక, వికసిస్తున్న వారి ఆశల్ని ఆలోచనల్ని అవసరాల్ని మొగ్గలోనే తుంచి, ఛండశాసనుడిలా మూర్ఖంగా ప్రవర్తించి, కన్నకొడుకుచేత చేయి చేయించుకునే స్థితికి దిగజారిన ధనుంజయరావు పాత్ర- నగటు తండ్రులకో కనువిప్పు.

తండ్రి ప్రేమను నోచుకోక నిరాశ నిస్పృహలకు లోనయి, కోరికల దాహంతో పిచ్చిగా చూస్తోన్న 'చెందూ'లాంటి వాడికి ఒయా

సిస్సులా వ్యసనపరులైన రమేష్, కాశీరామ్‌లు కనిపించడం వింతేమీకాదు. వారి సాహచ ర్యంతో విచ్చలవిడిగా తయారయి, చివరికి బతుకు దుర్భరం చేసుకుని, ప్లాట్‌ఫాంమీద దిక్కులేని చావును కొనితెచ్చుకున్న అతని నిస్సహాయత్వాన్ని, బేలతనాన్ని చూసి జాలే స్తోంది.

పిల్లల్ని స్నేహితుల్లా చూడాలన్న 'శాంతి'వ చనాలను ఖాతరుచేయని తండ్రులు; చదువు ప్రాముఖ్యాన్ని బతుకు సారాన్ని 'కాంతి'వంతంగా తెలియజెప్పినా పెడచెవిన బెట్టిన 'చెందూ'లు— ఈ వ్యవస్థలో వుండటం... వ్యవస్థ దుర్భరమవడానికి కారణం!

సజీవమైన పాత్రలు తీసుకుని, చాలావ రకూ సఫలీకృతులైన రచయితకు అభినంద నలు.

— యన్నంరెడ్డి వెంకటరెడ్డి మద్రాసు.

## చక్కని ఇతివృత్తం

**(తృతీయ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)**

**చ**క్కటి ఇతివృత్తాన్ని ఎన్నుకొని, సాంఘిక ప్రయోజనం లక్ష్యంగా పెట్టుకుని రాసిన 'పావు లు' నవల ప్రతి తల్లిదండ్రులూ, యువకులూ, తప్పనిసరిగా చదవవలసింది. ఎంతో శ్రద్ధగా, దీక్షతో చదువుకోవలసిన విలువైన కాలాన్ని రాజకీయాల్లో, మత్తుపదార్థాల సేవనంలో గడి పితే వచ్చే దుష్ఫలితాలని అద్దంలో చూపించి నట్టు ప్రదర్శించారు రచయిత. తల్లిదండ్రు లు పిల్లలపట్ల ఎలా ప్రవర్తించకూడదో చక్కగా చెప్పారు. కానీ రచయిత ఇంకొంచెం శ్రద్ధతీసు కుంటే నవల మరింత రక్తికట్టేది.

కేవలం రెండుసార్లు బజారు స్త్రీతో కలిశాడు చందూ. కడుపులో విపరీతమైన పోటువస్తున్న ట్టు, ఆ పోటుతోనే చందూ మరణించినట్టు చెప్పారు రచయిత. సుఖవ్యాధులు వచ్చినా అంత తొందరగా ప్రాణంపోతుందా? 'యువ జ్యోతి తాలూకు వెలుగుని దేశం నలుమూల లకు ప్రసరింపజేయడానికి పాటుపడుతున్న వాళ్ళం' అంటూ వచ్చిన యువకులు చందూని ఏమీ మాట్లాడనివ్వలేదు. వాళ్ళు చెప్పదలచుకున్నవి చెప్పేసి, ఓ పుస్తకం చే తిలో పెట్టేసి వెళ్ళిపోయారు. బాధల్లో వున్నవా ళ్ళని పలకరించి, వాళ్ళు చెప్పింది వింటే, వాళ్ళకి కొంత ఉపశమనం కలుగుతుంది. అది చెయ్యలేదు ఆ యువకులు. చందూని డాక్టర్‌కి చూపించడంలాంటిదేదో క్రియారూ పంలో వాళ్ళు చేసివుంటే బాగుండేది. 'సెక్స్ స్పెషలిస్ట్' అని బోర్డు పెట్టుకుని దగావద్ద యువతీ యువకుల్ని దోచుకునే నకిలీ డాక్టర్ గురించి మరికొంచెం విపులంగా రాస్తే బాగుండేది. మనస్సు మారి కొత్తజీవితాన్ని ప్రారంభించదలచుకున్నాడు చందూ. కానీ అప్పుడు కూడా చెప్పలేదు ఎవరితోనూ తన కడుపునొప్పి గురించి. తండ్రిని డబ్బు అడిగిన ప్పుడు 'సుఖం కొనుక్కోడానికి' అని చెప్పిన చందూ మనస్సు మారాక, తను చేసిన తప్పుని తల్లితో లేదా సుబ్రహ్మణ్యంతో చివరికి మేనమా మతో కూడా చెప్పలేదు. దీన్నిబట్టిచూస్తే చందూ పాత్రని రచయిత చంపదలచుకున్న ట్లు తోస్తుంది. ఏమైనా తొలిప్రయత్నంగా ఇలాటి చక్కని నవల రాసిన రచయిత అభి నందనీయుడు.

— ఎ. రాధాకృష్ణ కాకినాడ.

## "యువతకో టానిక్"

**(రూ. 25/- బహుమతి పొందిన సమీక్ష)**

**తా**ము ఏంచేస్తున్నామో, ఏమైపోతున్నామో తెలియని అగమ్యస్థితిలో, మగతగా జోగుతు న్న యువతను కొరడాతో ఝళిపించి కళ్లు తెరిపించే నవల 'పావులు'. వయసు తెచ్చే పిచ్చి ఆలోచన్లు... వాటిని అదుపు చేసుకోలేని చంచలిత మనస్తత్వాలు... ఆనందపుటంచు ల్ని అందుకుంటున్నామన్న అపోహతో అగా ధంలోకి జారిపోతున్న యువతరం మానసిక ప్రవృత్తిని అక్షరాకృతిలో రచయిత మన ముందుంచారు.

అర్థంలేని ఆలోచనల్లో క్రమక్రమంగా నిగ్ర హశక్తిని కోల్పోయి, దురలవాట్లకు బానిసైన చెందూ జీవితం, ఏది చేయకూడదో తెలిసీ, వాటికి లొంగిపోతున్న వివేకం లేని విద్యా వంతుడైన సగటు యువకుడిని ప్రతిబింబి స్తోంది. చేసిన పాపపు పనులకు పశ్చాత్తాపప డుతూ ప్రాణం వదిలే చెందూ పాత్ర చిత్రణ గుండెను పిండుతుంది.

డిసిప్లిన్ పేరిట పిల్లలను నిర్బంధించి, వారి భవిష్యత్తును ఎంత పాడుచేస్తున్నామో తెలుసుకోలేని ధనుంజయరావు లాంటి

తంద్రులకు, కాలేజిలోని హీరోయిజం మీది మోజుతో దుష్టశక్తుల చేతుల్లో పావులుగామారి ప్రాణం మీదకి తెచ్చుకున్న కాశీరాం, రమేష్ లాంటి ఆలోచనాశూన్యులైన విద్యార్థి నాయకులకు ఈ నవల కనువిప్పుకాగలదు.

క్షణికానందాన్ని కోరుకునే వయసువేడిలో తమ జీవితమే రగిలిపోతుందన్న వాస్తవానికి సుదూరంగా పయనిస్తున్న యువప్రభంజనాన్ని, విచక్షణలేని యువశక్తిని తమ బాధ్యతల వైపు కార్యోన్ముఖులుగా చేయాలన్న యువరచయిత ఆశయాన్ని అభినందించాల్సింది మాటలతో కాదు... ఆచరణతో.

జీవితాన్ని ఎంతో ప్రభావితంచేయగల యవ్వనమే దారితప్పితే ఎలా పతనం చేయగలదో అతిసహజంగా, అవాస్తవికతకు చూరంగా మలచబడ్డ ఈ నవల ఈ తరం యువతరానికొక 'టానిక్'లా పనిచేస్తుంది.

—పి.వెంకటరామిరెడ్డి
తిరుపతి

## చీకటి కోణాలు

(రూ. 25/- బహుమతి పొందిన సమీక్ష)

నేటి విద్యార్థుల జీవితాల చీకటి కోణాలను వెలికితీసి రూపకల్పన చేశారీ నవలలో. సమ్మె ఎందుకో, అసలు సమస్య ఏమిటో తెలియని విద్యార్థులు మద్యపానం నుంచి మత్తుమందులు, వ్యభిచారందాకా తమను సరిదిద్దుకోలేనంతగా చెడిపోతున్నారు. కులాల పేరిట వర్గాలుగా చీలిపోయి, ఆపై చంపుకోవడం, పోలీసుల చేతిలో చిక్కుకుని సమస్యల్ని కొనితెచ్చుకుంటున్నారు.

డిస్కో, సినిమా, క్రికెట్ పిచ్చివున్న నేటి యువతకు ప్రతిరూపం "చెందూ" మానసిక వ్యథను భరించే తల్లిగా నేటి తల్లులకు ప్రతినిధి శాంతి. తండ్రి ప్రవర్తన మూలంగా చెందూ చెడిపోతే, అసలు తల్లిదండ్రుల ప్రమేయం లేకుండానే చెడిపోయిన కాశీరాం వల్ల, చెడిపోవడానికి కేవలం తల్లిదండ్రుల ప్రవర్తనే కారణం కానక్కర్లేదని, ఆవేశం తప్ప ఆలోచన అనేదే లేని నేటి యువకులకు పరిసర పరిస్థితులు కూడా అందుకు దోహదంచేస్తాయని నిరూపిస్తుంది. కాశీరాం దుస్థితి, రమేష్ మర్డర్, ఒక్కొక్క సంఘటనే చెందూ మనసును చెడునుంచి మంచికి డైవర్ట్ కావడానికి తోడ్పడింది. "కాంతి" మనస్తత్వం, చెందుకు నచ్చచెప్పేతీరు, ఆ యువతి భావాల ద్వారా విద్యార్థులందరు "పావులు" కాదని తెలుస్తుంది. చెందూ మరణం సహజత్వానికి దగ్గరగా వున్నా, చెడిపోయినవాళ్ళంతా చనిపోవడమే పరిష్కారం కాకుండా, అతన్ని బతికించి, అతని ద్వారా యువశక్తికి స్ఫూర్తినిచ్చేలా మంచి సందేశాన్ని ఇప్పిస్తే బాగుండేదేమో?

—వై.భారతి
సిరిసిల్లా

## విద్యార్థులూ! కాకండి "పావులు"

(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)

నేటి విద్యార్థుల్లో పెచ్చరిల్లుతున్న హింసాప్రవృత్తిని, రాజకీయాలను, బాధ్యతారాహిత్యాన్ని దౌర్జన్యకాండని... ఒక్కమాటలో చెప్పాలంటే నేటి విద్యార్థిలోకం ఎంతటి పతనావస్థలో వుందో సమగ్రంగా తెలియజేసే నవల "పావులు."

నేడు 'విద్యార్థులు' అన్నదానికి అర్థమే మారిపోయింది. వారిలోని చైతన్యాన్ని, వారి వ్యక్తిత్వాన్ని మత్తుమందులతో, మగువలతో లొంగదీసుకుని తమతమ స్వార్థప్రయోజనాలకు పావులుగా వాడుకుంటున్నారు రాజకీయ నాయకులు. ఫలితంగా సంఘవ్యతిరేకశక్తులతో చేతులు కలిపిన విద్యార్థులు వారిలో ఒకరిగా కలిసిపోతున్నారు. తమలోని సృజనాత్మకతను సమ్మెలు, నిరాహారదీక్షలు, తీవ్రభీభత్సకాండలకు ఖర్చుపెడుతున్నారు.

ఇలా ఆలోచన లేకుండా, కేవలం ఆవేశంతో పతనంవేపు పరుగులు తీస్తున్న నేటి విద్యార్థులను, యువకులను కాసేపు ఆపి, ఆలోచింపజేసే నవల 'పావులు.' నేటి పరిస్థితుల్లో ఇలాంటి సామాజిక ప్రయోజనం కలిగిన నవలలు సమాజానికి ఎంతైనా అవసరం.

—ఎస్.బి. ప్రసాద్
నకిరేకల్.




మండువేసవిలో కొన్ని కొన్ని అనుభూతులు చెప్పలేనివి.

మామిడిపండు, మల్లెపూలు, మల్లాది నవల...




మిట్టమధ్యాహ్నం ఎండలో తిరిగొచ్చి
ఎయిర్‌కూలర్‌గదిలో, అపుడే ఫ్రిజ్‌లో
నుండి తీసిన కోకోకోలా తాగిన
అనుభూతిని గుర్తుతెచ్చే

ఆంధ్రుల ఆహ్లాదరచయిత
మల్లాది వెంకటకృష్ణమూర్తి తాజా నవల.

# "ఒక నువ్వు - ఒక నేను"

(వెల Rs. 24-95 న. పై.)

మార్చి 10 న విడుదలై మార్కెట్లో ఉంది.

ప్రతి సిగరెట్‌కి రెండు క్షణాల ఆయుర్దాయం తగ్గుతుందని చెప్పిన డాక్టర్లు. ప్రతి చిరునవ్వుకి నాలుగు క్షణాల ఆయుష్యు పెరుగుతుందని కూడా చెప్పారు. ఈ నవల చదివేప్పుడు ఎన్నిసార్లు నవ్వితే అన్ని ఇంటూ నాలుగు క్షణాల వయస్సు పాఠకుడికి పెరుగుతుందని గ్యారంటీ. అలా పెరగక, ఈ గ్యారంటీ అబద్ధం అయితే ఈ పుస్తకం వెల వడ్డీతో సహా వాపస్ అని హామీ ఇస్తున్నాం.

శ్రీ మహాలక్ష్మి బుక్ ఎంటర్‌ప్రైజెస్

మ్యూజియంరోడ్, విజయవాడ -520 002.

Phone:63322

# చతుర

జూన్ 1987
సంపుటి: 10
సంచిక: 5

## ఈ నెల ప్రత్యేక నవల

పదిమంది ఆడవాళ్లు ముసిముసి నవ్వులతో ఆ యువతి చుట్టూ మూగారు.

ఆమె ఎంత గింజుకున్నా వదలకుండా, చేతులు గట్టిగా విరిచిపట్టుకొని హాలు నడుమకు తీసుకువెళ్లారు. ఆమె చీరా, జాకెట్టూ, బాడీ, లోపావడా అన్నీ బలవంతంగా విప్పేశారు. అల్లుకొని వున్న ఆమె రెండు జడల పాయలూ విప్పి జుట్టు వదులుగా జారవిడిచారు! ఆమె మెడలో వున్న ఒంటిపేట బంగారు గొలుసు కూడా తీసేసి పూర్తిగా నగ్నంగా నిలబెట్టారు.

వాళ్ల బాస్ స్విచ్‌లు ఆఫ్‌చేయగానే హాలులో బార్‌లైట్లు ఆరిపోయి చీకటిగా అయిపోయింది.

ఆ తరవాత ఆమె ఒక్కొక్క స్విచ్ నొక్కుతుంటే కాంతివంతమైన తెలుపూ, ఎరుపూ, నీలం, పసుపూ, ఆకుపచ్చా, ఊదా, నారింజరంగుల ఫోకసింగ్ లైట్లు వరసగా ఆ యువతి నగ్నశరీరం మీద పడి, ఆమె అంగాంగాలను అందరికీ స్పష్టంగా చూపాయి!

మేడమ్ అనబడే ఆ బాస్ నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ ఆ యువతి దగ్గరికి వచ్చి చేతులతో అన్ని అవయవాల్ని తడిమి తడిమి, నొక్కి నొక్కి, రాసి రాసి, పొడిచి పొడిచి చూసింది. "గుడ్... మంచి బేరమే!" అని సంతృప్తికరంగా నవ్వి, "మెరుపుతీగలా వున్నావు! ఈరోజు నుంచీ నీపేరు శంపా! మనోహరి అన్నది మరిచిపో!" అంది.

అలా పేరుతో సహా తన శరీరంపై సర్వహక్కులూ కోల్పోయిన స్థితి ఆ మనోహరికెలా ఎదురైంది? ఆమె నా పరిస్థితుల ఊబిలోకి దిగజార్చిన వ్యక్తులెవరు?

ప్రపంచంలో అతి పురాతనమైనదిగా పేర్కొనే ఆ వృత్తిలో బతుకీడుస్తున్న అబలల్ని మరోకోణం నుంచి చూపుతూ భట్టిప్రోలు కృష్ణమూర్తి రచించిన 'ఊబి' చతుర నవలల పోటీలో ప్రత్యేక బహుమతి రూ. 3000/- పొందిన నవల.



1921లో పుట్టిన శ్రీ భట్టిప్రోలు కృష్ణమూర్తి 1940లో ఉద్యోగ జీవితం ప్రారంభించి 1944 నుంచీ ఒరిస్సా రాష్ట్ర ప్రభుత్వోద్యోగిగా చేస్తూ 1979లో అడిషనల్ కలెక్టర్ అండ్ అడిషనల్ డిస్ట్రిక్ట్ మేజిస్ట్రేట్ పదవిలో వుండగా రిటైరయ్యారు. 1936లో తొలిరచన చేసిన శ్రీ కృష్ణమూర్తి రచనా వ్యాసంగానికి 1986లో స్వర్ణోత్సవం జరుపుకున్నారు. ఇన్నేళ్ళలోనూ శ్రీ కృష్ణమూర్తి వివిధ పత్రికలు నిర్వహించిన పోటీలలో 14 బహుమతులు పొందారు. 'చతుర' నవలల పోటీలో పొందిన ప్రత్యేక బహుమతి 15వది!

"మంకెనా పువ్వుల్లార - మాటలాడరేం?
తంగేడుమొగ్గల్లార - తలలెత్తరెందుకూ?
సీతాకోక చిలకల్లార - సిగ్గూలేటికీ?
నలుపూ— తెలుపూ మబ్బుల్లార - నిలువ
బోరేలా?
ఎక్కడివి మీకిన్ని ఇంపూ సొంపులూ?
ఎవ్వారిలా మీకిచ్చారిన్ని రంగూలూ?"

ఊరికి కొద్దిదూరంలో చిట్టడవిలో ఒక మర్రి చెట్టు కింద కూర్చుని, చుట్టుపక్కల గడ్డిమేస్తున్న పశువుల మందను ఒక కంటితో కనిపెడ్తూ పాడుకుంటూంది పన్నెండేళ్ల లచ్చి - వయసుకుమించిన పెరుగుదల ఆ పిల్లది!

ఆ పక్కనే ఊడలకు కట్టిన పాతచీర గుడ్డఉయ్యాలలో అమాయకంగా నిద్రపోతూంది మూడేళ్లు నిండిన పసికందు గవిరి. లచ్చి నలువు కానీ గవిరి మటుకు పచ్చని దబ్బపండు ఛాయలో వుంటుంది. వాళ్ల తల్లీ తండ్రీ— గవరయ్యా, చెంద్రీ - ఆ ఊళ్లోనే వ్యవసాయ కూలీలు.

వాళ్ల హరిజనవాడలో చాటుమాటుగా ఎవరేమనుకున్నా గవరయ్యకు మటుకు గవిరికి అంత చక్కని పసిడి ఛాయ రావడం వాళ్ల ఊరి అమ్మవారు ~గ్ని గవిరిందేవి దయవల్లే అని గట్టి నమ్మకం.

ఆ ఊళ్లో అమ్మవారి జాతర జరుగుతూంది అప్పుడు. సాయంత్రం వేగం మందను తిరిగి తోలుకొస్తే, జాతర చూడటానికి వెళ్దాం అని వాళ్ల అమ్మ చెప్పింది. సూర్యుడు నడినెత్తిమీదికి వచ్చి, ఎప్పుడు అటువైపు వాల్తాడా అని వేయికళ్లతో కాచుకున్న లచ్చి పువ్వులనీ, మబ్బుల్నీ సీతాకోకచిలుకల్నీ చూస్తూ పాట పాడుకుంటూంది.

జాతర కోసం చుట్టుపక్కల ఊళ్లవాళ్లేకాక ఆ దగ్గరవున్న పట్నవాసులూ చాలామందే జమకూడారు. రకరకాల వాహనాలు తిరుగుతున్నాయి ఆ ఊళ్లో. అయితే ఆ చిట్టడవి ప్రాంతంమటుకు ఆరోజు నిర్జనంగావుంది.

అప్పుడు ఉదయం పదకొండు గంటలు కావస్తోంది. పాటపూర్తి అయ్యాక లచ్చి ఒక ఆవు మందకు దూరంగా వెళ్లడం గమనించి అదలిస్తూ అవైపు వెళ్లింది.

చిట్టడవికి అవతల రిజర్వ్‌ఫారెస్టువుంది. అటువెళ్లే నాటుదారిలో ఒక జీపువచ్చి మర్రిచెట్టుకు కొద్దిదూరంలో ఆగిన చప్పుడయింది. ఆవును మళ్లించుకుని వస్తున్న ఆ పిల్ల వింతగా అటువైపు చూసింది.

జీపులోనుండి ఇద్దరు మనుషులు దిగారు. డ్రైవర్ మటుకు ఇంజను ఆపకుండా తన సీటులోనే కూర్చున్నాడు.

మర్రిచెట్టు దగ్గరకు వచ్చిన ఆ మనుషులలో ఒకడు ఉయ్యాలలో పాపను పైకితీస్తున్నాడు.

భయంగా— "మా గవిరినేల తీత్తుండారు?" అని అరుస్తూ వచ్చింది లచ్చి అక్కడికి పరుగెత్తుకుంటూ.

రెండో మనిషి ఆమె నోరు గట్టిగా నొక్కి జేబులోనుండి ఒక రుమాలుతీసి ఆమె నోట్లో కుక్కాడు.

పసిపిల్లకు మత్తుమందు చల్లిన రుమాలు వాసన చూపిస్తూ, మొదటి మనిషి లచ్చివైపు చూసి అన్నాడు— "ఈ గుంట మంచి పైలా పచ్చీసుగా ఉందిరా!"

"నేనూ అదే అనుకుంటుండా. రిజర్వ్ అడివిలో పాడుపడ్డ గుడుందికదూ? అక్కడికి తీసుకుపోదాం దీన్ని..." అంటూ రెండవమనిషి గిలగిల కొట్టుకుంటున్న లచ్చిని జీపువైపు ఈడ్చుకువెళ్లాడు.

మొదటి మనిషి పసికందును జీపులోపల సీటుమీద పడుకోబెట్టాడు.

జీపు కదిలింది.

★ ★ ★

ఆ సాయంత్రం పిల్లలు మామూలుగా ఇంటికి తిరిగిరాలేదు. చెల్లాచెదురుగా పశువులు మటుకే తిరిగి రావడంతో వాళ్లను వెతుక్కుంటూ చిట్టడవికీ, రిజర్వ్ ఫారెస్టుకూ హరిజనవాడవాళ్లతో వెళ్లిన చెంద్రికీ, గవరయ్యకూ ఊడలకు కట్టిన ఖాళీ ఉయ్యాలా, గుడిలో విరిగిపడిన ధ్వజస్తంభంపక్క నెత్తుటిమడుగులో నగ్నంగా, ప్రాణం లేకుండాపడివున్న లచ్చి కళేబరమూ కనిపించాయి.

ఆరోజుల్లో నక్రుత్తుగా మటుకే జరిగే కిడ్నాపింగూ, రేపూ, మర్డరూ అలా నాలుగో మనిషికి




తెలియకుండా జరిగిపోయాయి. ఆ తరువాత మామూలే - తల్లిదండ్రుల ఆక్రందనా, పోలీసుల కళ్లతుడుపు విచారణా, యధావిధిగా కొనసాగాయి. గవిరి ఆచూకీగాని, లచ్చిమీద అత్యాచారం జరిపి పీక నులిపి చంపిన మనుషుల జాడగాని దొరకలేదు. రికార్డులలో "కేసు నిజమేగాని కూపీ దొరకలేదు" అని నమోదు అయింది ఈ సంఘటన.

★ ★ ★

ఆరోజుల్లో ఇంకా సానివాడలూ, సానివీధులూ - మెరకవీధీ, టెంపుల్‌స్ట్రీటూ, జంగాల వీధీ, భోగంపేటా, మిట్టవీధీ- మొదలైన పేర్లతో - తెలుగుదేశంలో ఒక రకమైన పట్టణాలన్నిటిలోనూ వుండేవి ప్రత్యేకంగా.

ఆ వృత్తి నెరిపే ప్రతి మనిషికీ ఒక ఇల్లు వుండేది - అగరువత్తులూ, సెంటువాసనలూ, రవివర్మ శృంగార చిత్రాలూ, దిగంబర స్త్రీల బొమ్మలూ, వాజుల్లో కాగితంపూలూ, నిలువుటద్దం, తెల్లని దుప్పటీపరిచి, డిజైన్లు కుట్టిన గలీబుల దిళ్లువేసిన పెద్ద మంచమూ - ఇలాటి, ఆ వృత్తికి ఆనుషంగికమైన ఉపకరణాలు వాళ్లకి వుండేవి.

పగలంతా నిద్రపోయి, సాయంత్రంలేచి నీళ్లుపోసుకుని చక్కగా అలంకరించుకుని తమ ఇళ్లలోనే వృత్తి కొనసాగించేవాళ్లు. వాళ్ల జీవితాలు ఒకరకంగా గౌరవంగానే నడిచేవి. ఇప్పటిలా బస్ స్టాండులలో, రైల్వేస్టేషన్లలో, పార్కులలో, సినిమాలదగ్గరా, కిళ్లీబడ్డీల వెనుకా ఈ వృత్తి నడవడం ఇంకా మొదలవలేదు ఆరోజుల్లో.

తమకే జీవికగడవని గంపెడుమంది పిల్లలువున్న సంసారాల్లో అందరినీ పోషించలేక ఆడపిల్లలను అమ్మివేసేవారు కొందరు తల్లిదండ్రులు.

అక్రమసంతానం కని సంఘానికి భయపడి పుట్టిన పిల్లలను అమ్మేసేవారు ఇంకొందరు. పిల్లలను దొంగిలించి అమ్మే ముఠాలు వుండేవి. వారినుండి ఒకరిద్దరు ఆడపిల్లలను కొనుక్కుని, సొంత సంతానంలాగే పెంచి సంగీతం, నాట్యం, కొద్దిగా చదువూ, హిందీ భాషా నేర్పించేవారు. కొద్దిగొప్పో తమ వృత్తికి కావలసిన మర్యాదలూ, అలవాట్లూ నేర్పించి, తగిన వయస్సు వచ్చాక అన్ని లాంఛనాలతో శుభముహూర్తంలో కన్నెరికం జరిపించి తమ వృత్తిలోనికి దింపేవాళ్లు. తమ వయస్సు చెల్లిన తరువాత జీవికకు ఆధారంగా వుండేది వీళ్లే.

అటువంటి ఒక ఇంటికి చేరింది గవిరి. చంద్రిక అనే వేశ్యకు పెంపుడు కూతురు మనోహరిగా మారింది ఆ మూడేళ్లు నిండిన వయసులో.

మనోహరికిప్పుడు పదిహేడవ ఏడు.

ఆమెకు ఇక కన్నెరికపు చెర తీర్చి తమ వృత్తిలోనికి ప్రవేశపెట్టడానికి తగిన శ్రీమంతుడైన వ్యక్తికోసం ఆరేడు నెలలుగా వెదుకుతోంది చంద్రిక. ఆమెకు ఇప్పుడు నలభై రెండేళ్లు దాటాయి- మనూవృత్తిలోనికి దిగితే తాను మందగిస్తున్న తన వృత్తి పూర్తిగా మానెయ్యవచ్చు.

ఒకరోజు మధ్యాహ్నం హడావుడిగా మాధవరావు వచ్చాడు. అతడు ఆ సానివాడలో తారుపువృత్తిలోవున్న వ్యక్తి.

మనోహరి గురించి చింతపడుతూ సరిగా నిద్రపట్టక మంచం మీద పొరలాడుతూంది చంద్రిక. మనోహరి కోసం చాలామంది విటులు వస్తున్నారు. అంతవరకు భద్రంగా వున్న ఆ కన్యాత్వాన్ని అనుభవించేందుకు డబ్బు కూడా ఎక్కువగానే ఇస్తామంటున్నారు. కాని వయస్సు, రూపం, ఆరోగ్యం, డబ్బూ అన్నీ వున్న మనిషే దొరకడంలేదు. కన్నకూతురి కోసం వరుడిని వెదికేటంత కన్నా ఎక్కువగా ప్రయత్నాలు చేసేవారు ఆరోజుల్లో నీతీనిజాయితీ ఉన్న వేశ్యలు.

మాధవరావు "చంద్రం పిన్నీ" అని పిలుస్తూ తలుపు నెమ్మదిగా కొట్టడం విన్న చంద్రిక కొద్దిగా చిరాకుతో ముడుచుకుంది.

అప్పుడప్పుడూ మధ్యాహ్నం పూట కూడా విటులను తార్చి తెస్తుంటాడు అతడు. కాని పగటిపూట ఆ వృత్తి అంటే నచ్చదు ఆమెకు. మామూలు రేట్లకు ఒకటి రెండు రెట్లు ఎక్కువ దొరుకుతుంది అంటే తప్ప ఒప్పుకోదు. అప్పుడప్పుడూ పైవూళ్లనుండి ఏవో పనులమీద వచ్చి పోయేవారుంటారు. మధ్యాహ్న భోజనంతోపాటు మధుసేవ కూడా కానిచ్చి, ఆ




రాత్రి తొమ్మిది గంటలు దాటబోతోంది. అతను ఉత్సాహంగా స్టేషన్‌కేసి నడుస్తున్నాడు. కాసేపట్లో సూదుల్లా గుచ్చుకునే ఈ పోలీసుడ్రస్‌తో తనకు రుణం తీరిపోతుందనుకున్నాడు.

దారిలో కలిసిన మరో పోలీసుతో కలిసి కబుర్లు చెపుతూ వడివడిగా అడుగులేస్తున్నాడు.

ఆ దారి చింతలతోపుగుండా పోలీసుస్టేషను చేరుకుంటుంది.

ఇంతలో వినిపించిందో కేకలాంటి అరుపు. ఓ స్త్రీగొంతు. కేకవెయ్యడానికి నోరు తెరవబోతుండగా మధ్యలోనే ఎవరో నోరు నొక్కుతున్న పరిస్థితి...

అతి పవిత్రుడు, ఆదర్శవంతుడు అయిన ఆ వ్యక్తి దుష్టశిక్షణకు దోహదంచేసే పోలీసు ఉద్యోగాన్ని ఎందుకు వదులుకోవాలనుకున్నాడు?

అర్థరాత్రయినా కాకుండానే చింతల తోపులోంచి వినిపించిన ఆ కేక ఎవరిది ?

అనుక్షణం ఉత్కంఠతతో మిమ్మల్ని చదివించి, మీ హృదయాలను కదిలించే తెలుగుకథ 'డ్యూటీ' కథల పోటీలో బహుమతి పొంది జూన్ 'విపుల'తో మీ వద్దకు రాబోతోంది.

## ఆసక్తికరమైన మరో 16 కథలతో

## జూన్ సంచిక

# విపుల

## రెండున్నర రూపాయలే

తర్వాత అనుభవం వున్న స్త్రీలకోసం ఆరాటపడే మధ్యవయస్సు చెల్లిన పురుషులుంటారు. వారు హోటలు వరండాలో తచ్చాడే మాధవరావును పిలుస్తారు. అతడు చంద్రికలాంటివాళ్లను ఏర్పాటుచేస్తుంటాడు. కాదంటే కాళ్లావేళ్లాపడి బతిమిలాడ్తాడుకూడా. తమ వృత్తికి సాయపడే మాధవరావు మాట కాదనలేనివాళ్లు ఒప్పుకుంటారు.

అయితే అలాంటి సమయాల్లో చంద్రిక రాత్రి ఉండేటంత హుషారుగా వుండక, ఏదో యాంత్రికంగానే పరిశ్రమిస్తుంది. ఏమైనా మాధవరావు వస్తే తలుపు తీసి మాట్లాడటం మటుకు తప్పదు. నాలుగో పడిలో వున్నా రూపమూ, ఆరోగ్యమూ జాగ్రత్తగా కాపాడుకోవడం వల్ల ఆమెను చూసినవాళ్లు మూడవ పడిదాటిన మనిషంటే నమ్మటం కష్టం.

అనిష్టంగా లేచి ఆవలిస్తూ, తలుపు తీసి ఒళ్లు విరుచుకుంటూ- "ఏమిటి మాధవా? నిద్రపోయేవేళకొచ్చావు?" అని అడిగింది.

"చెల్లెమ్మ గురించి పిన్నీ... చాలా మంచి గోల్డెన్ ఛాన్స్. ఈ రాత్రి ఏడున్నరకి మంచి ముహూర్తం వుంది".

మనోహరి గురించి అని వినగానే చిరాకు మాయమైంది. అతడిని లోపలికి రమ్మని, వచ్చాక వీధి తలుపు ఓరగా వేసింది చంద్రిక.

★ ★ ★

సంజచీకట్లు బాగా ముదురుతున్నవేళ ఒక కారులో ఆ సాయంత్రం చంద్రిక ఇంటికి వచ్చాడు సురాజ్‌మల్. వయస్సు ముప్పైదాటినా చూడటానికి ఆరోగ్యంగా అందంగా పాతికేళ్లు నిండని మనిషిలా- కనిపిస్తున్నాడతను.

బొంబాయిలో హిందీ సినిమా ప్రొడ్యూసర్ రతన్‌మల్ ఏకైక పుత్రుడు అతడు. ముందు తీసిన రెండు సినిమాలూహిట్స్ కావడంతో మంచి పేరు వచ్చింది ఆ ప్రొడ్యూసర్‌కు. సురాజ్ తన తండ్రి అడుగుజాడల్లోనే అనుభవం గడించి, కొత్త సినిమా కథ సంపాదించి, స్క్రిప్టు తయారుచేయించుకుని అప్పటికి బాగా ప్రచారంలో వున్న ఒక హీరోను బుక్‌చేసి హీరోయిన్‌గా కొత్త అమ్మాయిలను వెతుకుతున్నాడట-

చంద్రిక ఓ పత్రికలో చదివింది ఇవన్నీ

ఆ మధ్యాహ్నం మాధవరావు అతని సంగతిచెప్పి మనూ కన్నెరికానికి ఆ రాత్రే ఏర్పాట్లు చెయ్యమన్నాడు.

చంద్రిక మనస్సు ఆకాశానికి ఎత్తినట్లుగా అయింది. మనోహరికి మంచి ఛాన్సే కాకుండా, తనకూ ఆర్థికంగా మంచిరోజులు రాబోతున్నాయన్న ఆశ కలిగింది. మొత్తం మూడు రాత్రుల బేరం అది- మొదటిరాత్రికి అయిదు వందలు. అంటే తులం బంగారం! మిగిలిన రాత్రులకు రెండు వందలు. తనకు నచ్చితే మనోహరిని సినిమా తారగా మారుస్తానని కూడా అన్నాడట ఆ సురాజ్ మాధవరావుతో.

హుషారుగా ఉన్న చంద్రిక సురాజ్‌మల్ కోసం వంద రూపాయలు ఖర్చుపెట్టి స్వీట్లు, పూలదండలూ, కొత్తబట్టలూ మొదలైనవి- ఆ కన్నెరికం ఉత్సవానికి కావలసిన వన్నీ తెప్పించింది. చుట్టుపక్కల తమ జాతి స్త్రీలను కొంతమందిని పిలిపించి ఏర్పాట్లన్నీ పూర్తిచేసింది.

కారు దిగగానే సురాజ్‌కు అయిదారుగురు స్త్రీలు హారతి ఇచ్చి లోపలకు తీసుకెళ్లారు. పారాణి నీళ్ళతో దిష్టి తీసి వీధిలో పారబోశారు.

తనకు చేసిన అలంకరణతో అప్సరసలను తలదన్నేట్లుగా మనూ అంతకుముందే విఘ్నేశ్వర పూజా, గౌరీదేవి పూజా చేసింది.

మనూ, సురాజ్‌లను పీటలమీద కూర్చుండబెట్టి, కుంకుమ బొట్లుపెట్టి, అక్షింతలు జల్లారు.

ఇంకా కన్నెరికం కాని యువతులు సరదాగా ఆ దృశ్యం చూస్తున్నారు.

అక్కడ ఏర్పాటుచేసిన రాధాకృష్ణుల పూజాపీఠం ముందు కొత్త జంటను కూర్చోబెట్టి పూజచేయించారు. చంద్రిక శ్రావ్యంగా శ్రీకృష్ణ కర్ణామృతంలోని శ్లోకాలు పాడింది. పూజ ముగిసిన తరువాత సురాజ్ లేచి చంద్రిక కాళ్లకు నమస్కారం పెట్టి మెరమెరలాడే అయిదు వందల రూపాయల నోట్లు తీశాడు. రాధాకృష్ణ విగ్రహాల ముందువున్న పళ్లెంలో అయిదు పిచ్చు రూపాయలతోపాటు వుంచాడు. మళ్లా స్త్రీలు మంగళహారతి ఇస్తున్నప్పుడు రెండు

గుప్పెళ్లలో ఏచ్చు రూపాయలు తీసి హారతి పళ్లెరంలో గలగల జారవిడిచాడు. అంతకు ముందు మాధవరావు చెప్పినట్లుగానే చేశాడు అతడు ప్రతిదీ.

అందరి కళ్లూ మిలమిల మెరిశాయి ఆ రూపాయల గలగలలతో.

మధ్యాహ్నం అమ్మ తనను నిద్రలేపినప్పటి నుండి మనోహరి ఊహాలోకంలో విహరిస్తోంది. ఆ కలలు ఆమె నిజంగానూ, సినిమాలలోనూ చూసిన పూలతోటల్లోనూ, ఫౌంటెన్ల నడుమా కొంతసేపు నడిచాయి.

మనస్సు రంగుల బాటలలో పయనించి చాలా ఎత్తులకు వెళ్లి, అక్కడి నీలిమబ్బులనూ, పండు వెన్నెలల్నీ నక్షత్రాల తళతళల్నీ దాటుకుని ఇప్పుడు సురలోకంలో నందనవనంలో గంగానదీ తరంగాల మీదనుండి వచ్చే చలువ గాలులలో, ఎప్పుడూ భూలోకంలో ఎవరూ చూడని వింతవింత పూల అపూర్వమైన కమ్మతావులు అలముకుపోతుండగా, ఎక్కడో రహస్యంగా దాచివుంచిన అమృత కలశపు తీయదనాలు కమ్ముకుపోతుండగా దేవనాట్యం చేస్తున్నది.

అన్నివైపులా చిత్రవర్ణ పుంజాలు కలగాపులగంగా చెదిరిపోతున్నాయి. సిగ్గుతో తల వంచుకుని, కుంచించుకుని కూర్చునివున్న ఆమె ఘల్లుఘల్లుమనే రూపాయల చప్పుడు వినరాగానే ఓరగా హారతి పళ్లెరంవైపు చూసింది. అక్కడి నుండి ఆమె చూపులు విగ్రహాలముందున్న పూలపళ్లెరంలోని నోట్లమీదికి మరిలాయి. అంతకుముందు తాను విన్న దానిప్రకారం ఆ వాడలో మామూలుగా కన్నెలకు లభించే మూల్యంకన్నా అది చాలా రెట్లు ఎక్కువ. ఇన్నాళ్లుగా తాను భద్రంగా దాచుకున్న కన్యాత్వానికీ, దేవుడు తనకిచ్చిన సౌందర్యానికీ ఇంత విలువా అని ఆశ్చర్యపడి ఒకరకమైన వింత గర్వమూ పొందిందామె మనస్సు.

ఆ తరువాత వాళ్ళిద్దర్నీ మల్లె, గులాబీ పూలసరాలతో అలంకరించిన పందిరి పట్టె మంచం ఉన్న పడకగదిలోనికి తీసుకెళ్లారు. వాళ్లను మంచం మీద ఎదురెదురుగా కూర్చుండబెట్టి వాళ్ల చేత కొబ్బరి బోండాలు పెట్టిన తాంబూలాలు అందరికీ ఇప్పించారు.

తలుపుకి గొళ్లెంపడగానే లోపల గడియపెట్టాడు సురాజ్.

నవవధువులాగే సిగ్గుతో, భయంతో అనుభవం పొందింది ఆ రాత్రి మనోహరి.

ఆ మరునాడు ఉదయం సురాజ్ కారులో మనోహరి ఎక్కే ముందు మిగిలిన రెండు రాత్రులకోసం నాలుగు వందలేకాక మరొక మూడు వందలు ఎక్కువ ఇచ్చాడు చంద్రికకు. తక్కిన రెండురోజులూ హోటల్లో మిస్టర్ ఎండ్ మిసెస్ సురాజ్‌మల్ కోసం కుదిర్చిన డబుల్ రూంలో వాళ్లు గడపడానికీ, నాలుగవ రోజు ఉదయం మాధవరావు మనోహరిని తీసుకురావడానికి ఏర్పాటు అయింది.

తాను కన్నకలలలోలా కాకుండా మనస్సు నీలిమబ్బుల వరకే వెళ్ళి అసంతృప్తిగా తన మొదటి లైంగికానుభవం పొందింది మనోహరి మూడురోజులూ. అయితే తాను పుష్పవతి అయినప్పటినుండీ తల్లి తనకు బోధించింది- ఏఅనుభవమూ పొందకపోయినా పొందినట్లే నటించి విటుల పురుషత్వాన్ని పొంగించాలని - పాఠాలు నేర్చుకుంది ఆమె. పైకి మటుకు సురాజ్ తనకు స్వర్గసౌఖ్యం చవిచూపించాడు అన్నట్లుగానే నటించింది. అతడుగాని తనను వదిలేసి వెళ్ళిపోతే తన ముందుజీవితం అంధకారమయం అయిపోతుందని అతనితో చూచాయిగా అంది కూడా.

మనూ, సురాజ్‌లు వెళ్ళిన తరువాత చంద్రిక ఏడు వందరూపాయల నోట్లు - నరికొత్తగా మెరమెరలాడ్తూ పూతరేకులలా ఉన్నవి - పదిసార్లు తడిమి తడిమి లెక్కపెట్టుకుంది. లోపలి గదిలో నేలమాళిగలో బిగించిన ఇనుపపెట్టెలో అంతకుముందురోజు పెట్టిన అయిదువందల నోట్లమీద దొంతిపెట్టి దారంకట్టి మళ్ళీ తాళంవేసేసింది. పరీక్షగా చూసిన వాళ్ళుకూడా చదరపు గళ్ళలా సిమెంట్ ప్లాస్టర్ చేసిన ఆ నేలలో ఒక ఇనుపపెట్టె వుందనీ, పాతికవేలకు పైగా ఖరీదుచేసే నగలూ, బంగారమూ అందులో వున్నాయనీ ఊహించలేరు. అంత చక్కగా అమరిపోయింది అక్కడి సిమెంట్ స్లాబ్.

ఇన్నేళ్ళుగా అభిమానంతో పెంచి, విద్యాబుద్ధులు నేర్పించిన మనోహరి వల్ల అంత డబ్బు వస్తుందని ఏనాడూ ఊహించలేదు ఆమె. సురాజ్ చెప్పినప్రకారం - వారంరోజుల్లో కెమేరా వాళ్ళూ, సౌండ్ రికార్డింగ్‌వాళ్ళూ వచ్చి మనోహరిని రకరకాల పోజులలో ఫొటోలు తీస్తారు. వివిధ భావాలకు అనుగుణంగా డైలాగులు చెప్పించి రికార్డు చేస్తారు. డైరెక్టర్ 'ఓకే' చేస్తే చంద్రిక, మనోహర్ ఒకటి రెండు నెలలలో బొంబాయి వెళ్ళిపోతారు. వాళ్ళభావిజీవితం శాశ్వతంగా సుఖమయంగా, శ్రీమంతంగా నడుస్తుంది.

ఏవేవో కలలు ఆమెలో కదలాడుతున్నాయి... క్రితంరోజు మధ్యాహ్నం నుండి ఊపిరి తీయటానికి కూడా వీలులేకుండా తిరిగిన ఆమె వెళ్ళి మంచంమీద ఒళ్ళు వాల్చగానే గాఢనిద్రలోకి జారింది.

అయితే ఆ ఆనందం, కలలూ నాలుగవ రోజు ఉదయం ఒక్కసారిగా పగిలిపోయాయి.

* * *

మాధవరావు గాభరాగా వచ్చాడు. ఆ తెల్లవారుజామున నాలుగుగంటలకే తమ డబుల్ రూం ఖాళీచేసి బిల్లు చెల్లించి మనోహరీ, సురాజ్ ఇద్దరూ కారులో వెళ్ళిపోయారనీ, ఎక్కడికి వెళ్ళారో ఎవరికీ సరిగా తెలియదనీ చెప్పి నెత్తిమీద చేతులు పెట్టుకొని కూర్చున్నాడు.

షాక్‌తో మూర్ఛపోయింది చంద్రిక. కలలు పగిలిపోయినందుకే కాదు- పదిహేనేళ్ళుగా అంత అభిమానంగా, అల్లారుముద్దుగా తాను పెంచిపెద్ద చేసిన మనూ మూడురోజులే పరిచయం వున్న కొత్తమనిషితో లేచిపోయింది! తననూ, ఆమెనూ కట్టిపెట్టి వుంచిన అనుబంధం, మమతా అన్నీ ఒక్కసారిగా కత్తిరించి మట్టిలో గిరవాటువేసిందే అన్న బాధ తీవ్రంగా ఆమె మనస్సుమీద దెబ్బతీసింది.

పోలీసులు ముందు శ్రద్ధతీసుకోలేదు కాని, సురాజ్ ఇచ్చిన కొత్తనోట్లు మూడు వాళ్ళచేతికి వచ్చి, మనోహరిగాని ఇంటికి తిరిగివస్తే ఇంకొక అయిదునోట్లూ ముద్దాయన్న ఆశ కలిగిన తర్వాత ఒక దళం బొంబాయి వెళ్ళింది. బొంబాయి పోలీసుల సహాయంతో చందన్‌మల్ రతన్‌మల్ ఇంటికి వెళ్ళగా తెలిసిందేమిటి అంటే, అతని ఏకైక పుత్రుడు సురాజ్‌మల్ రెండు నెలలకిందట ఏదో గుండెజబ్బురాగా అతనిని అమెరికా తీసుకువెళ్ళారట ఇంకా ఇండియా తిరిగి రాలేదట. దాంతో మనోహరిని లేవదీసుకుపోయింది అసలు సురాజ్‌మల్ కాదనీ నకిలీ సురాజ్ అని తేలిపోయి, ఇంక ఏఆధారాలూ దొరకక ఆ పోలీసు దళం తిరిగివచ్చింది వెర్రిమొహాలతో.

హారతి పళ్లెంలో వేసిన విచ్చు రూపాయలు తప్పించి నకిలీ సురాజ్ చంద్రికకూ, మాధవరావుకూ, రెయిన్-బో హోటలువాళ్ళకూ, ఊళ్లో మరికొంతమందికీ ఇచ్చిన వందరూపాయల నోట్లన్నీ దొంగనోట్లని కూడా తేలింది చివరకు.

తమ వంతుకు వచ్చిన మూడునోట్లూ పోలీసువాళ్లు కాల్చేసి, చంద్రికకు తప్ప తక్కినవాళ్లకు నకిలీ సురాజ్‌మల్ ఇచ్చిన నోట్ల విషయంలో కేసు నమోదుచేశారు.

చంద్రిక తనవద్ద మిగిలిన తొమ్మిది నోట్లూ ఏడుస్తూనే బూడిదచేసింది.

సురాజ్ తమకోసం వెదకుతున్న పోలీసు దళం బొంబాయి వచ్చినప్పుడు అక్కడే ఒక పెద్ద హోటలులో మిస్టర్ అండ్ మిసెస్ చంద్రదేవ్ అన్నపేరుతో డబుల్‌రూంలో వున్నాడు. ఈ కొత్త పేరెందుకని మనోహరి అడిగితే- తన అసలుపేరు తెలిస్తే ఎక్కడెక్కడి యువతులూ సినిమా ఛాన్సుకోసం వచ్చి తన మీద దాడి చేస్తారనీ, అదీగాక తాను బొంబాయి వచ్చానని తెలిస్తే తన తల్లిదండ్రులు వస్తారనీ, అందువల్ల ఆమెకోసం వేరే ఏర్పాటుచేసే వరకు మారుపేర్లతో ఉండటం ఉత్తమం అనీ చెప్పాడు. ఆ అమాయకురాలు అతని మాటలు నమ్మింది.

ఆమె నిజమైన తృప్తిపొందకపోయినా అలా నటిస్తే, అదంతా నిజమేననీ తనవంటి పురుషుడు లేడనీ పొంగిపోతూ ఒకవారంరోజులపాటు తనివితీరా ఆమెను అనుభవించాడు సురాజ్. తర్వాత ఒకరోజు సినిమాకోసం టెస్టులు అన్నీ ఆగ్రాలో జరుగుతాయనీ, తాజ్‌మహల్ ముందు నిలబెట్టి ఆమె ఫొటోలు తమ కెమేరావాళ్లు తీస్తారనీ చెప్పి సురాజ్ ఆమెను ఆగ్రాకు తీసుకువెళ్లాడు. ఈసారి మిసెస్

ఎండ్ మిస్టర్ రాజేంద్రప్రసాద్ అన్నపేరుతో ఒక హొటల్‌లో దిగారు.

అక్కడి మొదటిరాత్రి ఆమెను కాస్తమోటు పద్ధతిలో అనుభవించాడు సురాజ్. అది బాధ కలిగించినా సినిమా తారమోజులో సహించిన మనోహరి మామూలుకన్నా మరింతగా తృప్తి నటించింది.

ఆమరునాడు ఉస్టులకు తాజ్‌మహల్‌కు వెళ్లామని ఆమెతోపాటు బయల్దేరాడు అతడు. సందులూగొందులూ తిరిగి తిరిగి వెళ్లి ఒక మూడంతస్థుల మేడముందు కారు దిగారు. అంతకు ముందు తాజ్‌మహల్ బొమ్మ చాలా సార్లు చూసిన మనోహరి ఆశ్చర్యం నిండిన కళ్లతో అతనివైపు చూసి "ఇది తాజ్‌మహల్ కాదే?" అంది.

"కెమేరా, సౌండ్‌రికార్డింగ్ మనుషులెక్కడ ఉన్నారు... మరి వాళ్లని తీసుకెళ్లొద్దు?" అంటూ టాక్సీ డ్రైవరుకు మామూలు రేటుకన్నా ఎక్కువ ఇచ్చి ఆమె చేయిపట్టుకుని విలాసంగా గేటువైపు నడిపించాడు అతడు.



మొనదేరిన పెద్దపెద్ద బల్లాల ఇనుపగజాలున్నగేటు అది. ఆ గేటుదగ్గర తచ్చాడుతూన్న గూర్ఖామనిషి సురాజ్‌ను చూడగానే వచ్చి సెల్యూట్‌చేసి గేటు తాళం తీశాడు. వాళ్లు లోపలికి వెళ్లగానే మళ్ళీగేటు తాళం వేసేశాడు.

లోపలికి వెళ్లిన మనోహరి తలపైకెత్తి చూసింది. ఆ భవనంపైన చాందినీమహల్ అన్న పెద్ద అక్షరాలు కనిపించాయి. తల్లి చంద్రిక జ్ఞాపకంవచ్చి కొద్దిగా బాధగా అనిపించింది. సినిమాలో కొంత డబ్బు గడించగానే తల్లిని పిలిపించి తసదగ్గర పెట్టుకుంటా.. ననుకుంటూ మనస్సు సరిపెట్టుకుంది. తనకు అనలు తల్లి 'చెంద్రి' అన్న నంగతి ఆమె జ్ఞాపకాల పలక మీద ఏనాడో చెరిగిపోయింది.

గేటుకి ఒకవక్క గోడవారగా తుపాకీ ఒకటి వగడం రంగులో మిలమిల మెరుస్తున్నది—

ఆనించి ఉండటం గమనించిన ఆమెకు గుండె ఝల్లుమంది. సినిమాలలో తప్ప నిజమైన తుపాకీ అంతదగ్గరనుండి ఆమె ఎప్పుడూ చూడలేదు.

ఆ గేటుకు రెండవవైపు ఒక చిన్న గేటు వుంది. దానివక్కనే ఒక వేపచెట్టు నీడలో నల్లగా లావుగా నిగనిగలాడే ఒంటితో బనీనూ, అండర్‌వేరూ మటుకే వేసుకున్న ఒకవ్యక్తి పెద్ద పెద్ద మీసాలతో కనిపించాడు. అతన్ని చూడగానే గుండె ఝల్లుమంది మనోహరికి.

ఆ మహల్‌లోపల కింది అంతస్తులో నాలుగు గదులు దాటి ఒక సన్నని కారిడార్‌లోకెళ్లిన తర్వాత ఉన్న హాలులో ఒక మెత్తటి కుర్చీ, దానిముందు పెద్ద టేబులూ, అవతలివైపు రెండు ఎత్తయిన కర్రకుర్చీలూ వున్నాయి.

సురాజ్ ఆమెను ఒక కర్రకుర్చీలో కూర్చోమనీ, తాను కొద్దిసేపటిలో వస్తాననీ చెప్పి కారిడార్‌లో వచ్చిన దారినే వెనకకు వెళ్లిపోయాడు.

ఒక పావుగంట గడిచింది.

కారిడార్‌కు కుడివక్క వున్న తలుపు తెరుచుకుని ఏభైఏళ్లు పైబడిన స్థూలకాయురాలైన ఒక స్త్రీ వచ్చి ద్వారబంధం మీద చేయివేసి నిలబడి కొద్ది క్షణాలు మనోహరిని మేకనూ, అవునూ, గుర్రాన్నీ కొనేవాళ్లలాగే పరకాయించి చూసింది. సంతృప్తిగా కళ్లు పెట్టి బరువుగా ఏనుగులా నడుచుకుంటూ వచ్చి మెత్తలకుర్చీలో కూర్చుంది. ఆమెను చూడగానే ఒకప్పుడు అందమైన మొహంకల మనిషిలాగే కనిపిస్తున్నా మనోహరికి మూడవసారి గుండె ఝల్లుమంది. ఆశ్చర్యంగా "ఎవరీమె?" అనుకుంటూ ఆమెవైపే చూస్తూ ఉండిపోయింది. ఆమె నోరు అప్రయత్నంగా తెరచుకుంది- ముత్యాల సరాల్లా కనిపిస్తున్న పలు వరుసలతో.

ఆ స్త్రీ కళ్లు కొద్దిగా సన్నగా మూసి మనోహరి వైపు రెప్పవేయకుండా కొన్ని క్షణాలు చూసింది! ఒకప్పుడు మార్దవం నిండి వుండినా ఇప్పుడు వయస్సుతో, నములుతున్న జరదాకిళ్లీతో, బొంగురుగా వినిపించే గొంతుతో మందలిస్తూ అంది హిందీ భాషలో- "పెద్దవాళ్లు వచ్చినప్పుడు లేచి నమస్కారం పెట్టడం తెలియదూ? మీఇంట్లో మేడం ఆమాత్రం మర్యాద నేర్పించలేదూ, ఇన్నేళ్లొచ్చినా నీకు?"

ఆ మాటలలో ఎలక్ట్రిక్‌షాక్ తగిలినట్లుగా ఒక్క ఉదుటున వెర్రిగాలేచి నిలబడింది మనోహరి. కొద్దిగా వణికిపోతున్న గొంతుతో "క్షమించండి- పొరపాటు" అని నమస్కారం పెట్టి మళ్లీ కుర్చీలో కూర్చోబోయింది.

"ఆగు!" గద్దించి గట్టిగా అంది ఆస్త్రీ. తుళ్లిపడ్డ మనోహరి మళ్లీ నిటారుగా నిలబడింది. వెర్రిగా ఆమె మొహం వైపు చూస్తూ వుండిపోయింది, జరుగుతున్నది బోధపడకుండా.

"కూర్చోమని నేను చెప్తేగాని ఎవరూ నా ఎదుట కూర్చోడానికి వీలులేదు. జ్ఞాపకం వుంచుకో!" అంది ఆ స్త్రీ- తర్వాత "నీ పేరు?" అని అడిగింది.

ఒళ్లుకూడా గొంతుతోపాటు గజగజ వణకడం మొదలుపెట్టింది మనోహరికి. అంతలో, మునిగిపోతున్న మనిషికి గడ్డిపోచలా ఒక ఊహ వచ్చింది ఆమెకు. వాయిస్ టెస్ట్ కోసం సురాజ్‌మల్ సినిమాల్లోలా ఒక సన్నివేశం కల్పించి తన గొంతు రికార్డ్ చేయిస్తున్నాడేమో! ఆ తలపుతో కొద్దిగా ధైర్యం తెచ్చుకుని నెమ్మదిగా "మనోహరి" అని అక్షరాలు కూడబలుక్కుంటూ అని "మీ....మీ....రు....మీరెవరు?" అంది.

పకపక నవ్వింది ఆస్త్రీ. హాలుగోడలు ఆ నవ్వును పదిరెట్లెక్కువ చేశాయి. హిమాలయ శిఖరాలమీదకాని ఆ నవ్వు అలా ప్రతిధ్వనించి వుంటే పెద్దమంచు గడ్డ ఆ శబ్దతరంగాల తాకిడిలో కదిలిపోయి దొరలడం మొదలుపెట్టి వుండును. ఇక్కడ మటుకు మనోహరి నెత్తురంతా గడ్డకట్టుకుపోతూ అతిచల్లగా, బరువుగా మారినట్లయింది.

అతికష్టంమీద నవ్వడం ఆపిన ఆస్త్రీ అంది "నేనా? నేను ఈవాళ్టినుండి నీ యజమానిని! ఏమాట నాతో అన్నా ముందు మేడం అని పిల్చి చెప్పు ఇప్పటినుంచీ... అదే నాపేరు!"

చంద్రిక తన నేస్తాలతో మాట్లాడుతున్నప్పుడు ఉత్తర హిందూస్తానంలో వ్యభిచార గృహాల అధికారిణులను 'మేడం' అంటారని విని

శేష ... చతుర



వుంది. మనోహరికి గుండె ఒక్కసారిగా ఆగిపోయి మళ్లీ అతి జోరుగా కొట్టుకోవడం మొదలుపెట్టింది. ఇది వాయిస్ టెస్ట్‌కాదు, ఏదో పీడకల అని ఎవరో గట్టిగా అంటున్నారు మనస్సు లోపల!

ఆ స్త్రీ కాలింగ్ బెల్ నొక్కింది. ఒక్కసారిగా ఆ హాలులో అన్నివైపుల నుండి గంటలు గణగణ మ్రోగాయి. ఉలికిపడ్డ మనోహరి వెర్రిగా హాలులో అటూఇటూ చూసింది.

ఆ హాలుకు వున్న పన్నెండు ద్వారాలలో పది ద్వారాలు తెరచుకున్నాయి. పదిమంది స్త్రీలు ఉత్తబాడీలు, పరికిణీలతో బయటకువచ్చారు- కొంతమందికి బాడీలు కూడా లేవు. ఉన్నా హుక్కులు లేవు. పదిహేనేళ్ల నుండి ముప్పై ఏళ్ల వరకూ వయస్సు ఉన్నవాళ్లు- పొలపొలా హాలులోనికి వచ్చి బల్లకు ముందు మూడువైపులా మూగారు. ఒక ఇరవై ఏళ్ల స్త్రీ "జీ మేడం? "అంది.

ఎడమచేతి చూపుడువేలితో మనోహరి వైపు చూపించి ఏమీ మాట్లాడకుండా, ఆ వేలు ఎడమనుండి కుడికి రెండుసార్లు కదలించింది మేడం.

ఆ పదిమంది స్త్రీలూ ముసిముసి నవ్వులతో మనోహరి చుట్టూమూగారు. ఆమె ఎంత ప్రయత్నించినా లాభం లేకుండా, చేతులు గట్టిగా విరిచి పట్టుకుని హాలు మధ్యకు తీసుకువెళ్లి చీరా, జాకెట్టూ, బాడీ, పరికిణీ అన్నీ బలవంతాన విప్పారు. అల్లుకుని ఉన్న ఆమె రెండు జడల పాయలూ విప్పి జుట్టు వదులుగా జారవిడిచారు! ఆమె మెడలో వున్న ఒంటిపేట బంగారు గొలుసుకూడా తీసేసి పూర్తిగా నగ్నంగా నిలబెట్టారు. కాళ్లు ఎడంగా విడదీసి పట్టుకున్నారు ఇద్దరు. మరో ఇద్దరు ఆమె చేతులు చాపి పైకెత్తి వుంచారు.

మేడం చప్పట్లు కొట్టింది గట్టిగా. కాళ్లూ చేతులూ విడదీసి పట్టుకున్న వాళ్లుకాక మిగిలిన ఆరుగురూ- ఇద్దరు వెనుక వైపూ, ఇద్దరిద్దరు మనోహరికి రెండు వైపులా నిలబడ్డారు. మేడం ఏదో స్విచ్ ఆన్ చేయగా హాలులో బార్‌లైట్లన్నీ ఆరిపోయి చీకటిగా అయిపోయింది. తరువాత ఒక్కొక్క స్విచ్ ఆమె నొక్కుతుండగా అతి కాంతివంతమైన తెలుపూ, ఎరుపూ, నీలీ, పసుపూ, ఆకుపచ్చా ఊదా నారింజా రంగుల ఫోకసింగ్ లైట్లు వరుసగా మనోహరి మీద మేడం వెనుక వైపు గోడలో నుండి పడ్డాయి. ప్రతి రంగు వెలుతురుకూ మేడం పది సెకండ్లు వినియోగించింది. ఆ తరువాత మళ్లీ బార్‌లైట్లు వెలిగాయి.

మేడం లేచి నెమ్మదిగా బరువుగా ఏనుగులా అడుగులు వేసుకుంటూ మనోహరి దగ్గరకు వచ్చి చేతులతో అన్ని అవయవాలూ తడిమి తడిమి, నొక్కినొక్కి, రాసి రాసి, పొడిచి పొడిచి చూసింది. ఆ తరువాత బొంత అరటి పండులా ఉన్న ఎడమచేతి చూపుడు వేలు చాపి పొత్తి కడుపు కింద దూర్చబోతుండగా మనోహరి కీచుగొంతుతో కెవ్వుమని అరిచింది. ఒక యువతి ఆమె నోరు గట్టిగా నొక్కిపెట్టింది.

పరీక్ష పూర్తిచేసిన మేడం సంతృప్తికరంగా నవ్వి "గుడ్... మంచి బేరమే" అని ఒక యువతి వైపు తిరిగి "పదో నెంబర్ గది" అంది.

మనోహరివైపు తిరిగి అంది- "మెరుపు తీగలా వున్నావు! ఈవాళటి నుండి నీపేరు శంపా! మనోహరి అన్నది మరిచిపో"

ఇంకోవైపు తిరిగి "ఆ బట్టలన్నీ పట్టుకెళ్లి కాల్చెయ్యండి. ఆ గొలుసిలాఇవ్వండి. ప్రస్తుతానికి లంగా, బాడీమటుకే" అని ఆదేశాలిచ్చి మేడం ముందు ఆఫీసుగదిలో కూర్చుని వున్న సురాజ్‌మల్‌తో బేరం సెటిల్ చేసుకోడానికి వెళ్లింది.

శవంలా వున్న మనోహరిని పదో నెంబరు గదికి అలా దిగంబరంగానే ఈడ్చుకు వెళ్లారు ఆ యువతులు. కొంతమంది మేడంలాగే తామూ ఆమె అవయవాలు పరీక్షించి చూశారు.

గవిరిగా పుట్టి మనోహరిగా పెరిగిన ఆ అభాగిని ఆగ్రాలో చాందినీ మహల్‌లో శంపాగా మారింది అప్పటినుంచి.

* * *

ఆ రోజుల తెలుగుదేశపు సానివాడలలా కాకుండా ఆగ్రా, బొంబాయి మొదలైన పెద్ద

పెద్ద పట్టణాల్లో ఉన్న బ్రోతల్స్ నరకకూపాల్లాగా వుండేవి. క్రమంగా తెలుగుదేశంలోని బ్రోతల్స్ కూడా అదే స్థితికి వచ్చాయి. జైళ్ళలోని దుర్భర పరిస్థితులకన్నా బ్రోతల్స్ వందరెట్లు కన్నా కష్టం. సాధారణంగా వీటి యాజమాన్యం మేడమ్స్ అనిపిలువబడే స్త్రీల చేతులలోనే వుంటుంది. వాళ్ళూ చాలావరకు బ్రోతల్స్‌లో ఉండి యమయాతనలు అనుభవించిన వాళ్ళే. "అత్తా ఒకింటి కోడలే" అన్నది ఎంత నిజమో "కోడలూ ఒకరోజు అత్త అవుతుంది" అన్నదీ అంత నిజమే. అయితే కోడలు అత్త అవతారం దాల్చినప్పుడు తానువడిన కోడంత్రికపు బాధలకు పదిరెట్లు బాధపెడుతుంది తన కోడలును- జరిగినదానికి కసిగా! ఈ మేడమ్స్ అటువంటి ప్రవృత్తి కలవాళ్ళే.

ఒంటరిగా ఉన్నప్పుడు ఎంత కన్నీరు కార్చినా విటులు వచ్చినప్పుడు మటుకు ఆ కన్నీళ్ళన్నీ సబ్బునురగతో కడిగేసుకుంటారు. క్రీం, పౌడర్లు, సెంటువాసనలు, పెదవుల రంగు, కళ్ళ కాటుక, కృత్రిమ చిరునవ్వులూ, ఓరచూపులూ, వయ్యారపు నడకలూ, లబ్బులూ బలవంతాన తెచ్చుకుని ఈ దురదృష్టజీవులు అతిథులను అలరించాలి... ఆనందపరచాలి. ఆకాశంలో ఏడవ స్వర్గం మెట్లెక్కించాలి. సెక్సు ఆకలితో మాడేవాళ్ళూ, సెక్సు విషయంలో రకరకాల వికృతపు కోరికలు ఉన్నవాళ్ళూ చేసే, చేయమనే అమానుషకాండలూ, జుగుప్సకలిగించే అసహజ కార్యకలాపాలూ అన్నీ సహించాలి... నెరవేర్చాలి.

వివిధ మనఃప్రవృత్తులుగల విటులవల్ల కొంత చిరాకు కలిగినా స్త్రీలకు అంతబాధ అనిపించదు- నిజానికి ఆ కోర్కెలూ, కలాపాలూ కొన్ని నవ్వుపుట్టిస్తాయికూడా. అయితే భరించశక్యంకాని అలవాట్లున్న మరికొందరు విటులతో మటుకు నరకబాధలు అనుభవిస్తారు వాళ్ళు. కొరడా దెబ్బలూ, సిగరెట్ల చురకలూ, బ్లేడ్లతో చెప్పరాని చోట్ల గంట్లూ, గాట్లూ, పళ్ళతో కొరుకుళ్ళూ- ఇవన్నీ నెత్తురులు కారినా, మండినా, నొప్పిపుట్టినా, కిమ్మనకుండా సహించాలివాళ్ళు. కొందరు విటులు తమ ఒంటికి పూసే నీచవస్తువుల దుర్గంధం భరించలేక, ఊపిరాడక కొంతమంది స్త్రీలు స్పృహ కూడా తప్పిపోతారు. మరికొన్ని వికార అసహజ కార్యకలాపాలలో మూర్ఛపడటం జరుగుతూ వుంటుంది. ఎంత మనస్సు బండబారినా, డ్రగ్స్ ప్రభావంలో ఉన్నప్పుడు తప్ప సాధారణంగా, ఒక పురుషుడు తనను అనుభవిస్తుండగా మరికొంతమంది చూసి ఆనందిస్తుంటే, ఆ కాండ భరించలేక కొంతమందికి మతి చలించిపోతుంది. విటుల సంతృప్తి కోసం తాగటం, సిగరెట్లు కాల్చడం, డ్రగ్స్ వేసుకోవడం వంటి పనులు ఇష్టంవున్నా లేకపోయినా చేయవలసి వస్తుంది చాలాసార్లు. మామూలుగా బాధ కలిగించని వ్యవహారాలలో కూడా— ఒక్కొక్కప్పుడు తాము నిద్రపోతున్నప్పుడుకాని, మత్తులో ఉన్నప్పుడుకాని విటుడు తమ బాడీలూ, అండర్‌గార్మెంట్లూ దొంగిలించి తీసుకుపోతే ఫరవాలేదుకాని, కత్తెరతో జుత్తులో కొంతభాగం కత్తిరించి తీసుకుపోయినప్పుడు మటుకు ఎంతో బాధపడ్తారు వాళ్ళు.

వచ్చిన విటులలోనేకాకుండా అప్పుడప్పుడూ ఆ బ్రోతల్స్‌కు రహస్యంగా వచ్చే పైతరగతి లెస్బియన్ ఆడవాళ్ళు పెట్టే బాధలు కూడా వాళ్ళు భరించాలి. వాళ్ళే కాకుండా బ్రోతల్స్‌లో సాటి యువతులలోనే కొందరు కొత్తగా వచ్చిన అమ్మాయిలతోగాని, పాతవాళ్లైనా అమాయకులుగా ఉండి మెతకగా ఉన్నావాళ్ళతో కాని ఆ అసహజ కార్యకలాపాలకు దిగి నానాబాధలూ పెడతారు.

ఇన్ని బాధలు పడ్డా, సంఘం చీడపురుగులుగా భావించే ఈ స్త్రీలు గడించేది అతిస్వల్పం. వచ్చినదానిలో పోలీసులకు మామూళ్ళు ఇవ్వడమే కాకుండా అప్పుడప్పుడూ ప్రతిఫలం లేకుండా వారికీ, వారి మిత్రులకూ సంతృప్తి కూడా కలిగించాలి. మిగిలిన ఆదాయంలో తార్పుగాళ్ళకు వాళ్ళ పెర్సెంటేజీ, కాబూలీవాళ్ళ దగ్గర చేసిన అప్పులకు వడ్డీలు, మేడమ్స్‌కు వారి భాగమూ- ఇవన్నీ పోగా మిగిలింది వారి వృత్తికి కావలసిన అలంకరణ సామగ్రికీ, వస్త్రధారణకూ, తిండికీ, మందులకూ సరిపోదు.

ఈ అన్ని బాధలతోపాటు బ్రోతల్స్‌లో అల్లర్లు జరగకుండా చూడటానికీ, జరిగితే ప్రాణా







# ప్రకృతి చెప్పే పాఠాలు!

ప్రకృతి నుండి మనం నేర్చుకోదగ్గవి అనేకం. కొద్దికొద్దిగా కూడబెట్టిదాన్ని ఓ పెద్దమొత్తంగా చేసే నేర్పు కూడా అందులో ఒకటి. ఈ సూత్రాన్ని ఆచరణలో పెట్టడానికి ఉదయతార సహకరిస్తుంది. ప్రత్యేక అవసరాలకు అవసరమైన మొత్తాలను చిన్న చిన్న మొత్తాలుగా కూడబెట్టినే అది పెద్దమొత్తంగా రూపుదిద్దుకొని అవసరం గడపడానికి దోహదకారి అవుతుంది.

నెలవారి ఈ మొత్తాలను ఉదయతారలో మీ బడ్జెట్‌కు అనుకూలమైన చిట్‌లో దాచుకుంటే దానికి తోడు ఆకర్షణీయమైన డివిడెండ్లు తోడయి ఓ పెద్ద మొత్తంగా రూపు దిద్దుకుంటుంది. ఉదయతారలో పొదుపుచేస్తే అధిక ఆదాయంతోపాటు సత్వర పేమెంటు సమకూరుతుందని తెలిసి ఎందరెందరో సభ్యులయ్యారు. మరి మీరుకూడా సత్వరమే చేరండి. మీకే తెలుస్తుంది.

## ఉదయతారతో పొదుపు మీ ఆర్థికాభివృద్ధికి మదుపు




# ఉదయతార

## ఫైనాన్స్ అండ్ చిట్‌ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్

రిజిష్టర్డు ఆఫీసు : 7-75, పటమట, విజయవాడ-6. ఫోన్ : 52065

లు కోల్పోయినవాళ్ళను గోనెసంచీల్లో కుక్కి ఆపైన సిమెంట్ ప్లాస్టర్, ఇటుకలూ పెట్టి ఆ బస్తాలను ఎక్కడో నదులలో విసిరి పారెయ్యటానికీ సెమిలీర్స్ ఉన్నారు. వేళాపాళాలేకుండా ఎప్పుడు పడితే అప్పుడు, అక్కడి స్త్రీలలో ఎవళ్ళ మీద వాళ్ళదృష్టి పోతే వాళ్ళను స్వేచ్ఛగా అనుభవించే అధికారమూ వుంది వాళ్ళకు.

ఆరోజుల్లో ఈరకమైన జీవితం గడిపే అభాగినులు రెండు వేలమంది వుండేవారట. ఇప్పుడు ఆ పట్టణంలో ఆరువేలపై చిలుకు వున్నారు. కలకత్తాలో పాతికవేలమందీ, బొంబాయిలో అరలక్షమందీ, హైదరాబాదులో పదివేలమందీ వున్నారట. దేశంలో మొత్తం ఎంతమంది?

ఇటువంటి బ్రోతల్స్‌లో వంజరాలలో పక్షులలా అత్యాచారాలకు గురి అవుతున్న అభాగినులేకాక స్వేచ్ఛగా ఎవరికివారే వ్యభిచారవృత్తి నడుపుకుంటూ బతుకుతున్న రకరకాల శ్రేణుల స్త్రీలూ వున్నారు. ప్రస్తుతం అమలులో ఉన్న చట్టాలు, నిబంధనల దృష్ట్యా వీరు పడేబాధలూ, యమయాతనలూ, మానసిక దైహికక్షోభలూ అనంతం.

చాందినీమహల్ బ్రోతల్‌లో ఏడెనిమిదేళ్లు జీవితం గడిపింది శంపాగా మారిన మనోహరి.

అక్కడి పోలీస్ ఆఫీసర్ పాణిగ్రాహి.

చట్టవిరుద్ధ కార్యకలాపాలను పూర్తిగా నిర్మూలం చేయలేకపోయినా కనీసం తగ్గేలా చూసి తాను అధికారంలోవున్న ప్రాంతంలో మంచిపేరు తెచ్చుకోవాలన్నది ఐ.పి.యస్. ఆఫీసర్ అయిన శరదిందు పాణిగ్రాహి ఆశయాలలో ఒకటి. ఒరిస్సాకు చెందిన అతను ఉత్తర ప్రదేశ్ పోలీస్ కాడర్‌లోవాడు. ప్రస్తుతం ఆగ్రాలో సీనియర్ సూపరింటెండెంట్ ఆఫ్ పోలీస్‌గా వున్నాడు.

పాణిగ్రాహి అధ్వర్యంలో [illegible] వడంతో అంతకుముందు [illegible] జరుగుతూవుండే [illegible] సంఖ్య [illegible]

అటువంటి ఒక దాడిలో [illegible]

[illegible]





పోయారు. అప్పుడు శంపాకు పాతికేళ్ల వయస్సు. ఆ బ్రోథెల్ మేడం మటుకు ఒక మనిషి అందజేసిన సమాచారంతో రెయిడ్ జరిగే కొన్ని నిముషాలముందు అంతర్థానమై మరునాడు వచ్చి తనమెత్తల కుర్చీలో కూర్చుంది. చెల్లాచెదరైన తన మనుషులను కొంత మందిని కూడగట్టుకో గలిగింది.

ఆనాటి విటులందరూ 'ఒత్తిడి' తేగలిగిన మనుషులే కావడంతో జరిమానాలతో తప్పించుకున్నారు, ఒకళ్లిద్దరు తప్ప! ఆ జీవితానికి బాగా అలవాటుపడి రాటుదేరిన వేశ్యలు— శంపా, రిమ్మీ అనే మరొక అమ్మాయి తప్పించి— కోర్టువారు విధించిన జరిమానా చెల్లించి బ్రోతల్‌కు ఆ సాయంత్రమే చేరుకున్నారు. జరిమానాగా చెల్లించిన డబ్బు రాబట్టుకోడానికి మరింత ఎక్కువ పరిశ్రమకు ఉపక్రమించారు.

శంపా, రిమ్మీలు తమ దీనగాథలు మేజిస్ట్రేట్‌కు చెప్పుకున్నారు. జరిమానా వేసివదిలితే మళ్లీ తాము ఆ నరకకూపానికే వెళ్లవలసి వస్తుంది, అందువల్ల తమకు జైలుశిక్ష వేయమనీ, ఈలోగా తమఊళ్లకు తమను పంపేఏర్పాట్లు చేయమనీ కోరారు.

కోర్టువారు న్యాయపీఠం నుండి లేచేంతవరకు వాళ్లకు జైలుశిక్ష విధించామనీ, ఆ తరువాత వాళ్లను ఆగ్రాలో ఒకరక్షణ గృహంలో వుంచమనీ, వాళ్లు ఇచ్చిన అడ్రెస్సులకు వెళ్లి విచారణచేసి వాళ్ళ బంధువులకు అప్పగించమనీ ఉత్తర్వులు వేశారు. రిమ్మీ తల్లిదండ్రుల జాడదొరికి వాళ్లు ఆమెను తిరిగి ఇంట్లో ఉంచుకోడానికి అంగీకరించారు. కాని శంపా పెంపుడుతల్లి చంద్రిక ఏడేళ్లక్రిందట కూతురు తప్పిపోయిన బెంగతో మంచమెక్కి చనిపోయిందట! ఆ ఇల్లు ఆమెకు తమ్ముడు అనిచెప్పుకున్న ఒక ప్లీడర్ ఆఫీసులోనికి వెళ్లిందట! శంపాకూ, తమకూ సంబంధం లేదనీ, శంపా చంద్రిక సొంతకూతురు కాదనీ, ఆమెను తమ ఇంటికి రానివ్వమన్నారనీ పోలీసులు రిపోర్ట్ చేశారు. [illegible] శంపాను కూడా ఆ రక్షణ గృహంలోనే వుంచివేయడం.

ఆ రక్షణ గృహం [illegible] ఎక్కువమైన రాకపోకలు, [illegible], అవినీతి, అనారోగ్య [illegible], ఒకటేమిటి అన్ని

అక్కడ స్థావరం చేసుకున్నాయి. అక్కడి అభాగినుల కోసం వచ్చేడబ్బులో పాతిక వంతు కూడా ఖర్చయ్యేది కాదు. ఎవరెవరి జేబులో నిండేవి దానితో. వాళ్లు కట్టుకునేవి మానం దాచని చిరుగుల చీరలూ, పడుకునేవి కుళ్లు అతుకుల బొంతలూ, కప్పుకునేవి గోనెగుడ్డలూ, తినేది పశువుల దాణా. ఇరవైమంది పక్కపక్క పడుకుంటే సరిపోని ఆ గృహం గదులలో వందమందికి పైగావుండేవారు- ఉక్కలో, చీకటిలో, తేమలో. దైహిక వ్యాధులేకాక కొంతమందికి మానసిక చాంచల్యం కూడా. ఈ దీనజీవులకోసం ఒక డాక్టర్ పోస్ట్‌వుందికాని అది చాలా ఏళ్లుగా ఖాళీగానే వుంది.

అభాగ్యస్త్రీల మానసంరక్షణ కోసం నెలకొల్పబడిన ఆ రక్షణగృహాలు కన్నాలుపడి చిరిగిన గొడుగులు. ముందుగేటు మటుకే ధృఢంకాని ఆగ్రాలోని ఆ గృహం ఒకవైపుగోడ చాలా పొట్టిది. అవినీతి చర్యలకోసం మనుషులు ఆ లోపలకు రావడానికి అనువుగా ఆవరణ పక్కవున్న ఒక రంపపుమిల్లు సొంతదారు అద్దెకిచ్చే ఒక నిచ్చెన కూడా ఉంచాడు. అక్కడ యమయాతనలు పడలేక ఏ అభాగిని అయినా తప్పించుకోదలిస్తే కొంత ఖర్చుతో ఆ నిచ్చెన సాయానికి అందుబాటులో ఉండేది.

ఒక సంవత్సరకాలం కనాకష్టంగా అక్కడ జీవితం గడిపిన శంపా ఎలాగో డబ్బుకొంత కూడబెట్టి లంచంఇచ్చి నిచ్చెన ఎక్కిదిగి, చేతిలో పైసాలేకుండా కట్టుబట్టలతో— అవి బట్టలు అనడానికి తగినవికావు— రోడ్డుమీదికి చేరుకుని తిన్నగా నడిచి రైల్వేస్టేషన్ చేరుకుంది. అక్కడ బయల్దేరడానికి సిద్ధంగావున్న హౌరావెళ్లే ఎక్స్‌ప్రెస్‌లో ఒక పెట్టెలో ఎక్కి ఆకలితో నకనకలాడే కడుపుతో కూర్చుంది ఆమె. స్టేషన్‌లో తాగిన మంచినీళ్లే ఆరోజు ఆహారం.

ముష్టివాళ్లువచ్చి ఏదో వల్లించి డబ్బులు వసూలుచేసుకుంటున్నా ఆపని ఎన్నడూ చేయని శంపా, వాళ్లను చూస్తూ పాయిఖానా పక్క తలుపుదగ్గర కూర్చుంది. ఒకమధ్య వయస్కుడైన "పెద్దమనిషి" అర్ధరాత్రివేళ ఆమె పక్కన కూర్చుని చేయిలాగి రెండురూపాయలు ఆమె చేతిలోపెట్టాడు. పైపై పనులలోనగ సరదాలు తీర్చుకుని మళ్లీ వెళ్లి తన బెర్తు మీద నిద్రలోకి జారాడు. ఆకలి బాధకు తాళలేకుండా ఉన్నఆమె కిమ్మనకుండా ఆ అత్యాచారం సహించి ముప్పయి పైసలఖర్చుతో ఒక కప్పుటీ తాగింది.

గయ స్టేషన్‌లో సర్ప్రైజ్ రెయిడ్ జరిగింది- పోలీసులూ, మేజస్ట్రేట్‌వున్న ఒక చెకింగ్ స్క్వాడ్ ద్వారా. వాళ్లకు దొరికిపోయిన శంపాకు జరిమానా కట్టడానికి డబ్బులేకపోవడంతో వారంరోజులు జైలుశిక్షపడింది. తాను ఏడెనిమిదేళ్లుగా గడిపిన జీవితంకన్నా ఆ జైలు జీవితం ఎంతో హాయిగా అనిపించింది ఆమెకు. ఆ జైలు అధికారి నీతీనిజాయితీ, దైవభక్తీ ఉన్నమనిషి కావడంతో— ఖైదీల కష్టసుఖాలు స్వయంగా కనుక్కుని సాధ్యమైనంతవరకు వాటిని తగ్గించడానికి ప్రయత్నించేవాడు. శంపా శిక్ష పూర్తికావడమూ, అతని న్యాయ శాసనంకిట్టనివాళ్ల రిపోర్ట్‌తో అతడు ఎక్కడో మారుమూల ఊరి చిన్న జైలుకు బదిలీకావడమూ ఒకరోజే జరిగింది. శంపా దీనగాథ విన్నఅతడు వద్దన్నావినక ఒక పదిరూపాయలు ఆమెకిచ్చాడు. మొత్తం పద కొండు రూపాయల డెబ్బైపైసలతో బైటికివచ్చిన శంపా వాళ్లనూ వీళ్లనూ దారి అడిగి తెలుసుకొని అక్కడ పిండాలు పెట్టి తర్పణం వదిలేచోటికి నడుచుకుని వెళ్ళింది. తల్లి చంద్రికకు అన్యాయం చేసినందుకు పశ్చాత్తాపపడుతున్న ఆమె— గయాశ్రార్ధం పెడితే చనిపోయిన వాళ్ల ఆత్మలు స్వర్గానికి చేర్తాయని చిన్నప్పుడు వినడంవల్ల— ఆ పనిచేయ నిశ్చయించుకుని ఉదయం విడుదలకి ముందు జైలులో ఇచ్చిన జావకూడా తాగకుండా ఉపవాసంవుంది. ఎక్కడా ఒక నీటి చుక్కకూడా పైకి కనిపించని ఇసుకతిప్పల నది ఒడ్డుకు చేరింది. ఆమె చుట్టూ పది పదిహేనుమంది మూగారు— గోలగా హిందీలో మాట్లాడుతూ ప్రతివాళ్ళూ పిండా లెందుకు పెడుతూ అడిగేవాళ్ళే. ఒకడు పదుకొండు రూపాయలకు ఆ కార్యం నెరవేరుస్తానన్నాడు. తనదగ్గర పదిరూపాయల కన్నా ఎక్కువలేదని ఆమె చెప్పడంతో ఇద్దరు ముగ్గురు పురుషులు మిగిలారు. పేరుకు పేరా అరుస్తూ ఉన్నా ఒక్కొంటూ కని

పిస్తూనేవున్న ఆమె అందం— చిక్కిపోయి వున్నా ఇంకా ఆకర్షణీయంగానే కనబడ్తూంది చూసి ఓ పాతికేళ్ల యువకుడు— పది రూపాయలకు శ్రార్థం పెట్టించడానికి ఒప్పుకుని ఆమెను నడిపించుకుని మనుషులు అంతగా లేని ఒక ఇనుకపర్ర దగ్గరకు తీసుకువెళ్లి అక్కడవున్న ఒక చలమను లోతుచేసి ఆకు దొన్నెతో తనే ఆమె వంటిమీద నీరుపోస్తూ స్నానం చేయించాడు— తన కళ్లకు ఆకట్టే భాగాలమీద మరింతగా నీరు పోస్తూ, అక్కడ చేతులతో తడమడానికి ప్రయత్నిస్తూ! అతని ఉద్దేశం గ్రహించిన ఆమె ఆ పవిత్ర కార్యం అయ్యేంతవరకూ అటువంటి పనులు వద్దనీ, అది పూర్తయిన తర్వాత ఏంచేసినా చేసుకోమనీ బతిమాలింది. దాంతో సాధ్యమైనంత వేగంగా కార్యం కానిచ్చి ఆమె ఇచ్చిన నోటు మొలలో దోపుకొని, చలిలో గజగజ వణుకుతున్న ఆమె దేహపు భాగాలను పైపైపనులతో తన తృప్తితీరేంతవరకూ వాడుకుని వదిలాడు. కొద్ది దూరంలో మనుషులే లేకపోతే ఆ "పవిత్రమైన" ఇనుకతిప్ప మీదే ఆమెను పూర్తిగా అనుభవించి ఉండేవాడే. పనిపూర్తి అయిన తర్వాత వెళ్లి తన ధోవతీ ఇంకొక చలమ దగ్గర శుభ్రం చేసుకొని వెళ్లిపోయాడు.

శ్రార్థం పెడ్తున్నప్పుడు చంద్రిక పేరిట తర్పణం వదిలిన తర్వాత ఇంకెవరన్నా ఉన్నారా కావలిసినవాళ్లు అని అడగగా చంద్రికను పెంచిన వేశ్యపేరు చెప్పింది ఆమె. ఆమె పేరిట కూడా స్వర్గానికి వెళ్లేదారిలో తర్పణం [illegible] డ ఇనుకలో పాతాళానికి దిగాయి. [illegible] ంకెవరూ లేరంది శంపా.

[illegible] కడుపులో దాచుకున్నా ఆ [illegible] డెక్కిపోయిన ఇనుకలో కాళ్లీడ్చు [illegible] సేవన్ చేరుకుంది ఆమె. అక్కడ [illegible] ంపటి దగ్గర నిలబడి తడిబట్టలు [illegible] టుకుంది.

తన దగ్గర మిగిలిన రూపాయి డెబ్బై పైనలలో పదిహేను పైనలతో ఒక అరకప్పు టీ తాగింది ఆమె.

గయ నుండి కలకత్తాకు, అక్కడనుండి ఖుర్దా రోడ్‌కూ ఎక్స్‌ప్రెస్ బళ్ళలో తలుపు దగ్గరా, పాయిఖానా పక్కనా కూర్చొని ప్రయాణంచేసింది శంపా టికెట్ లేకుండానే. ఆమెవద్ద మిగిలిన పైనలతో ఒక అరటి పండూ, బిస్కట్లూ, బన్ను రొట్టే కనుక్కొని ఆకలితో శోషిల్లి మూర్ఛపడకుండా నిలబడగలిగింది. ఖుర్దా రోడ్‌లో టికెట్ కలెక్టర్‌వచ్చి కేకలువేసి ఆమెను దింపేశాడు ప్లాట్‌ఫారం గేటు అవతల.

స్టేషన్‌పేరు ఖుర్దా రోడ్ కాని అక్కడి ఊరు పేరు జట్నీ. స్టేషన్ ఆవరణ పక్కనే బజారు వుంది. అక్కడ ఒక రావి చెట్టుకింద చప్టామీద కూర్చొన్న ఆమెను ఒక రైల్వే ఇంజన్ డ్రైవరు చూశాడు. అతడు వాల్తేరు నుండి ఒక పాసెంజరులో డ్యూటీ చేసివచ్చి ఆ సాయంత్రం దిగినవాడు. మళ్ళీ తెల్లవారుఝాము పాసెంజర్‌లో వెనుకకు వెళ్తాడు. డ్యూటీలో అప్పటికప్పుడే అతడు రమ్ సేవించి వున్నాడు.

శంపా వాలకం చూడగానే ఆమె వృత్తి ఏదో గ్రహించిన అతడు దగ్గరకువచ్చి నాలుగు రూపాయలివ్వడానికీ, ఆమెకు భోజనం పెట్టించడానికీ బేరం కుదుర్చుకున్నాడు. ఆపక్క హొటలులో ఆమె చాలారోజుల తర్వాత మొదటిసారిగా భోజనం చేసింది. తర్వాత స్టేషన్ యార్డ్‌లో ఒక సైడింగ్‌లో ఖాళీగావున్న ఫస్టు క్లాస్ కంపార్ట్‌మెంట్‌లో వాత్స్యాయన కామ సూత్రాలలో కొన్నిటిని అమలులోపెట్టాడతను. తర్వాత తాను వెళ్ళే పాసెంజరులోనే టికెట్ చెక్కింగ్ భయంలేకుండా తీసుకెళ్ళి వాల్తేరు స్టేషనులో దింపాడు.

ఆ ఆవరణలో తన వృత్తి మొదలుపెడదాం అనుకుంది శంపా. ఇంతలో ఎవరో "అబ్బా... ఈ స్టేషన్‌నిండా బజారు ముండలేరా!" అనటం విని అంత పెద్ద పట్టణంలో కొత్తగా వచ్చిన తాను పాతవాళ్ళతో పోటీపడలేనని నిశ్చయించుకుని తన దగ్గరవున్న నాలుగు రూపాయలలో ఒకటిన్నర రూపాయి ఖర్చుపెట్టి టిఫిన్‌తిని మళ్ళా ప్లాట్‌ఫారంలోనికి ప్రవేశించి బెజవాడవెళ్ళే ఒక రైల్లో ఎక్కికూర్చుంది. తునిలో వచ్చిన ఒక టి.సి. ఆమెదగ్గర ఒక రూపాయి తీసుకొని తాను రాజమండ్రిలో దిగుతాననీ, అక్కడ ఆమె దిగిపోవాలనీ చెప్పాడు. సరేఅని మిగిలిన రూపాయిన్నర కొంగులో కట్టుకున్న ఆమె నిద్రలో వున్నపుడు ఒక పదిహేనేళ్ళ పిల్లవాడు చల్లగా ఆమె కొంగుముడి విప్పి ఆ డబ్బు సంగ్రహించి వెళ్ళిపోయాడు.

రాజమండ్రి స్టేషన్‌లో ఉదయం ఏడు గంటలకు దిగిన ఆమె వెళ్ళి ఒక స్తంభానికి ఆనుకొని కూర్చుంది దిగులుగా. ఎనిమిదేళ్ళ క్రిందట వదిలిన తెలుగు గడ్డ మళ్ళీ ఎలాగో చేరుకొంది ఆ పదహారణాల స్వచ్ఛమైన తెలుగు ఆడబడుచు. కాదు, పడుపు వృత్తిమటుకే జీవనాధారంగాకల పాతికేళ్ళు నిండిన పడుచు ప్రాయపు అందమైన తెలుగు అమ్మాయి. ఒకప్పుడు గవిరి, మనోహరి ఆ తరువాత శంపా.

ఇప్పుడు భవిష్యత్తు అంధకారమయం. 'నా' అన్నవాళ్ళు ఎవరూలేరు. చేతిలో ఒక పైసాలేదు.

ఎవరో అంటున్నారు-అవతల కన్నమ్మవారి గుడిదగ్గర ఆరోజు వినాయకచవితి పండుగ పూజకోనం మండపం చాలా చక్కగా కట్టారనీ, వినాయక విగ్రహం చాలా దివ్యంగా కనిపిస్తున్నదనీ.

హఠాత్తుగా ఆమెకు "దిక్కులేనివాళ్ళకు దేవుడే దిక్కు" అన్నమాటలు జ్ఞాపకం వచ్చాయి. వాళ్ళను, వీళ్ళనూ దారి అడిగి ఆ మండప స్థలానికి చేరుకుంది. ఇంకా పూజా విధానం మొదలుకాకపోవడంతో మండపానికి అడ్డుగా పసుపురంగు పరదా కట్టివుంది. దేవుడి విగ్రహం కనిపించలేదు. ఆరోజు స్కూలుకి శెలవు కావడంవల్ల ఖాళీగావున్న స్కూలు అరుగుమీద స్తంభానికి ఆనుకుని కూర్చున్న ఆమెకు ఆ ఊళ్ళో తన వృత్తి నెరవుకుందాం అన్న ఆలోచన వచ్చింది. ఆ పూట ఉపవాసంవుండి పూజ ముగిసిన తర్వాత ఆ విఘ్నరాజుకు తన వృత్తి నిర్విఘ్నంగా కొనసాగేలా మొక్కుకుని స్టేషన్‌కు వెళ్ళిపోదామని నిశ్చ

యించుకుంది ఆమె.

తనకు తెలిసిన రెండు పాత పేర్లతో బతుకుతూ ఆ జ్ఞాపకాలు మనస్సులో మరి కదలడానికి ఇష్టంలేని ఆమె కొత్త పేరుకోసం ఆలోచిస్తూండగా హఠాత్తుగా కామిని అన్నపేరు జ్ఞాపకం వచ్చింది.

కామిని... కామిని... కామాన్ని తృప్తిపరచడానికి పనికివచ్చే దేహాలకు ఆపేరే తగింది-అన్న నిర్ణయానికి వచ్చింది చివరకు ఆమె.

పూజ జరుగుతున్నప్పుడు జనానికి కొద్దిదూరంలో కూర్చుని ఆ తంతు శ్రద్ధతో గమనిస్తున్న ఆమెముందు ఎవరెవరో అయిదు పైసలూ, పది పైసలూ, పావలా కాసులూ వెయ్యటం మొదలుపెట్టారు. ఆమెను అక్కడవున్న ముష్టివాళ్ళలో ఒకతెగా పరిగణించినట్లున్నారు వాళ్ళు.

పూజ ముగిసిన తర్వాత భక్తులు వరుసగా ర్యాలీవెళ్ళి దేవుడి ముందు సాష్టాంగ నమస్కారంపెడుతున్నారు. పురోహితుడిచేత శఠకోపం పెట్టించుకొని సింధూరం, విభూతీ తీసుకుని అద్దుకుని, రాసుకుని, పూలూపత్రీ చెవులో పెట్టుకుని, ఆ పళ్ళెంలో డబ్బులు వేయడం గమనించింది ఆమె! జన సమర్దం తగ్గిన తరువాత తన ముందుపడివున్న నాణాలన్నీ తీసి లెక్కపెట్టకుండా అలాగే గుప్పిటిలో పెట్టుకునివెళ్ళి అందరు భక్తులలాగే తానూ సాష్టాంగపడింది. ఆ ఊళ్ళో తన వృత్తి నిర్విఘ్నంగా సాగేలా చేయుమని కోరుకుని, తనకు వచ్చిన విఘ్నేశ్వర స్తోత్ర శ్లోకం ఒకటి మనసులో అనుకొని పురోహితుని పళ్ళెంలో తన గుప్పిటిలో డబ్బులన్నీ పడవేసింది. నుదుట విభూతీ సింధూరంతో చెవిపైన పూలూపత్రీతో పైకివచ్చి సాయంత్రం నాలుగు గంటలకు రైల్వే స్టేషన్ చేరుకుంది- తన చింకి చీరతో, చిరుగుల జాకెట్టుతో కామిని.

ఆ వృత్తిలో ఆ స్టేషన్‌లో జీవితం సాగిస్తున్న పదిపన్నెండుమందిలో జిగ్ని అనే ఆమె నాయకురాలని తెలుసుకొని, వెళ్ళి ఆమెను కలుసుకుని మాట్లాడింది కామిని. ముందు ఆమె కామినిని తమతో చేర్చుకోడానికి అంగీకరించలేదుకాని ఆమె దీనగాథ విన్నతరువాత, మరొక రకంగా పరిచీనంగా అయినా తన జీవితగాథ జ్ఞప్తికి తెచ్చుకుంది! తనకు వచ్చే మొదటి నెల ఆదాయంలో తిండికి, బట్టకూ మటుకు మిగుల్చుకుని తక్కినది రెండు మూడురోజుల కొకసారి తక్కిన అందరికీ పంచడానికి షరతుపెట్టి కామినిని మరొక నిత్యకళ్యాణిగా చేర్చుకొంది.




ఆ రైల్వే స్టేషన్‌లో రెండేళ్ళు కాయకష్టంచేసిన కామిని ఊపిరితిత్తులనూ, గుండెనూ ఎలాగో నడిచేలా ఉంచుకోగలిగింది కాని నిరంతరమూ రాపిడిపడ్డ శరీరభాగాన్ని మాత్రం కాపాడుకోలేకపోయింది. మునిసిపల్ ధర్మాసుపత్రికి వెళ్ళి మందులు తీసుకోవడం మొదలుపెట్టింది ఆమె.

ఆసుపత్రి అన్నపేరు హాస్యాస్పదం దానికి. ధూళి ధూసరితమైన కుర్చీలూ, బల్లలూ, స్టూళ్ళూ, రాక్‌లూ, బూజుపట్టిన సీసాల్లో రంగు రంగుల మందునీళ్ళూ, పగుళ్ళువేసిన జార్లలో పసుపూ-తెలుపూ ఆయింట్‌మెంట్లూ, విరిగిన కల్వమూ దాని ఆస్తి! రోడ్డుమీది గ్రానైట్ రాళ్ళే తూకపు రాళ్ళుగావున్న తుప్పుపట్టిన చిన్న ఇనుప త్రాసూవుంది. తలుపుకు ఒక రెక్కలేని బీరువాలో మాసిన దూదీ-బాండేజ్ రోల్సూ కుప్పలుకుప్పలుగా పడివున్న కాగితాలూ, రిజిష్టర్లూను! మూలన ఒక కాలు లేకుండా గోడకు ఆనించిన కర్రస్టాండుమీద పెచ్చులు చాలావరకు ఊడిపోయి స్ఫోటకంపడిన మొహంలా కనిపిస్తున్న పింగాణీ వాష్ బేసినూ, విరిగిన సిరెంజీలూ, తుప్పుపట్టిన సూదులూ, డాక్టరుగారి కుర్చీ వెనుకవక్క దుళ్ళు తువ్వాలూ! ఇలాంటివన్నీ చూస్తే సాధారణంగా మానవులు మనుషులకే వాంతి కలిగే

అవకాశంవుంది అక్కడ. పైగాలోపలకు వెళ్ళే వాళ్ళు ఆస్పత్రిముందు కుళ్ళుకాలువ దాటుకుని వెళ్ళాలి.

అక్కడవున్న ముసలి డాక్టరుకు కళ్ళు సరిగా కనిపించవు. చెవులు సరిగా వినిపించవు. అక్కడ ఇచ్చే మందుపేరిట నీళ్ళవల్లకాక ప్రకృతి సహజంగా కూడా జబ్బులు ఎవరికన్నా ఎన్నాళ్ళకూ తగ్గకపోతే పెదవివిరిచి "అంతా దైవాధీనం" అంటాడు అతడు. అందువల్ల అతనికి అసలు పేరు మరుగునపడి దైవాధీనం డాక్టరుగారు అన్నపేరే స్థిరపడింది.

ఒక నెల గడిచినా ఆమె బాధతగ్గకపోవడమేకాక మరింత ఎక్కువ కావడం మొదలుపెట్టింది. మరికొన్నాళ్ళు అక్కడే వైద్యం చేయించుకుంటే కామిని తిన్నగా మునిసిపాలిటీ వాళ్ళ దిక్కులేని శవాల బండి ఎక్కి వుండేది. కాని.... ... ...

ఆరోజు ఆమె అక్కడికి మందుకు వెళ్ళినపుడు డాక్టర్ దైవాధీనంగారి ముందు ఊగులాడుతున్న కర్రకుర్చీలో ఒక యువకుడు కూర్చుని వున్నాడు. అతడూ డాక్టరే- చంద్రశేఖరం అని! అందరూ డాక్టరు చంద్రబాబు అంటారు అతన్ని. ముప్ఫయ్ ఏళ్ళు నిండని వయస్సులో పోస్టు గ్రాడ్యుయేట్ అయి, పేరు మోసిన తన తండ్రి డాక్టర్ చిదంబరంగారి సొంత నర్సింగ్ హోమ్‌లోనే వృత్తి నెరవుతున్నాడు. దైవాధీనం, చిదంబరం ఒకప్పుడు క్లాస్‌మేట్స్.

కొంతమంది జీవితాలలో ఒక్కొక్కరకపు సంఘటనా, ఒక్కొక్కవ్యక్తీ యాదృచ్ఛికంగానే ఎదురవుతూవుంటారు. కామిని జీవితంలో అదే అయింది.

కొన్ని ఆదర్శాలు వున్న యువకుడు కనుక చంద్రం తండ్రిలా డబ్బుగడించడమే జీవితానికి ధ్యేయం అనుకోకుండా ప్రతిరోజూ ఒక గంట బీదవాళ్లకు కేటాయించి వైద్యసలహాలు ఇవ్వడమూ, అవసరమైతే ఉచితంగా మందులు ఇవ్వడమూ, మరీ అవసరమైన కేసులను వుచితంగా ఇన్‌పేషంట్లుగా చేర్చుకోవడమూ చేస్తుంటాడు. ఒక పరిశీలనా గ్రంథం రాసే ప్రయత్నంలో వున్నాడు అప్పుడు అతడు. కావలిసిన కొన్ని వివరాలు సంగ్రహించడానికి అక్కడికి వచ్చాడు ఆరోజు. అతనికి సైకాలజీ, సైకియాట్రీ అభిమాన విషయాలు.

జబ్బుతో ఎంత నీరసించిపోయినా, శ్మశానం చేరుకోడానికి కొద్దివందల గజాల దూరంలోనే వున్నా కామిని అందమూ, ఆమె కళ్లలో ఏదో ఆకర్షణా చంద్రం మనస్సును ఆకట్టాయి. గొంతూ దుర్బలంగావున్నా పాతబడి మూలపడిన వీణలో ఇంకా సమశ్రుతిలోనే వున్న రెండు తీగలు కమ్మగా మోగుతున్నట్లుగా అనిపించింది అతనికి. ఆమె మాటలధోరణివల్ల ఆమె బజారు పడతి అని బోధపడినా అసాధారణమైన ఏదో సంస్కారం ఆమెలో గోచరించింది. ఒకప్పుడు శుభ్రమైన వాతావరణంలో ఆదరాభిమానాల నడుమ పెరిగి, కొంత వరకు చదువుకున్న వ్యక్తి అయివుంటుంది అనుకున్నాడు మనసులో.

మందులూ, ఇంజక్షన్లూ, ఇతర సామగ్రీ మొదలైనవాటికోసం మున్సిపాలిటీ బడ్జెట్‌లో కేటాయించిన డబ్బు ఏవిధంగా సగంపైగా కాగితాలమీదనే ఖర్చుఅయి దొంగజేబులకు వెళ్తున్నదో, మిగిలినదానిలో ఆస్పత్రి నడపడం ఎలాకష్ట సాధ్యం అవుతున్నదో చంద్రానికి అంతకుముందే వివరిస్తున్న దైవాధీనం, కామినిని ఒకమూల కూర్చోమనిచెప్పి తన ధోరణిలో మాట్లాడుతున్నాడు.

"చూడు చంద్రం- ఈ సిఫిలిస్ కేసే తీసుకో! ఈ పిల్లకి సరిఅయిన ట్రీట్‌మెంట్ ఎలాచెయ్యాలో నీకు తెలిసిందే. ముందుగా స్పైనల్ ఫ్లూయిడ్ పరీక్షించాలి. అన్యూరిజం లేదని నిర్ధారించుకోడానికి అయోర్టా ఎక్స్‌రే స్క్రీనింగ్ చెయ్యాలి. మొదటి రెండు పెన్సిలిన్ ఇంజక్షన్లు ఇచ్చేముందు హెర్క్స్ హామర్ రియాక్షన్ రాకుండా ప్రెడ్నిసోన్ అయిదు మిల్లీగ్రాములు ఇవ్వాలి. ఆ తరువాత పదిపదిహేనురోజులు పెన్సిలిన్ ఇంజక్షన్లు ఇవ్వాలి." దైవాధీనం పెదవులమీద జాలిగా నవ్వు కదలాడింది. "ఈ ఆస్పత్రి అవస్థ చూశావుకదూ? వీటన్నిటికీ వీలేదీ? ప్రెడ్నిసోన్ మొహం చూసి ఎన్నేళ్లయిందో! పెన్సిలిన్ ఇంజక్షన్లు ఇద్దామన్నా ఒక పూర్తికోర్సుకు చాలవు. అందుకే ఈ పిల్లకేదో ఇన్ని రంగునీళ్ళు, ఆయింట్‌మెంట్ ఇచ్చి పంపుతున్నాను. ఏమిటో, అనుకుంటే

బాధ చంద్రం."

ఆ మాటలు అన్నీ సరిగా బోధపడకపోయినా అసలు సంగతి బోధపడిన కామిని ఒక్కవుదుటున లేచి నిలబడి అంది "మీరేమీ బాధపడకండి డాక్టర్! నిన్న మీరెవరితోనో అన్నట్లు అంతా దైవాధీనం. కానీ ఈ సంగతి ముందే చెప్పివుంటే, ఇంతదూరం కాళ్ళీడ్చుకుంటూ ప్రతిరోజూ నడిచివచ్చివుండేదాన్నేకాదు. ఏమైనా ఇన్నాళ్ళుగా అభిమానంగా చూసిన మీకు నా థాంక్స్. వస్తాను... శెలవు" అని చేతులు జోడించి చేతిలోవున్న ఖాళీసీసా అక్కడే కింద పెట్టి వెనుకకు తిరిగి గుమ్మంవైపు అడుగులు వేసింది ఆమె.

చంద్రం గుండె కలుక్కుమంది. ఆమె గడపదగ్గరకు వెళ్ళేవరకూ రెప్పవేయకుండా ఆమెవైపు చూసి నెమ్మదిగా, మృదువుగా... "ఇదిగో అమ్మాయి— ఇలా రా" అని పిలిచాడు.

తల వెనుకకు తిప్పి ఆశ్చర్యంగా చంద్రాన్ని చూసి, అక్కడ ఇంకెవళ్ళూ ఆడవాళ్ళు లేకపోయినా 'నన్నా పిలిచారు?" అని అడిగింది కామిని.

"అవును... ఇలారా"

సూదంటురాయి ఇనుప ముక్కను లాగినట్లుగా అతని జాలినిండిన కళ్ళు ఆమె దేహాన్ని బల్లదగ్గరకు తీసుకువచ్చాయి. తూలిపోబోయినట్లయి బల్లమీద చేయివేసి ఆపుకుని నెమ్మదిగా— "ఎందుకండీ?" అని అడిగింది ఆమె.

"నేనూ డాక్టరునే! ఆల్కాట్ తోటలో రాములవారి గుడివుంది చూశావా? దానికి కొద్దిదూరంలోనే మా క్లినిక్ వుంది. దానిమీద మా నాన్న డాక్టరు చిదంబరంగారి పేరూ, డాక్టర్ చంద్రశేఖరం అని నాపేరూ తెలుగూ, ఇంగ్లీషుల్లో వుంటాయి. నువ్వు చదువుకున్నదానిలా వున్నావు. ఎవర్నీ అడక్కుండానే కనుక్కోవచ్చు సులభంగా. లేక ఎవరినడిగినా చెప్తారు. రేపు ఉదయం ఎనిమిది గంటలకు అక్కడికి రా. కావలిసిన టెస్టులుచేసి చేయవలసిన వైద్యం చేస్తాను నేను."





కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవిగా విప్పారగా అతనివైపు రెప్పవేయకుండా చూస్తూ తడబడే గొంతుతో అడిగింది కామిని "ఎంత ఖర్చవుతుంది?"

చిరునవ్వు నవ్వి అన్నాడు చంద్రం "ఎంతయితే ఏం? నువ్వు ముందు రా రేపు అక్కడికి. ఖర్చు సంగతి... ..."

"నేను ఏమీలేని కటిక దరిద్రురాల్ని. ఒళ్ళు అమ్ముకుని బతికేదాన్ని. వైద్యానికి ఖర్చుపెట్టలేను. క్షమించండి... — నా దారిని నన్ను వదిలెయ్యండి"

సంస్కారం ఉట్టిపడే ఆ మాటలతో ముగ్ధుడైన అతడు అన్నాడు బాధగా— "నా మాట పూర్తిగా వినకుండా మాట్లాడుతున్నావు నువ్వు. నిజానికి ఒక పైసాకూడా ఇవ్వక్కర్లేదు. నాకున్న వైద్యవిజ్ఞానం ఉపయోగించి నీలాటిదాన్ని బాగుచేయగలిగితే ఏదో సాధించానన్న తృప్తి కలుగుతుంది నాకు. అదే నువ్వు నాకిచ్చే ఫీజు"

ఆమె కళ్లలో గిర్రున నీళ్ళుతిరిగి రాలడం మొదలుపెట్టాయి. గయ జైలులో జైలరు జ్ఞాపకంవచ్చాడు ఆ క్షణాలలో ఆమెకు. తనలాంటి నికృష్టజీవులమీద జాలిపడేవాళ్ళు, శ్రద్ధ చూపించేవాళ్ళు లోకంలో ఉన్నారు కొంతమంది.

ఏదో అనబోయిందిగాని గొంతు పూడుకుపోయినట్లుగా అయింది. సగం తెరుచుకుని ఉండిపోయిన నోటిలో కనిపించే ముత్యాల సరాలవంటి పలువరుసలతో, జారే కన్నీళ్లతో అలాగే అతనివైపు వెర్రిగా చూస్తూ వుండిపోయింది.

"కన్నీళ్ళెందుకు? వద్దు. చూడు... నీపేరేమిటి? నాపేరు చెప్పానుకదూ చంద్రశేఖరం... చంద్రబాబు, చంద్రం అంటారు అందరూ"

హఠాత్తుగా తల్లి చంద్రిక జ్ఞాపకం వచ్చిన ఆమె, ఆ రాజమండ్రిలో కామినిగా తాను చెలామణీ అవుతున్న సంగతి మరిచిపోయి నెమ్మదిగా అంది "మ...నూ...మనో...హరి..."

దైవాధీనం "అదేమిటి? కామిని నీ పేరన్నావు కదూ ఇదివరకు?" అని ఆశ్చర్యంగా అడిగాడు.

ఆ బంగురు గొంతుతో మళ్ళీ ఈ లోకంలోప

డిన ఆమె కొద్దిగా గాభరాపడి అంతలో సర్దుకుని కన్నీళ్ళు తుడుచుకుని గొంతుస్థాయి హెచ్చించి అంది–

"ఈ ఊరికి వచ్చిన ఈ రెండేళ్ళుగా నాపేరు కామినే. అంతకుముందు శంపాను. అంతకుముందు చిన్నప్పుడు మనోహరిని" జాలిగా నవ్వి అంది "మా వృత్తిలో ఊరికి ఒక పేరు మాకు"

ఆ నవ్వు ఎంతో నిండుగా, నిర్మలంగా కనిపించడమే కాకుండా; సూటిగా, నిర్మొహమాటంగా, జంకులేకుండా, నిజాయితీగా ఆమె అన్నమాటలు చంద్రం మనస్సు మరింతగా కదిలించాయి.

మృదువుగా అడిగాడు అతడు. "అవునూ... నువ్వు వుండేదెక్కడా? ఎక్కడ మీ ఇల్లు? ఇక్కడికిదూరం అన్నావు?"

మళ్ళీ జాలిగా నవ్వి అంది ఆమె- "ఇల్లా! మాలాటివాళ్ళకి పేరుబడ్డ పేటల్లో వీధులలో ఇళ్ళు వుండవు.... వుండనివ్వరుకూడా. ఎక్కడో గుడిసెల్లో వుంటాం మేము. నేనుమటుకు రాజమండ్రి రైల్వేస్టేషన్ ఆవరణలోనే వుంటూంటాను. పగటిపూట ఎక్కడ జాగాదొరికితే అక్కడే నిద్రపోతాను"

ఆ మాటలు వినడం బాధగా అనిపించినా అతడు నిట్టూర్చి అన్నాడు- "అక్కడికి దగ్గరే మా క్లినిక్. రేపు ఉదయం తప్పకుండా రా... వస్తావుకదూ?" కొద్దిగా దీనంగా ధ్వనించింది అతని గొంతు.

అతని మాటలు తనని రమ్మని బతిమిలాడ్తున్నట్లుగా అనిపించిన ఆమెకు ఆశ్చర్యంతోపాటు దుఃఖమూ పొరలివచ్చింది ఒక్కసారిగా. అది దాచుకోడానికి ప్రయత్నం చేస్తూ తలవంచుకుని నెమ్మదిగావంగి "తప్పకుండా వస్తాను. మీకు థాంక్స్ ఎలాచెప్పుకోవాలో తెలియడంలేదు నాకు" అంటూ అతని అడుగులు తాకబోయింది.

అతడు గాభరాగా కాళ్లువెనకకు తీసుకుని లేచినిలబడి అన్నాడు. "వద్దు... థాంక్స్ అవసరంలేదు. జాలిపడి చేయబోవడం లేదీపని! ఇది నావృత్తిధర్మం. ఇదినెరవేర్చకపోతే నేను మనిషినేకాను!"

ఆమె తన ప్రయత్నం మానక చేయి బాగా చాపి అతని బొటనవేలు తాకి కళ్ళకద్దుకుని అంది. "మీరు మనుషులు కారు... దేవతలు!"

★ ★ ★

గవిరి, మనోహరి, శంపా, కామిని..........

తన క్లినిక్‌లో మొదటిరోజున పేషంట్‌గా ఆమెను అడ్మిట్ చేసుకుంటున్నప్పుడు డాక్టర్ చంద్రబాబు ఆమెకోసం తెరిచిన లేతనీలి రంగు అట్టపుస్తకం మొదటి పేజీలో వివరాలు రాయబోతూ తలెత్తి ఆమె మొహంవైపుచూసి అన్నాడు—

"నీపేరు చంద్రరేఖ అని రాస్తున్నాను"

అవతలివైపు కుర్చీలో కూర్చునివున్న ఆమె కనుబొమ్మలు పైకెత్తి కొద్దిగా ఆశ్చర్యం సూచించే గొంతుకతో అడిగింది— "అదేమి?"

"ఈజబ్బుకు సంబంధించిన వివరాలుతప్ప నిన్నుగురించి ఇంకేమీ నేను అడుగదలచుకోలేదు... నువ్వు చెప్పనూ అక్కర్లేదు. మంచో, చెడో జరిగినరోజుల జ్ఞాపకాలు సాధ్యమైనంతవరకు తుడిచేసుకుంటే మంచిది. మానసికంగా అది చికిత్సకు లాభకరం. పిలవడానికి సులభం రేఖాఅని...రేఖగా ఉన్న నువ్వు క్రమంగా పూర్ణచంద్రబింబం కావాలని నా ఆశయం. వయస్సు పాతిక అని రాస్తున్నాను." ఆమెనుంచి జవాబు అపేక్షించకుండా అతడు రాయడం మొదలుపెట్టాడు.

చంద్రుడు నిండుగా గుండ్రంగా అయ్యాక మళ్ళీ తగ్గితగ్గి రేఖగా అయిపోయి చివరకు పూర్తిగా మాయమవుతాడు...మూడేళ్లనుండి పదిహేడేళ్లవరకు కళాత్మకమైన వాతావరణంలో పెరిగిన ఆమెకు ఈ ఊహ స్ఫురించింది అప్పుడు. చంద్రిక అప్పుడప్పుడు నాటకాలలో వేషాలువేసేది. ఎక్కడో ఏదో నాటకంలో ఇటువంటి డైలాగ్ ఒకటివుంది. అది గుర్తుకువచ్చింది ఆ క్షణాలనుండి రేఖగామారిన ఆమెకు.

రేఖ పెదవులమీద లేతచిరునవ్వు చిందులాడింది. తలవంచుకుని రాస్తున్న అతడు అది గమనించలేదు.

టెస్టులన్నీ జరిగాయి, ఆ క్లినిక్‌లో పనిచేస్తు

న్న నర్స్ సునంద సాయంతో.

మొదటి ఇంజక్షన్ఇచ్చి నర్స్ వెళ్లిపోయిన తరువాత ఒంటరిగా కొద్ది క్షణాలువున్న చంద్రం నెమ్మదిగా అన్నారు— "నువ్వు ఈవాళటినుండి నీవృత్తి చేయకూడదు..."

"అదెలా వీలవుతుంది!" కొద్దిగా గాభరా సూచించే గొంతుతో అంది రేఖ.

జేబులో నుండి ఒక కవర్తీసి ఆమెకు ఇవ్వబోతూ అన్నాడు చంద్రం. "ఇందులో రెండువందలు ఉన్నాయి...తర్వాత మళ్లీ ఇస్తాను, అవసరమైనప్పుడు"

ఆమె మొహం చిట్లించుకుంది. "ఊరికే చికిత్సచేయడంకాక ఇది కూడానా? వద్దు... క్షమించండి. శ్రమచేయకుండా ఎవరిదగ్గరా డబ్బు తీసుకోనునేను"

"చూడు రేఖా...ఒకసారి చెప్పాను - మొదటిరోజునే - నిన్నుమళ్ళీ పూర్ణ - ఆరోగ్యవంతురాలిగా చేయగలిగితే సంతృప్తి కలుగుతుంది నాకు అని... ఆ సంతృప్తి నీదగ్గర కొనుక్కోడానికి అడ్వాన్స్ ఇది...వద్దనకు" అని ఆమె పక్కనున్న స్టూలుమీద ఆ కవరువుంచి వడివడిగా అవతలకు వెళ్లిపోయాడు అతడు.

ఆ కవర్వైపే కొద్దిక్షణాలు చూసి అదితీసి బ్లౌజులో పెట్టుకుంది రేఖ - కళ్లలో నీళ్లు కూడుకుంటుండగా.

ముందు మూడువారాలు ఔట్పేషంట్గానే చికిత్స చేశాడు చంద్రం ఆమెకు. కాని ఒకరోజు ఉదయం ఆమెను పరీక్షచేస్తున్నప్పుడు నూట మూడు డిగ్రీల జ్వరం ఉండటంచూసి, ఆమె వద్దని నీరసంగా అన్నా వినక, ఇన్పేషంట్గా చేర్చుకుని తమ ఆవరణలో రెండువరుసలుగా ఉన్న పెంకుటిళ్ల గదులలో చివరిగదిలో ఆమెకు బెడ్ ఏర్పాటుచేశాడు అతడు.

జ్వరం ఇలా నార్మలుకు రావడం, మళ్లీ అలా వస్తూండటంతో రేఖ ఒక నెలపైగా క్లినిక్లోనే ఉండిపోయింది. చివరకు జ్వరంరాక కొద్దిగా కోలుకున్నట్లుగా అనిపించిన ఆమె ఓ ఉదయం చంద్రంవచ్చి పరీక్ష పూర్తి



చేసిన తరువాత ఒంటరిగా ఉన్న అవకాశం చూసుకుని అంది— "ఈవాళ సాయంత్రం వెళ్ళిపోతానండీ"

ఆశ్చర్యంగా అడిగాడు చంద్రం "వెళ్లిపో తావా?"

"అవును - జబ్బుతగ్గిపోయిందికదూ! మరెందుకిక్కడ?"

జాలిగానవ్వి అన్నాడు. "తగ్గిపోవడమా? ఇంత వేగం తగ్గేజబ్బుకాదిది..."

"రోజూవచ్చి మందుతీసుకుంటాను"

కొద్దిగా చిరాకు అతనిమొహంలో గోచ రించింది. "అదేం పనికిరాదు"

ఆమె ఏడుపు గొంతుతో అంది— "మీ మాటకాదనలేను - కాని వేడిలోవున్న మనుమ లకి తప్ప ఇంకెవ్వరికీ పనికిరాని నాకోసం మీరింత ఖర్చు..."

అతని మొహం మరింత ముడుచుకుంది. "చూడు రేఖా...డబ్బు మీద ఎవ్వరిపేరూ రా సివుండదు. అవసరమైనప్పుడు ఖర్చుకావ డమే దాని ప్రయోజనం" అని గిరుక్కున వెనుకకు తిరిగి ఆమె మరిమాట్లాడటానికి వీలివ్వకుండా చరచరా అవతలకు వెళ్లిపోయా డు.

రెప్పవేయకుండా అతడు వెళ్లేంతవరకూ అతన్ని చూస్తూఉండి, ఆ తర్వాత హఠాత్తుగా మొహం దిండులో దాచుకుని వెక్కివెక్కి ఏడ వడం మొదలుపెట్టింది రేఖ.

కొంతసేపటికి ఆ లోపలికి వచ్చిన నర్స్ సునంద సన్నని ఆ ఏడుపు గొంతు విని చురచుర ఆమెవైపుచూసి కరకుగా అంది.

"అలా అనవసరంగా ఏదో తలుచుకుని ఏడిస్తే మళ్లీ జ్వరంవస్తుంది. ఇదిగో...టాబ్లెట్"

కళ్లు తుడుచుకుని లేచికూర్చుని ఆ టాబ్లెట్ వేసుకుని మంచినీళ్లుతాగి మరి ఏడవ కుండా అవతలివైపు తిరిగి పడుకుంది రేఖ.

రేఖ ఇన్‌పేషంట్‌గా వచ్చినప్పటినుండి డా క్టరుబాబు తక్కినవాళ్లకన్నా ఎక్కువసమయం ఆమెకోసం వినియోగించడం, అప్పుడప్పుడు ఒంటరిగా ఆమెతో పదిపదిహేను నిమిషాలు





మాట్లాడుతూ ఉండిపోవడం అక్కడ చాలా మందికి నచ్చడంలేదు. అందులో రేఖ వృత్తిగు రించి అక్కడివాళ్లందరికీ చాలారోజులకిందటే తెలిసిపోయింది.

తన జీవితంలోనే ఒకమచ్చవున్న నర్స్ సు నందకూ రేఖఅంటే ఒకరకమైన జుగుప్స క్ర మంగా పెరుగుతూంది.

ఆమె ఆ క్లినిక్ ఆవరణలోనే గారేజీలకు వెనకవక్కవున్న ఒక పెంకుటింటిలో ఉంటూంది - పధ్నాలుగేళ్ల కొడుకు సుబ్బుతో. ఆమెపెళ్లిఅయి ఆరునెలలు నిండకుండానే ఆ అబ్బాయి ఆరోగ్యవంతంగా పూర్ణదశలో పుట్టాడు. పెళ్లికిముందు వాళ్లఅక్క ఇంట్లో పెరిగిన ఆమెకు అక్కభర్తతో అక్రమ సంబంధం ఉండేదని, దానిఫలితమే 'సుబ్బు' అని తెలియవచ్చిన భర్త ఆమెను వదిలేశాడు. ఆమె ఈ క్లినిక్‌లో దాయిగాచేరి ఆతరువాత నర్సుగా శిక్షణపొంది ఇక్కడే ఉంటున్నది.

ఎవరన్నా వచ్చి రోగులకోసం పిలిచినా, లేక మరీసీరియస్‌గా ఉన్న పేషంట్లను చూడటం అవసరమైనా రాత్రిళ్ళు ఆమె ఇల్లువదిలి వస్తుంది తప్ప, లేకపోతే మళ్లీ ఆ పక్కలకు రాదు. రాత్రి ఏడునుండి మరొక నర్స్ రంజన అన్నీ చూసుకుంటుంది. ఆవరణ ఛార్జిమ టుకు రాత్రిపూట సుబ్బుది. పేషంట్లకు కావల సినవి బజారునుంచి తెచ్చిపెట్టడం, లోపలికి ఊరకుక్కలూ, పందులూ రాకుండాచూడటం, పదిగంటలుదాటిన తర్వాత ఆ ఆవరణ పెద్ద గేటు తాళం వెయ్యడం, అక్కడే పేషంట్లుండే పెంకుటిళ్ల వరుసలో తన నిర్ణీతస్థలంలో పడు కోవడం, తన పడక పక్క స్తంభంమీద కాలింగ్ బెల్ మోగితే వెళ్లి కార్లు మొదలైనవాటికోసం పెద్దగేటు తాళం తియ్యడం— మొదలైనవి అతని డ్యూటీ.

సునంద గురించి ఇంకొక విషయమూ ఉందికాని అది డాక్టరుతోపాటు మరికొద్దిమంది కే తెలుసు. ఆ క్లినిక్‌లో కార్లూ, వాను నడపడాని కి ఉన్న ఇద్దరు డ్రైవర్‌లలో ఒకడైన ప్రేమ్‌బహ దూర్ అనే నేపాలీ బ్రహ్మచారి బస అక్కడే ఒక గేరేజిలో. ఎప్పుడో రాత్రి వీలుచూసుకుని సు నంద ఇంట్లో రెండు మూడుగంటలు గడిపి వస్తుంటాడు అతడు.

మరికొన్నాళ్లు గడిచాయి. మధ్యలో రెండు

మూడుసార్లు వెళ్లిపోతానని రేఖ అందికాని ఆ ప్రస్తావనరాగానే "వీలుకాదు" అనేవాడు చంద్రం.

"ముందు మంచంమీద కూర్చోమనూ!" అన్నాడే సారి, తాను రేఖ అని ఆమెకు పేరుపెట్టానన్న సంగతి మర్చిపోయి.

చంద్రం "మనూ" అని పిలువడం అదే మొదటిసారి. ఒకసారి మనోహరిగా తాను గడిపిన జీవితం గురించి ఏదో మాటల సందర్భంలో తనంతటతానే చెప్పింది రేఖ అతనికి. అటువంటి ఇంట్లోనే ఈ వృత్తే చేసుకుంటూ చివరివరకూ ఆమె గడిపివుంటే ఎలా ఉండేదో అని అనిపించిన అతనికి ఎంతో బాధగా అనిపించింది. అప్పుడప్పుడు చిన్నచిన్న తప్పులు చేసినప్పుడు ఆమె తల్లి చంద్రిక "అలాకాదు మనూ... ఇలా చెయ్యాలి" అని చెప్పేదని విన్న అతనికి ఇప్పుడు అప్రయత్నంగా "మనూ" అన్నమాట జారివచ్చింది.

ఆ పిలుపు వినరాగానే తల్లి చంద్రిక జ్ఞాపకం వచ్చిన ఆమె రెండు చేతులతో మొహంకప్పుకుని వెక్కివెక్కి ఏడవడం మొదలు పెట్టింది.

ఏమనడానికీ తోచని అతడు కొద్దిగా గాభరాగా పరదామటుకే అడ్డుగా ఉన్న గుమ్మంవైపు చూసి వెళ్లి తలుపురెక్కలు కాలితో దగ్గరగా తోసివెనుకకు వచ్చి "వద్దు-ఏడవకు ...ఏడవకు రేఖా! పొరపాటున మనూ అనిపిల్చి పాతజ్ఞాపకాలు లేవతీసి బాధపెట్టినట్లున్నాను... క్షమించు! ఊరుకో..." అన్నాడు బాధగా.

చంద్రిక ఇల్లు వదిలి తాను లేచిపోయిన తర్వాత ఈ పదేళ్లుగా దొరకని ఇంత చిక్కని ఆప్యాయతా, తనను క్షమాపణ కోరుకునే మనిషి సాన్నిహిత్యమూ మరింత ఎక్కువగా ఆమె మనస్సును కదిలించగా పెల్లుబ దుఃఖం పొరలివచ్చి మంచంమీదికి వాలిపోయి బోర్లాపడుకున్న ఆమె, దిండుమీద తల అటూఇటూ కదిలిస్తూ అంది "మిమ్మల్ని క్షమించడమా? మీమాటలు నాకే కష్టమూ కలిగించలేదు. నిజానికి ఒక్కసారిగా నా చిన్నతనంరోజులలోనికి వెళ్లిపోయింది మనస్సు... అంతే అంతే!... మీరు దేవతలు! దేవతలు!"

ఆమె పక్కగా మంచంమీద కూర్చుని ఆమె జుట్టు నిమురుతూ— "దేవతను కాను- మనిషినే రేఖా నేను!" అన్నాడు— ఇంకేమీ అనడానికి స్ఫురించని చంద్రం.

ఆమె మరేమీ అనకుండా తల మరి కదిలించకుండా దిండుమీదే వుంచి, అతని వేళ్లకొనలనుండి తన కేశాలద్వారా ఏదో విద్యుత్‌తరంగాలు దేహంలోపలికి పాకిపోతుండగా క్రమక్రమంగా ఏడుపు మాని చివరకు మౌనంగా ఉండిపోయింది. ఏపురుషుని స్పర్శా ఇటువంటి అనుభూతి ఆమెలో కలిగించలేదు ఇంతవరకూ.

ఆమె ఏడుపు క్రమక్రమంగా తగ్గుతుండగా కొంతసేపు మౌనంగా ఊరుకున్న అతడు ఆమె మెడమీదికి చేతిని అప్రయత్నంగా పోనిచ్చి అక్కడి చిరువెంట్రుకలు నిమురుతూ "జరిగిపోయిన రోజులూ, శాశ్వతంగా దూరమైన మనుమలూ మరివెనక్కు రావడం ఎప్పుడూ జరగదు రేఖా!" అంటూ బాగాతేరుకుని నిండుగా నున్నగా పసిడిరంగులో కనిపిస్తున్న ఆమె భుజాల నడుమ భాగంమీదికి చేయి పోనిచ్చాడు. అంతవరకు తనలోనూ ఏదో వింత అనుభూతి హాయిగా కలుగుతున్న అతనికి హఠాత్తుగా ఆ వెచ్చని వీపుస్పర్శతో తాను హద్దుమీరుతున్నానని గ్రహించి తుళ్లిపడి చేయి అక్కడినుండి తీసి లేచి నిలబడ్డాడు. వదులుగా ముడివీడి వున్న ఆమె రాగిజుట్టువైపే చూపులు వెర్రిగా నిలిపి తన మనసును అదుపులోనికి తెచ్చుకుంటూ వుండిపోయాడు.

తన దేహంలో విద్యుత్‌తరంగాలు పాకడంమానిన రేఖ నెమ్మదిగా వెల్లకిలా తిరిగి అతనివైపు చూసింది. ఇరువురి చూపులూ పెనవేసుకుని ఉండిపోయాయి కొన్ని క్షణాలు.

తన శరీరాన్ని ఆకలితో నిండివున్న కళ్లు ఎన్నో రెప్పవేయకుండా చూశాయి ఈ పదేళ్లుగా. కాని ఈ కళ్లలో మచ్చుకు ఇప్పుడు ఆరకపు ఆకలిఛాయలు ఆమెకు కనిపించలేదు. ఆ మనుమల కోరికలకు మొదలూ తుదీ వుండేవి. ఈ కళ్లలోఆదిమధ్యాంత రహితమైన అనురాగపు వెల్లువ గోచరించింది. ఇది ఒక కొత్తవింత అనుభవం ఆమె జీవితంలో.

అలా ఎన్నిక్షణాలు వాళ్లు ఉన్నారో ఇద్దరికీ

తెలియదు. అవతలగుమ్మం దగ్గర నర్స్ సునంద ఎవరితోనో "ఏమిటా తొందర? వస్తారుండు డాక్టర్‌బాబు" అనడం వినవచ్చి ఇద్దరూ తుళ్లిపడ్డారు ఒక్కసారిగా.

అతడు కొద్దిగా వణుకుతున్న గొంతుతో "వస్తాను..." అని వెళ్లి తలుపులు తెరుస్తుండగా గోడవైపుకు మళ్లీ తిరిగి పడుకున్న రేఖ మనసులో అనుకుంది— "వద్దు వద్దు... ఈ నిర్భాగ్యురాలి కోసం ఎవళ్లూ ఇలా ఆరాటపడకూడదు. అది భరించలేను... నేను భరించలేను"

ఆ సాయంత్రం నర్స్ సునందతో, రేఖ గదికివచ్చిన అతడు పరీక్ష పూర్తిచేసి నర్స్ సమక్షంలోనే అన్నాడు. "నేను నిన్ను ఇక్కడినుంచి వెళ్లి పొమ్మని చెప్పేవరకు నువ్వు వెళ్లిపోతాననడానికి వీలులేదు. ఈవాళ పొద్దుటిలా పేచీపెట్టడం పనికిరాదు. నీ జబ్బు నా మెడికల్ నాలెడ్జ్‌కి ఒక పరీక్ష. నేను నెగ్గిననాడు నా అంతట నేనే నిన్ను వంపేస్తాను"

నెమ్మదిగా అంది రేఖ— "నెగ్గకపోతే?"

"అదొక హైపోథెటికల్ క్వశ్చన్- అంటే ముందే అనవసరంగా ఏవో శంకలు ఊహించుకుని ప్రశ్నలు వేయడం" కొద్దిగా నవ్వి అన్నాడు. "ఒకవేళ అదే జరిగిన నాడు, అక్కడి మున్సిపల్ హాస్పిటల్ డాక్టరుగారు అనేట్లు అంతా దైవాధీనం" అని నర్సువైపు తిరిగి ఏవో ఇన్‌స్ట్రక్షన్స్ ఇచ్చి ఎక్కువసేపు ఉండకుండా వెళ్లిపోయాడు చంద్రం.

ఉదయం తలుపులు దగ్గరకు వేసి ఆమె గదిలో చాలాసేపు తానుండటానికి నర్స్ సునందకు నంజాయిషీ అది.

మనుమల మనస్తత్వం ఇట్టే పసికట్టగల రేఖకూ అదే స్ఫురించింది. "నాలాగే అతనికీ ఈ బలవత్తరమైన కొత్తబంధంతో కట్టుబడటం ఇష్టంలేదు! మరి ఎందుకు డిశ్చార్జి చేసి పంపెయ్యడు? లేదు-వెళ్లిపోవాలి... నేను వెళ్లిపోవాలి! నాలాటి హీనురాలిమీద అతడికి అభిమానం పెరగకూడదు. కాని... కాని... నాకూ ఇక్కడినుండి వెళ్లాలనిపించడంలేదు. ఎప్పుడూ జీవితంలో దొరకని కొత్తఅనుబంధం ఇది- కొత్త అనుభవం! ఎన్నాళ్లు నడవకలిగితే అన్నాళ్లు నడవనీ! ఊఁహూఁ...కాదు, వెళ్లిపోవాలి!" ఆ సందిగ్ధపరిస్థితినుండి బైట పడలేకుండా ఉన్న ఆమె తలనొప్పి మొదలుకాగా గట్టిగా కళ్లు మూసుకుని అలాగే పడుకుంది చాలాసేపు.

ఏదో ప్రవాహంలో కొట్టుకుపోతూ ఒడ్డుదరిదాపులకు ఇంచుమించుగా చేరినప్రాణి ఇంక నేల కాలికి తగుల్తుంది అన్న ఆశ కలిగినప్పుడు నీరసం స్పృహతప్పి మళ్లీ దూరాలకు జారిపోయి ప్రవాహంలో కొట్టుకుపోతున్నట్టుగానే ఉంది ఆమె మనస్సు గతి అప్పుడు.




చంద్రం వృత్తిరీత్యా ఎంతమందో రోగగ్రస్థులైన స్త్రీలను అంగాంగాలూ తాకి పరీక్ష చేయవలసి వస్తూంటూంది. అతనితో ఆ సమయంలో శారీరకమైన ప్రతిచలనం ఏనాడూ కలగలేదు. రేఖను పరీక్షించినప్పుడూ అంతే! కానీ ఈవాళమటుకు... ...

లేదు... చికిత్సకు కావలసిన పరీక్షచేస్తున్నప్పుడు తనలో ఏ చలనమూ కలగలేదు. కాని ఆ తరువాత ఆమె ఏడుస్తున్నప్పుడు పక్కన కూర్చుని ఆమె వీపుతాకినప్పుడే అది సంభవించింది. తనకు ఆమెమీద ఉన్నది ప్రేమకాదు. జాలీ, ఆమె రోగం బాగుచేయాలన్న తపనా మటుకే. తాత్కాలికంగా కామం తల ఎత్తింది ఆమెను ఆవిధంగా తాకినందువల్ల... అంతే! ఇకమీదట జాగ్రత్తగావుండాలి. ఆ భావన తనలో రేకెత్తడానికి అవకాశం ఇవ్వకూడదు. అది జరగనంతకాలం ఆ గదిలో ఇదివరకులా ఎంతసేపువున్నా తాను భయపడనక్కర్లేదు. ఈవాళ నర్స్ సునందకు ఇచ్చినట్లుగా ఏ నంజాయిషీ ఇవ్వనక్కరలేదు.




ఆరాత్రి చాలాసేపు నిద్రపట్టక ఇటువంటి ఆలోచనలతోనే సతమతమవుతూ చివరకు ఒక నిద్రమాత్ర వేసుకుని పడుకున్నాడు చంద్రం.

ఆ మరునాటినుండి మామూలుగా ప్రవర్తించడం మొదలుపెట్టాడు. తానువెళ్ళిపోతానని రేఖ మళ్ళీ పట్టుపట్టలేదు- అతని సమక్షంలో దీనంగా ప్రవర్తించనూలేదు. అందువల్ల ఆమెను లాలించవలసిన అవసరం మరి రాలేదు చంద్రానికి.

తక్కిన పేషంట్లకన్నా రేఖ విషయంలో ఎక్కువ శ్రద్ధ చిన్న డాక్టరుబాబు చూపుతున్నారనీ, మామూలుకన్నా ఎక్కువసేపు ఆమె గదిలో అప్పుడప్పుడు గడుపుతున్నారనీ ఆ చెవినుండి ఈ చెవికీ, ఈ చెవినుండి ఆ చెవికీ పాకి చివరకు డాక్టర్ చిదంబరంగారి చెవులవరకూ వెళ్ళింది. అతడు ముందు చిరాకుపడి కుమారుడినిపిలిచి గట్టిగా మాట్లాడదామని అనుకున్నాడు. కాని తాను హైపర్‌టెన్షన్ ఉన్న మనిషి. డయాబెటిస్ కూడా ఉంది. అనవసరంగా ఆవేశం తెచ్చుకోవడం తన ఆరోగ్యానికి మంచిదికాదు. భార్య రామలక్ష్మిని పిలిచి ఈ సంగతి చెప్పాడు. ఎప్పుడూ పూజా పునస్కారాలతో మునిగి ఇంటి వ్యవహారం అంతగా పట్టించుకోవడం అలవాటులేని ఆమె తేలికగా నవ్వి అంది— "అటువంటిదేమీ లేదండీ- అయినా అబ్బాయికి ముప్పైఏళ్ళు దాటాయి... ఇంతవరకు పి.జి. అనీ, రీసెర్చ్ అనీ ఏదో వంకచెప్పి ఒకింటివాడు కాకుండా తప్పించుకు తిరుగుతున్నాడు. ఇక మనం ఎలాగో వాణ్ణిఒప్పించి ఆ కాస్తపనీ కానిచ్చి ఒకింటివాడుగా చేస్తే మంచిది. ఆ సుమలత నాకు బాగా నచ్చింది. అబ్బాయికీ ఆ పిల్లంటే ఇష్టం ఉంది అనిపించింది లోగడ నాకు. అప్పుడప్పుడూ ఆ అమ్మాయి వస్తున్నదికాని మరికొద్దిగా ఎక్కువగావచ్చి అబ్బాయితో గడిపేలా చూస్తాను. అన్నీ సర్దుకుపోతాయి. మీరే మీ వర్రీకాకండి"

"నువ్వన్నదీ నిజమే. ఏమీ లేకపోయినా చిలవలు పలవలు కల్పించి అనుకుంటూ వుంటారు. అబ్బాయికిమటుకు తెలియదా మన వంశం, సంప్రదాయం సంగతి? ఏదో, నువ్వే చూడు" అన్నారాయన.

సుమలత ఒక ప్రసిద్ధ పారిశ్రామికవేత్త కుమార్తె. బి.ఎ. పాసైన తరువాత ఇప్పుడు కంపెనీ సెక్రెటేరియట్‌షిప్ పరీక్షకు కట్టడానికి ప్రైవేటుగా కోచింగ్ తీసుకుంటున్నది.

ఆమెకు ఇప్పుడు ఇరవైఅయిదేళ్ళు నిండాయి. పాశ్చాత్యసంగీతం, బాలే అంటే చెవి కోసుకుంటుంది.

రెండు మూడేళ్ళకిందట వాళ్ళనాన్న నాగభూషణం కుమార్తెకోసం సంబంధాలు చూస్తున్నప్పుడు డాక్టరు చిదంబరంగారి అబ్బాయి మీద కన్నుపడింది. మధ్యవర్తులద్వారా అతనికి కబురు పెట్టినప్పుడు కుమారుడికి నచ్చితే తనకభ్యంతరంలేదని అన్నాడు చిదంబరం.

సుమలత అన్న వివేకానంద్. ఒకప్పుడు తానూ మెడిసిన్ చదివి మధ్యలో బోరుకొట్టి మానేసి తండ్రి రెండు చేతుల్తో గడిస్తున్న డబ్బు ఖర్చుపెడ్తూ కాలం గడుపుతున్న మనిషి. అతడు చంద్రంకన్నా ఒక సంవత్సరం సీనియర్‌గా వుండేవాడు మెడికల్ కాలేజ్‌లో. కుమారుణ్ణి పిలిచి చిదంబరం అన్నమాటలు చెప్పి మళ్ళీ చంద్రంతో పరిచయం పెంపొందించుకొమ్మనీ, సుమలతను అతనికి ఇంట్రడ్యూస్ చేయమనీ చెప్పాడు భూషణం.

ఆవిధంగానే వివేకానంద్ ఒకరోజు చెల్లెలితో డాక్టరు చిదంబరం ఇంటికివెళ్ళి ఎప్పుడో చంద్రంతో తెగిపోయిన తన పరిచయాన్ని మళ్ళీ సోల్డరింగ్‌చేసి సుమలతను పరిచయం చేశాడు. అప్పటినుండి వారానికి ఒకసారి వచ్చి చంద్రానికి తీరుబడి అయినా కాకపోయినా అతనితో కొంతసేపుగడిపి మిగిలిన సమయం రామలక్ష్మి మనస్సును ఆకట్టుకోడానికి వినియోగించడం మొదలుపెట్టింది సుమలత. అయితే ఇంతవరకు చంద్రం ఆమెఅంటే గౌరవంగా చూడటంతప్ప ప్రత్యేకమైన మొగ్గు చూపలేదు.

తల్లి రెండు మూడుసార్లు ఈ ప్రస్తావన తెచ్చినప్పుడు రోగాల సైకలాజికల్ బాక్‌గ్రౌండ్‌మీద రీసెర్చికోసం కెనడా, అమెరికా యూనివర్శిటీలలో ప్రయత్నం చేస్తున్నాననీ, అది ఫలించకపోతే చూద్దామనీ ఏవో సాకులు




చెప్పి తప్పించుకున్నాడు. నిజానికి ఏవేవో ఆదర్శాలు- సరిగ్గా తనకే అర్థంకానివి- ఉండటంవల్ల సుమలతవంటి హైసొసైటీ ఆడవాళ్ల ంటే ఒకరకమైన నిరసనభావం కొద్దిగా మనస్సులో పేరుకునివుంది. చక్కగా పొడుగ్గా పిరుదులమీద తుళ్ళుతూ వింత నాట్యంచేసే జుట్టును ఎందుకు కత్తిరించుకుని బాబ్డ్ హెయిర్ చేసుకుంటారో అతనికి అర్థంకాదు. గడ్డకట్టున్న నెత్తురు పూసుకున్నట్లుగా ఎందుకు పెదవులకు వాటి సహజమైన సరిహద్దులు కాకుండా పైనాకిందా పక్కలాకూడా లిప్‌స్టిక్కులు రాస్తారో అంతకన్నా బోధపడదు. అవి సహజమైనవికావు. పెట్టుకున్నవి అని అందరికీ తెలిసినా బ్యూటీస్పాట్లు ఎందుకు మొహంమీద మెడమీదా అంటించుకుంటారో తెలియదు. వాటి అసలు ప్రయోజనం ఒంటిని కప్పడం అయినా నిమ్నోన్నతాలు మరింత ఎక్కువగా కొట్టవచ్చినట్లుగా కనిపించేలా బట్టలు ఎందుకు కట్టుకుంటారో అతనికి ఎప్పుడూ ఆశ్చర్యమే.

ఈ మనఃప్రవృత్తి అంతకంతకూ పెరుగుతున్నా అతడు సుమలత తమ ఇంటికి వచ్చినప్పుడు సాధ్యమైనంతవరకు ఏదో నెపంమీద తప్పించుకుని తిరిగేవాడు. సుమలతావాళ్ళ ఇంటికి తల్లి బలవంతంమీద ఆమెతో కలిసి వెళ్ళినప్పుడు తనతో ఒంటరిగా ఉండటానికి సుమలతకు అవకాశం ఇవ్వడు అతడు. శాస్త్రీయసంగీతమూ, చక్కని ట్యూన్స్‌కల తెలుగు, హిందీ సినిమా పాటలు అంటే తనకిష్టమైనా సుమలత బలవంతాన పాశ్చాత్యసంగీతం చాలా బాగుంటుంది అన్నట్లు నటనమటుకే చేస్తాడు.

ఇటువంటి అనుబంధం చంద్రంతో కల సుమలత రామలక్ష్మి ప్రోత్సాహంతో వారానికి మూడునాలుగుసార్లు రావడం మొదలుపెట్టింది.

★ ★ ★

ఆరోజు ఉదయం చంద్రం తనను పరీక్ష చేసి వెళ్లినప్పటినుండీ రేఖ మనస్సు అదొకరకంగా వుంది.

స్త్రీ సహజమైన ఇన్‌స్టింక్ట్‌వల్లనే కాకుండా — తన దీర్ఘకాలపు వృత్తిలో నేర్చుకున్న దానివల్ల కూడా, చంద్రానికి తనదగ్గర ఎక్కువసేపుగడిపి ఆరోజులా మళ్లీ తన జుట్టునిమిరి, మెడమీది చిరుకురులు అలవోకగా తడిమి వీపుమీద చేయివేయాలని ఉందనీ, అయితే కావాలని అతడు తనను తాను నిగ్రహించుకుంటున్నాడనీ, వృత్తిరీత్యా తప్ప తనను తాకకుండా దూరంగా ఉంచుతున్నాడనీ అనిపిస్తున్నది. అతనిలోపల కామం పునాదిగాలేని నిర్మల ప్రేమ రోజురోజుకీ పెరుగుతున్నదని కూడా ఆమెకు తోస్తున్నది.

తనవంటి ఒక పతితమీద అతనికి ఈవిధమైన భావన కలుగుతున్నదంటే లోపల ఎక్కడో ఒకమూల ఏదో బాధగా అనిపిస్తోంది. ఇటువంటి పరిస్థితిని ఎన్నడూ ఎదుర్కొనని ఆమెలోనూ ఆరోజు అతడు తనను లాలనచేసే వరకు ఉన్న గౌరవభావం ఒక్కమారుగా ప్రేమబీజంగా మారిపోయింది. అది మొలకెత్తి, చివురులుతొడిగి చివరకు మొగ్గలు పొటమరించటం కూడా మొదలైంది. క్రమక్రమంగా అతడు మళ్లీ తనపక్కలో కూర్చుని ఆరోజులా లాలనచేస్తే బాగుండును అనిపించసాగింది.

ఇదివరకులా తన పని పూర్తికాగానే అవతలకువెళ్లిపోయే నర్స్ సునంద ఈరోజు మటుకు డాక్టర్ వెళ్లేంతవరకు అక్కడే తచ్చాడుతూ అలమారు దులుపుతూ కాలంగడపడం కోపం తెప్పించింది రేఖకు.

కోపంతోపాటు ఎందుకో లోతైన బాధకూడా కలిగింది రేఖ మనస్సులో. ఆ బాధలోనే అతని లాలన కోసం తపనకలిగి అంతకంతకూ ఎక్కువై మధ్యాహ్నం నిద్రపోనీయకుండా చేసింది.

ఎప్పుడు సాయంత్రం పరీక్ష సమయం దగ్గరపడుతుందా అని ఆతురతగావుంది ఆమె మనస్సులో. సునంద వెంటనే వెళ్లిపోవాలనీ, చంద్రం ఒక్కరే ఉండాలనీ అనిపిస్తున్నదీ ఆమెకు...మళ్లీ అంతలో ఎందుకో అది ఈవాళ సాధ్యం అయ్యేదికాదు అనితోచి మనస్సుమీద కారం జల్లినట్లుగా అనిపిస్తున్నది. మళ్లీ ఏవో భావనలువచ్చి కారపుపొడి అంతా తుడిచివేసి ఎవరో మనస్సు పొరలమీద వెన్న రాస్తున్నట్లుగా కూడా అనిపిస్తున్నది.



ఆ కలగాపులగపు తలపులతో నెమ్మదిగా మగతగా అయింది ఆమె మనస్సు. ఆ మగతలో చంద్రం మొహం తన మొహానికి దగ్గరగా వచ్చినట్లూ, అతడు తనను పెదవులమీద గట్టిగా ముద్దుపెట్టుకున్నట్లూ కలలో కనిపించింది. అంతలో ఏదో తారస్థాయికి చేరుకోబోతున్న శరీరం ఒక్కసారిగా మంటల్లో తోసినట్లయి మగతజారి పూర్తిగా స్పృహలోకి వచ్చింది ఆమె.

ఆరోజులా మామూలు లాలనమాత్రమేకాక అతడు తనను ముద్దుపెట్టుకోవాలని కోరుకుంటున్నదా తాను అంతరాళాల్లో?

అటువంటి కోరిక ఒక్కసారే వచ్చింది. పదకొండేళ్లకిందట - ఆ చండాలుడు సురాజ్‌మల్‌నూ తననూ తల్లీ, తక్కిన తమవాళ్ల స్త్రీలూ ఒంటరిగా ఆ ఇంట్లో పడకగదిలో వదిలివెళ్లినప్పుడు. అయితే తన బుగ్గలకు అతడు పెదవులు ఆనించి అక్కడ రెండువైపులా నెత్తురులు కారేట్లుగా కొరికినప్పటినుండీ మళ్లీ ఏనాడూ ఆ కోరిక తనలో తలెత్తలేదు - వృత్తిరీత్యా ఎన్నిసార్లో తన బుగ్గలూ, పెదవులూ, శరీరంలో అన్నిభాగాలూ ఎందరో విటులకు



అందించినా అలా అనిపించలేదు.

ఎప్పుడో చూసిన హిందీ సినిమా జ్ఞాపకం వచ్చింధి ఆమెకు: అందులో హీరోయిన్ తన లాటి పతితయే. ఆమె అందానికీ, ప్రవర్తనకూ ముగ్ధుడై హీరో ఆమెను ఆ వృత్తినుండి ఉద్ధరించి, సంఘాన్ని ఎదిరించి ఆమెను చివరకు వివాహమాడి, ఏవో కొండలనడుమ అడవి ప్రాంతానికి వెళ్లిపోతారు. అక్కడ అస్తమిస్తున్న సూర్యుడికెదురుగా ఒక కొలను గట్టున నిలబడిన వారి నీడలు ముద్దుపెట్టుకుంటూ ఉండటంతో సినిమా ముగిసింది.

అటువంటి కోరిక తనకుందా... లేదు! ఇప్పుడు వచ్చింది ఉత్తకల మాత్రమే...నిజమైన కోరికకాదు. ఆ కోరికేవుంటే తన వృత్తిలో అలవాటయిన నటనతో తన కోరిక తీర్చుకోడానికి ప్రయత్నంచేసి ఉండేది తాను. కాని



అతని దగ్గర ఆవిధమైన పనులు చేయాలని ఏనాడూ తనకు అనిపించలేదు.

ఎలాగో సాయంత్రపు వైద్య పరీక్ష సమయం అయింది. అంతవరకూ కలగాపులగంగా మనస్సులో తిరుగుతున్న ఆలోచనలన్నీ అడుగుకుపోయి ఎప్పుడు తన గదిముందు అతని అడుగులు వినపడ్తాయా అన్న ఆతురతతో వుంది రేఖ.

చంద్రం సునందతో లోపలికివచ్చి రేఖను పరీక్ష చేస్తుండగా హఠాత్తుగా పరదాలు తొలగించుకుని సుమలత లోపలికివచ్చింది. మంచంమీదపడుకుని ఉన్న రేఖవైపుగాని, సునందవైపుగాని చూడకుండా చంద్రం దగ్గరగా నిలబడి అతని కళ్లలోనికి చూస్తూ అంది ఇంగ్లీషులో-

"చందర్...చందర్...ఈవాళ మంచి బారోక్ ఛాంబర్ మ్యూజిక్ ప్రోగ్రాం ఉంది రాక్సీ క్లబ్‌లో! కలకత్తానుంచి నలుగురు ఫేమస్ సాలోయిస్ట్స్ వచ్చారు. రికార్డర్, ఒబో, సెల్లో, హార్ప్సికార్డ్ ఇన్‌స్ట్రుమెంటలిస్టులు - కెమేరా టాకొలోన్ ప్రెజెంట్ చేస్తారు ఈ క్వార్టెట్. వివేక్ మూడు టిక్కెట్లు తీసుకున్నాడు మన ముగ్గురికీ - సరిగ్గా ఏడుగంటలకి మొదలవుతుందట. అప్పుడే ఆరవుతూంది. వేగం రెడీ అయితే కారులో ఇంటికెళ్లి అన్నయ్యను పికప్‌చేద్దాం... వేగం నీపని కానీమరి!" గుక్కతిప్పకుండా మాట్లాడింది ఆమె.

రేఖ పల్స్‌చూస్తూ అన్నాడు చంద్రం అనిష్టంగా- "ముందుగా ఫోన్‌చేస్తే బాగుండేది. కొన్ని అర్జంటు కేసులు..."

అతని మాటలు మధ్యలో ఆపి అంది సుమలత "తప్పించుకోడానికి అబద్ధాలు చెప్పకు. నర్స్ రంజన చెప్పింది, అర్జంటు కేసులేవీ ఈవాళిటికి లేవని - కదూ, సునందా?"

సునంద ఇబ్బందిగా చంద్రంవైపు చూసింది.

"జస్ట్ ఏ మినిట్—" అని రేఖ పరీక్ష పూర్తిచేసి నర్స్ సునందకి తగిన సూచనలిచ్చి గుమ్మంవైపు నడుస్తూ అన్నాడు చంద్రం- "నాకీ ప్రోగ్రాంలంటే అంత ఇంటరెస్ట్ లేదని మీకు తెలుసు"

"ఇంటరెస్ట్‌కేమిటుంది? నాలుగైదు ప్రోగ్రాంలు చూస్తే అదే డెవలప్ అవుతుంది. అన్తమానమూ "పలుకవదేమిర..." అనో... "పిలిచినా బిగువటరా" అనో ఆ పాటలు వింటే సరిపోదు. మరేం చెప్పకు...వద...ప్లీజ్...నాకోసం" గోముగా అంది సుమలత.

ఎవరి మనస్సూ గాయపెట్టడం నచ్చని చంద్రం ఆమెతో తప్పనిసరిగా ఆ ప్రోగ్రాంకు వెళ్లవలసి వచ్చింది ఆరోజు.

వాళ్ళిద్దరూ గడపదాటిన తర్వాత సునంద రేఖ పక్కనర్దుతున్నప్పుడు సుమలతను అంతవరకు ఎప్పుడూ దగ్గరనుండి చూడని రేఖ "ఎవరు చెప్మా ఈ అమ్మాయి? డాక్టరుగారితో అంత చనువుగా ఉంది?" అనుకుంది మనసులో. ఇంగ్లీషు అంతగా రాని ఆమెకు వాళ్ల మాటలు సరిగా బోధపడలేదు కాని ఏదో సంగీత కచ్చేరికి వాళ్లు వెళ్తున్నారని మటుకు తెలిసింది.

సునంద వెళ్లిపోబోతున్నప్పుడు నెమ్మదిగా అడిగింది ఆమెను రేఖ "ఆ అమ్మాయి ఎవరండీ?"

"ఎవరు?" అని రేఖవైపు చూసి చిరునవ్వు నవ్వి —"ఇప్పుడు చిన్నబాబు గారితో వెళ్లిన అమ్మాయా? సుమలతగారని ఆయనకి కాబోయే భార్య. బాగా డబ్బుతో పులిసిపోయిన కుటుంబం వాళ్లది.

గుండెమీద ఏదో పెద్దరాయిపడి ఊపిరి తిరగనట్లుగా అయింది రేఖకు.

"డాక్టర్‌గారికి సంబంధం కుదిరిందా?" అతి కష్టంమీద ఊపిరి తీసుకుని అంది ఆమె.

"అయిపోయినట్లే. చిన్నబాబు ఫారెన్‌కు వెళ్లే ముందే శుభకార్యం జరిగిపోవాలని చూస్తున్నారందరూ. అయితే చిన్నబాబు ఏదో వంకమీద వెనక్కు నెట్టు తున్నారు ఆ గడియ"

"అంటే?"

"అంటే అంతే..." నవ్వుతూ అని గుమ్మం వరకూ వెళ్లిన సునందకు రేఖను కొద్దిగా ఏడిపించాలని బుద్ధిపుట్టింది. చిన్నబాబు వైపు రేఖ చూస్తున్న వేళల్లో అతనిని ఆమె లొంగదీసుకోడానికి ఉద్దేశపడుతున్నట్లుగా అని





పించింది ఒకటి రెండుసార్లు ఆమెకు- నిజాని కి అటువంటి ప్రయత్నం రేఖ ఏనాడూ చేయ కపోయినా, అతని మీద దినదినాభివృద్ధిగా ఆమెలో పెరుగుతున్న అనురాగం ఆమెకు తెలియకుండానే ఆక్షణాలలోపైకి కనిపించి వుంటుంది.

"మరేమీలేదు- చిన్నబాబుగారికి ఏవేవో వెర్రి ఆదర్శాలున్నాయి! పేదవాళ్లను ఉద్ధ రించాలనీ, నీలాంటి మనుషుల్ని బాగు చే యాలనీ. వాళ్ల అమ్మకీ, నాన్నకీ ఇలాంటి పనులు సుతరామూ ఇష్టంలేదు. ఎన్ని స్ప్రింట్లు పెట్టి పట్టి వుంచినా, ప్లాస్టర్ కాస్ట్ వేసినా కుక్కతోక ఎప్పుడు తిన్నగా అవదని వాళ్లకి తెలును. ఒకటి మటుకు నిజం- చిన్న బాబు సుమలతగార్ని చేసుకోకపోతే వాళ్ల కుటుంబంలో కలతలు చెలరేగుతాయి" ఈ మాటలు అని వెళ్లిపోయింది సునంద తృప్తి గా.

ద్వారం వైపే చూస్తూ పడుకుంది రేఖ చాలాసేపు.

అవతల ఆ పెంకుటింటి గదుల వసారాలో మధ్యగా ఒక స్తంభానికి తగిలించి ఉంచిన గడియారంలో నుండి ప్రతీ అరగంటకూవచ్చే చప్పుళ్లు సుత్తిపోటుల్లా తగులుతున్నాయి ఆమె మనసు మీద.

ఏదో సినిమాలో ఒక అమ్మాయితో ఆమె తల్లి అన్న మాటలు మనస్సులో కదిలాయి—

"చూడు తల్లీ... ఎన్నో అనుకుంటాం, ఏవేవో కలలు కంటాం జీవితంలో. కాని అంతరాలు, మన సంఘంలో పరిస్థితులూ ఇవన్నీ చల్లగా ఆ కలల్ని కరిగించి వేస్తాయి. చివరకు చీకటి గదిలో మేల్కుంటాం. నాబతుకు అంతే అయింది. నీ బతుకూ అలా కాకూడదని వేయిదేవుళ్లకు మొక్కుకుంటున్నాను..."

అంతరాలు! సంఘంలో పరిస్థితులు!!

అంతలో సునంద చెప్పిన దాంట్లో కొన్ని మాటలు కదిలాయి రేఖ మనస్సులో...

"ఆదర్శ భావాలు..."

"నీలాంటి మనుషులు..."

"పేద వాళ్లు..."

"కుక్క తోక..."

"వాళ్ల కుటుంబంలో కలతలు చెలరేగు తాయి..."

ఈ మాటలతోపాటు... "బారాక్ ఛాంబర్ మ్యూజిక్" "కెమేరాటా కోలోన్..." "నాకు ఇంగ్లీషు రాదు..." "నేనొక పతితను..." "అ తని ముద్దుకోసం ఆరాటం..." "నాకు సిఫిలిస్ జబ్బు... అంటు వ్యాధి..." "నిన్ను పూర్ణ చంద్ర బింబం చేస్తే నాకు తృప్తి ఉంటుంది"— ఇలాంటి మాటలూ కలగాపులగంగా అయి తుఫాను గాలి చెలరేగడం మొదలు పెట్టింది రేఖ గుండెలో. ఆ తుఫాను గాలుల్లో గునపా లూ, బల్లాలూ, సూదులూ, ముళ్లూ, మంట లూ, ఎముకలు కొరికే మంచుగాలులూ దూ సుకు వచ్చి ఆమె ఒళ్లంతా యమబాధ పె ట్టడం మొదలైంది.

అరగంట కొట్టింది గోడ గడియారం.

ఉలికిపడినట్లు మంచం మీద లేచి కూర్చుంది రేఖ.

ఏడున్నర...!

నర్స్ సునంద వెళ్లిపోయి రంజన ఛార్జీ తీసుకుని ఉంటుంది ఇప్పటికి. అర్జంటు కేసు వుంటే తప్ప రంజన మామూలుగా తానున్న గదులవరసలో చివరి గదిలో కూర్చుని అక్కడ ఉన్న ఎవరో తన చుట్టాలతో బాతాఖానీ కొడు తుంది ఎనిమిది వరకూ.

తనకిక్కడ స్థానం లేదు- తానిక్కడ ఉండ కూడదు- వెళ్లి పోవాలి- వెళ్లిపోవాలి రంజన ఆ గదిలోనుండి పైకి వచ్చేముందే.

మంచం కింద ఉన్న తనబట్టల మూట పైకితీసి ఆ గదిలోవున్న తన వస్తువులన్నీ అందులో పెట్టి ఆమూటతో వరండా మీదికి వచ్చింది రేఖ.

పక్క గది వాళ్లు వరండా మీదే కూర్చుని ఉన్నారుకాని వాళ్లెవళ్లూ ఆమెని పలకరించలే దు. మామూలుగా ఆస్పత్రి నుండి డిశ్చార్జి అయివెళ్లిపోయే వాళ్లతో మాట్లాడినట్లుగా- అక్కడ చాలా మంది రేఖతో ఎక్కువగా మాట్లా డరు. ఆమె వృత్తి ఏదో అందరికీ బహిరంగ రహస్యమే.

రేఖ నెమ్మదిగా నడిచి గేటు దగ్గర ఉన్న వేపచెట్టు దగ్గరకు వచ్చేటప్పటికి ఆమెను

చూసి అడిగాడు సునంద కొడుకు.

"నీ డిశ్చార్జయిపోనాదేటి అక్కా?" అక్కడ ఆమెతో ఎంతో ఆప్యాయంగా మాట్లాడేవాడు సుబ్బు ఒక్కడే.

"అయిపోయింది సుబ్బూ". నిజానికి తాను ఇన్నాళ్లుగా కన్న కలలు అన్నీ మనస్సులో నుండి డిశ్చార్జి అయిపోయాయి అనిపిస్తున్నది ఆమెకిప్పుడు.

జాకెట్టులో పెట్టుకున్న పర్సులోనుండి అయిదు రూపాయలనోటు ఒకటి పైకి తీసి ఆ పిల్లాడి చేతిలో పెట్టి "వస్తాను సుబ్బూ" అంది ఆమె కన్నీరుపైకి జారకుండా ఆపుకుంటూ.

"ఇదేటక్కా? సిన్నబాబుగోరు సెప్పినారందరికీ- నీకాడ దేనికీ పైసాలు తీసుకోవద్దని"

జాలిగా నవ్వి అంది రేఖ. "నీ అక్క నీకు బిస్కట్లు కొనుక్కోడానికి ఇస్తున్నది- తీసుకో సుబ్బూ. వద్దనకు.

ఆ నోటు అందుకున్న సుబ్బు "తేంక్సక్కా." బగమంతుడెప్పుడూ నిన్ను సల్లగా సూడాల" అన్నాడు.

"ఇలారా సుబ్బూ" అని పిలిచింది ఆమె. దగ్గరగా వచ్చిన అతన్ని మాతృ ప్రేమతో అక్కున చేర్చుకుని, అతని చుబుకం పుణికి జారిపోతున్న కన్నీటి మొహం పక్కకు తిప్పుకుని "వస్తాను సుబ్బూ" అంటూ గేటు దాటింది.

నడవటానికి- అందులోనూ చేతిలో ఉన్న మూటతో- భారంగా అనిపిస్తున్న ఆమె రూపాయకు రిక్షా మాట్లాడుకుని తిన్నగా తమ స్టేషన్ వడతులముఠాకు నాయకురాలైన జిగ్నీ పాకకు చేరుకుంది.

అప్పుడు అక్కడ జిగ్నీ కొడుకు గోపు- పాతికేళ్లవాడు— ఒక అల్యూమినియం గిన్నెలో ఉన్న అన్నంలో ఉప్పూ, మిరపకాయా, ఉల్లిపాయా నంచుకుని తింటున్నాడు. జేబుదొంగతనం అతని వృత్తి.

పాకకు తలుపుగా ఉన్న తడిక తీసే ఉండటం వలన తిన్నగా లోపలకు వచ్చిన ఆమెను చూసి నోటిలో ముద్దపెట్టుకోబోతూ ఆగి ఆశ్చర్యంగా అడిగాడు అతడు. "అదేటి కావిని పిన్నీ? జబ్బు కుదిరి పోనాదా, ఆస్పత్రి నుండొచ్చేశినావు?"

నిట్టూర్చి "కుదిరిపోయింది" అంటూ మూలవున్న బొంతకానుకుని కళ్లు మూసుకుంది కామిని నీరసంగా.

మళ్లీ భోజనం సాగిస్తూ అన్నాడు గోపు. "ఈమద్దెలో కొత్త పిన్నొకత్తె ఒచ్చినాది పిన్నీ- మంచి పేరెట్టుకుంది మైనా అని... గోరింక రంగులోనే ఉంటాదికాని మంచి సెలాకీ మనిషి- మనయిాడే ఉంటది".

కామిని ఒకసారి కళ్లు తెరిచి చూసి ఏమీఅనకుండా ఎగఊపిరి తీసి కాళ్లు చాచి ఆనేలమీదే పడుకుంది మళ్లీ కళ్లు మూసుకుని. ఆమె ఇదివరకులా సరదాగా ఏమీ మాట్లాడకపోవడంతో జాలిగా ఆమె వైపు చూసి "ఇంకా నీర్సంగానే ఉన్నట్టుండావు... తొంగో కొంతసేపు. నేయెల్లి అమ్మకి సెప్తానులే నువ్వొచ్చేసినావని" అన్నాడు గోపు.

"బిజీటైము- ఇప్పుడేమీ చెప్పొద్దులే గోపూ నేనెళ్తాను ఒక గంటపోయాక. తడిక తాళం చూరుమీద మామూలు జాగాలో పెడ్తాను... అమ్మకి చెప్పు... నాకు కనిపిస్తుందో లేదో..." కళ్లు మూసుకునే అంది కామిని.

"అలాగేలే పిన్నీ..." భోజనం ముగించుకుని తన వృత్తికి కావలసిన పరికరాలు చిన్నకత్తీ, కత్తెర, బ్లేడూ— జేబులో పెట్టుకుని వెళ్ళిపోయాడు గోపు.

తొమ్మిదీ పదీ మధ్య రైళ్ళు వస్తాయి— ఏది ముందు వస్తే అందులో ఎక్కి ఆ స్టేషన్ వదిలి ఎక్కడో దూరాలకు వెళ్ళిపోవడానికి స్థిరపరుచుకుంది కామిని.

కాని ఇప్పుడు మటుకు ఎందుకో తానేదో తప్పు పనిచేశాను అన్నట్టుగా అనిపిస్తున్నది. అంత అభిమానంగా ఇన్నాళ్ళూ చూసిన డాక్టరు బాబుకు చెప్పకుండా వచ్చేసింది తాను.

కాని చెప్తే తనను అక్కడినుండి కదలనివ్వడు...

అయితే తనకక్కడ స్థానంలేదు— తాను ఒక పతిత... అతని జీవితంలో కలతలు చెలరేగడం మంచిదికాదు తనవల్ల.

తాను దూరంగా వెళ్ళిపోవాలి....





# ఆపిల్‌తో నారింజను పోల్చగలమా?



## సాటిలేని మేటి ఆల్విన్

చూసేందుకు ముచ్చటగా, సాంకేతిక పరిజ్ఞానంతోనూ, పనితనంలోనూ సాటిలేని మేటి. వాడుకలో ప్రతి ఆల్విన్ రిఫ్రిజిరేటర్ ఒక మణిపూస.

మా రిఫ్రిజిరేటర్ల తయారీలో 30 ఏళ్ళ నిరంతర శ్రమ, అనుభవం ప్రతిచోటా ప్రతిబింబిస్తుంది.

ప్రత్యేక లక్షణములు:-

- హిటాచీ కంపెనీ వారిచే నిర్మించబడిన కంప్రెసర్.
- త్వరితగతిని చల్లబరిచే సమర్ధనీయమైన "రోల్ బాండ్‌ఫ్రిజర్
- స్టెబిలైజర్ అవసరము లేకుండా 170 నుండి 250 వోల్టుల వరకు పని చేయు శక్తిగలది.
- కేవలము మీట నొక్కితే చాలు. దానంతటదే మంచు కరిగిపోవును.
- వీటన్నిటితో బాటు ఏడు సంవత్సరముల గ్యారంటీ.
- ఇంకా దేశవ్యాప్తంగా సాంకేతిక సర్వీసు సౌకర్యం.

మీకు పసందైన రంగులలో 165 మరియు 300 లీటర్లలో సింగిల్‌డోర్ డబుల్ డోర్‌లలో లభ్యమవుతుంది ఆల్విన్ రిఫ్రిజిరేటర్.



**7 సంవత్సరాలు గ్యారంటి**




**ఆల్విన్**




**అన్ని వేళలందు ఆల్విన్**

MAA(S) H ALN TEL 68 86

చాలా దూరం వెళ్ళిపోవాలి... అతడు ఎంత వెదకినా మరి కనిపించకుండా.

కాని అతన్ని తాను మరిచి పోగలదా? లేదు. ఏనాడూ మరిచిపోలేదు... తల్లి చంద్రికా, ఆ తరువాత ఈ చంద్రబాబూ.... గయాజైలరు- వీళ్ళందరూ తనంటే ఎంతోఅభిమానమూ అప్యాయతా చూపించారు... వీళ్ళు ముగ్గురినీ ఏనాడూ తాను మరిచిపోలేదు....

జాలిగా నవ్వు వచ్చింది ఆమెకు.

మందులు సరిగ్గా తీసుకోకపోతే తన జీవితం అంతం కావడానికి ఎక్కువ కాలంపట్ట దు. మళ్ళీ తన జబ్బు తిరగబెడుతుంది. వృత్తిలో ఇంకా ఏవో జబ్బులూ తనకు సోకితీర తాయి.

మహాఅయితే ఒకటి రెండేళ్ళు...

అంతవరకు ఆ క్లినిక్‌లో డాక్టరుబాబుతో గడిపిన తీయని జ్ఞాపకాలు చాలు తనను నిలబెట్టడానికి... ముఖ్యంగా ఆరోజు... అతడు తలుపులు దగ్గరకులాగి... తన మంచం మీద కూర్చుని... జుట్టు నిమురుతూ....

ఆ దగ్గరలో ఏదో ఇండస్ట్రీస్ వర్క్‌షాప్‌లో షిఫ్టు మారుతున్న సూచనగా తొమ్మిది గంటలు కొట్టారు ఠంగు ఠంగున.

ఉలికిపడి కళ్ళు తెరిచి లేచి కూర్చుంది కామిని.

చంద్రబాబు ఆ అమ్మాయి... పేరు సరిగ్గా జ్ఞాపకం రావటంలేదు. ఆ అమ్మాయితో వెళి న ప్రోగ్రాం తొమ్మిదిన్నరకు అయిపోతుంది. అలోగా తాను ఈ ఊరువదిలి వెళ్ళిపోవాలి.

లేచి నిలబడి వెర్రిగా అటూ ఇటూ చూ సింది కామిని.

క్లినికొళ్ళేముందు తానున్న పాక ఖాళీచేసి తెచ్చి జిగ్నీ పాకలో పెట్టిన తనవంట సామాను గోనెనంచీ మూటా, బట్టల మూటా తీసి పాక అవతలపెట్టి తడిక తలుపు తాళం వేసింది. తాళంచెవి చూరుపైన పెట్టి నెమ్మదిగా ఆ మూటలు రోడ్డు మీదికి ఈడ్చుకువెళ్ళింది. అక్కడికి స్టేషన్ అరఫర్లాంగైనా. ఆ పరిస్థితు లలో బరువు మోయలేని ఆమె ఒక రిక్షాలో కూర్చుని స్టేషన్ చేరుకుంది.

★ ★ ★

మ్యూజిక్ ప్రోగ్రాం ఇంటర్వెల్‌లో అందరూ లాబీలోకి వచ్చారు.

"చాలా చక్కని ప్రోగ్రాం కదూ? అన్నీ ఒరిజినల్ ఇన్‌స్ట్రుమెంట్స్. ఆ సెల్లో ఉంది చూశావా చందర్? అది ఇటలీలో పద్ధెనిమి దవ శతాబ్దంలో అంటోనియో స్ట్రాడివారీ సొంతంగా తన చేతుల్తో తయారు చేసిందే నట. ఇప్పుడు దాని ఖరీదు మార్కెట్‌లో కొన్ని వేల డాలర్లు!"

మెట్లెక్కి వెళ్ళి ముగ్గురూ కాంటీన్ చేరుకు న్నారు. అక్కడ అడామగా చాలామంది ఉన్నా రు. గ్రూపులు గ్రూపులుగా బాతాఖానీ కొడ్తున్న వాళ్ళు కొందరూ, ఒంటరిగావున్న వాళ్ళు కొంత మందీ.

అక్కడి సర్వర్ రెగ్యులర్ కస్టమర్ అయిన వివేకానంద్‌ను చూసి, సెల్యూట్ పెట్టినట్లుగా కుడిచేయి సగం పైకెత్తి "క్యాచాఁహియే సాబ్?" అని అడిగాడు.

వివేకానంద్ చంద్రం వైపుచూసి "వాట్ డుయులైక్ టు హావ్?" అని అడిగాడు.

అన్నవైపు చిరాకుగా చూసి తెలుగులో అంది సుమలత "చెందర్‌కి ఏంకావాలో తెలి యదూ నీకు?" హెడ్ సర్వర్ వైపు తిరిగి "డాక్టర్ సాబ్‌కి అరంజ్‌క్రష్, నాకు లెమొనేడ్" అంది.

సక్రుత్తుగా చెల్లెలూ, అప్పుడప్పుడు కొద్దిగా హార్డ్ లిక్కర్సూ తాగుతుందని వివేకానంద్‌కి తెలుసు. "అది మర్యాద, అలా ప్రతీసారీ అడగడం, ఎవరి అలవాట్లేవో తెలిసినా సుమీ! ఒక్కొక్కసారి కొంతమంది హిపొక్రిటికల్‌గా బిహేవ్ చేస్తారు" కొంటెగా నవ్వి బేరర్ వైపు తిరిగి "సిస్టర్ చెప్పింది కదూ, వాళ్ళకి అంతే- నాకుమటుకు మామూలు కంకాక్షనే" అన్నాడు అదేదో పెద్ద జోకులా నవ్వుతూ.

సిగరెట్ కేస్ జేబులో నుండి తీసి నవిలా నంగా మూతను మీటనొక్కి లేవగొట్టి చంద్రంవైపు చూశాడు. "హావ్ వన్ చెందర్?"

సుమలత చిరునవ్వు బలవంతాన తెచ్చు కుని ఆ కేస్‌లో సిగరెట్ ఒకటి తీసి అన్న పెదవులకు అందించి, కేస్ మూత నొక్కి

అతని జేబులో పెడుతూ అంది "సిల్లీగా ప్రవర్తించకు– చెందర్ సిగరెట్ కాల్చడని నీకు బాగా తెలుసు"

లైటర్ తీసి సిగరెట్ వెలిగించుకోబోతూ అన్నాడు వివేకానంద్ నవ్వుతూ, "ఇప్పటి నుంచే చందర్‌కి కాన్షన్స్ కీపర్‌గా ఉంటున్నావు నువ్వు. నప్షల్ నాట్ ఇంకా పడకుండానే"

"షటప్" అని చిరుకోపం ప్రదర్శించింది సుమలత, చంద్రానికి ఆరంజ్‌క్రష్ ఇచ్చి తాను లెమొనేడ్ తీసుకుంటూ. తన కోసం ప్రత్యేకంగా తయారు చేసిన స్ట్రాంగ్‌కాక్‌టైల్ అందుకుని వివేకానంద్ "ఛీర్స్" అని "టు యువర్ ఫ్యూచర్ హాపినెస్" అన్నాడు.

బాగా మత్తుమీద అన్న ఉన్నాడని బోధపడిన సుమలత చంద్రంవైపు తిరిగి "అన్నయ్య మాటలకి ఏమీ అనుకోకు చెందర్! వాడి సంగతి నీకు తెలిసిందే. ఏంమాట్లాడుతున్నాడో తెలియదు" అని చిరునవ్వుతో అంది. "ప్రోగ్రాం చివర ఇంకా బాగుంటుందట! తప్పకుండా నువ్వు.."

వివేకానంద్ గాబ్లెట్‌లోది గడగడతాగి బేరరుకు మరో స్కాచ్ ఆన్‌దిరాక్స్ కోసం ఆర్డర్ చేశాడు.

"ఒబోమీద సొలోయిస్ట్ వాయించిన హాండెల్ సొనాట్టా చాలా బాగుంది కదూ చెందర్? నిజంగా బారొక్ మ్యూజిక్ అంటే ఏమిటో అద్దం పట్టినట్లుగా చూపించాడు అతడు" అంది సుమలత.

ఈలోగా ఖాళీ చేసిన తన గ్లాసు మరొకసారి నింపడానికి అందించాడు వివేకానంద్.

ఈసారి బాగా కోపం వచ్చిన సుమలత నగం తాగిన లెమొనేడ్ గ్లాస్ టక్కున కౌంటర్ మీదపెట్టి అంది అన్నతో. "నీవెందు కొచ్చావీ ప్రోగ్రాంకి? టిక్కెట్లెందుకు కొన్నావు?" అంది కోపంగా.

తన గ్లాస్ కౌంటర్ మీద పెట్టి సవిలాసంగా సిగరెట్ వెలిగించుకుని కొంటె నవ్వుతో అన్నాడు వివేకానంద్—

"ఎందుకా? అమ్మ మిమ్మల్నిద్దర్నీ తీసుకెళ్లమంది కనుక... మిమ్మల్ని సెవెన్త్ హెవెన్ మెట్లెక్కించడానికి. కాకపోతే ఈ వెధవ రణగొణధ్వనుల కుక్కకూతల, పిల్లి అరుపుల ప్రోగ్రాంకెవడు వస్తాడు? చక్కగా 'మేరా జీవన్ కోరాకాగజు' పాట వింటూ ఇంట్లో కూర్చుని వుందును!"

తెల్లని చెల్లెలి మొహం కోపంతో ఎర్రగా అవడంచూసి స్పృహలోకి వచ్చిన అతడి గొంతులో ఎక్కడలేని మార్దవం నిండి— "నీ మీది అభిమానంతో వచ్చాను సుమీ!" అంటూ ఆప్యాయతతో ఆమె బుగ్గనిమిరాడు.

ఆ చేయి విసురుగా తోసేసి "మంచి అభిమానమే! చాల్లే ఇంక నోటికొచ్చిన మాటలు! ఇక్కడే ఇలాగే వుండి గ్లాసులమీద గ్లాసులు తాగి నరకానికి వెళ్ళు నువ్వు! అనేసి చంద్రంవైపు తిరిగి "పద చెందర్... మనం వెళ్దాం. ప్రోగ్రాం మొదలవుతుంది..." అంది.

బేరర్ తన గ్లాసు మళ్ళీ నింపుతుండగా చంద్రంవైపు చేయిచాపి ఊపుతూ అన్నాడు వివేకానంద్, "ఒకే, బైబై చెందర్! మరి ప్రోగ్రాంకి రాను నేను"

సుమలత అన్నవైపు చురచుర చూస్తూ అంది— "నేను చెందర్ కారులో వెళ్తాను. నీపని అయ్యాక మన కారులో ఇంటికెళ్ళి పడుకో. నువ్వు మటుకు డ్రైవ్‌చెయ్యకు" అంది.

మెట్లు దిగుతున్నప్పుడు నెమ్మదిగా అన్నాడు చంద్రం— "ప్రోగ్రాం నిజానికి చాలా బాగుంది— నీలా నాకా పేర్లన్నీ తెలియకపోయినా! మనస్ఫూర్తిగా చెప్తున్నాను... ఎవళ్ళో అన్నట్లు సంగీతానికి భాష, దేశం, కాలం అనే హద్దులు లేవు. కాని ఒకటి..." కొద్దిగా జంకుతూ అన్నాడు అతడు— "ఒక పేషంట్‌కి ఇవ్వవలసిన అర్జెంట్ ఇంజక్షన్ గురించి నర్స్ సునందకి చెప్పడం మరిచిపోయాను. నువ్వేమనుకోకపోతే నేను వెళ్ళి, నీకోసం డ్రైవరుతో మళ్ళీ కారు పంపుతాను"

అన్న ప్రవర్తనతో తన హుషారంతా తగ్గిపోయిన సుమలత అంది— "నిజంగానా చెందర్? ఆ బోగంపిల్లకు ఏదో ఇంజక్షన్ రాత్రి ఎనిమిదిన్నరకి ఇమ్మని చెప్పావే ఇందాక?"

"ఆవిడకి కాదు... ఇంకొకరికి ఇంట్రావీనస్. నర్స్‌కి తెలియదు"



ఆ బిల్డింగ్‌పైకి వచ్చి ఆడిటోరియంకు వెళ్ళే దారివక్క ఆగి అంది సుమలత— "ఏదో కంప్లైవ్‌చేసి నిన్నీ ప్రోగ్రాంకు లాక్కొచ్చానని అనుకుంటున్నావా చెందర్?" ఆమె గొంతు కొద్దిగా బాధతో నిండివుంది.

"అబ్బే అలాటిదేమీ లేదు" ఆమెను మామూలుగాచేసే ఉద్దేశంతో అన్నాడు చంద్రం. "నీతో కొంతసేపు గడవడం నిజంగా చాలా రిలీఫ్‌గా వుంటుంది"

తృప్తిగా నిట్టూర్పి అంది— "నాన్న టిక్కెట్లు కొనమన్నది నిజమే! ఆయనకూ ఆసక్తి బాగావుంది ఈ ప్రోగ్రాంమీద... కాని ఈవాళేదో కంపెనీ బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్ మీటింగ్ వుండి లాస్ట్‌మూమెంట్‌లో తాను రావడం ఆలస్యం అవుతుందనీ. నిన్ను తీసుకెళ్ళమనీ చెప్పారు. అంతే చెందర్..."

"ఇటీజ్ ఓకే... నేనేమీ అనుకోలేదు మీ అన్న మాటలకి"

ఈసారి నిండుగా చిరునవ్వు వచ్చింది ఆమె మొహంమీదకి. "ఏమిటో ఈ ప్రోగ్రాం మరి చూడాలనిలేదు. పద... నన్ను దింపేసి వెళుదువుగాని"

"అదేమి? నాకోసం..."

"నీకోసం ప్రోగ్రాం మానుకోవటంలేదు. తల నొప్పిగా వుంది... అంతే... పద"

నిర్జనంగావున్న ఒకచోట తానే కారు నడుపుతున్న సుమలత వేగం తగ్గించి రోడ్డువక్కగా దానిని తీసుకెళ్ళి ఆపి, తన ఎడమచేయి చంద్రం కుడిచేయిమీద వేసి అంది. "నిజానికి నీకోసమే ప్రోగ్రాం మరి వినలేదు. ఎందుకో తిరుగుదారిలో నీతో ఒంటరిగా కొంతసేపు గడపాలనిపించింది, మా అన్న బోరమాటల తర్వాత"

వింతగా ఆమెవైపు చూశాడు చంద్రం. "నాకోసం నీకు ఎంతో ఇష్టమైన ప్రోగ్రాం మానుకున్నావా?"

"అన్నిటికన్నా ప్రపంచంలో ఇష్టమైంది నీ



సాన్నిధ్యమే చెందర్." కొద్దిగా ఆగి అంది— "నీకిలాంటి సొసైటీ ఇష్టంలేదని తెలుసు నాకు... అందుకే వారంకిందట ఉదయం దేవుడిపూజ చేస్తూ ఒట్టుపెట్టుకున్నాను..." ఆగిపోయింది ఆమె.

ఆమె అంటున్న మాటలకు ఆశ్చర్యం కలిగిన చంద్రం ఆమెవైపు కొద్ది క్షణాలు చూసి ఆమె తాను చెప్పదల్చుకున్నది పూర్తిచేయకపోవడంతో అడిగాడు— "ఏమని ఒట్టుపెట్టుకున్నావు?"

ఆమె గొంతు కొద్దిగా జీరపడింది రాబోతున్న కన్నీళ్లతో. "నీకు తెలియదుకాని ఇదివరకు అప్పుడప్పుడు లిక్కర్స్ కొద్దికొద్దిగా తాగేదాన్ని కంపెనీకోసం అప్పుడప్పుడు. ఇకమీదట అవి అసలు ముట్టుకోనని ఒట్టుపెట్టుకున్నాను" కొద్దిగా ఆగి అతనిమీదికి ఒరిగి అంది ఆమె. "అంతేకాదు... నా జుట్టు బాబ్‌చెయ్యడానికి జన్మలో ఇక ఆ వెధవ కత్తెరలకు అందించనని కూడా ప్రమాణంచేశాను"

వింతగా అడిగాడు చంద్రం: "ఎందుకీ ప్రమాణాలు?"

"ఎందుకా? ఇలాంటివన్నీ నీకిష్టం వుండవు కాబట్టి."

ఆమె ఏం చేయబోతుందో అతడు గ్రహించేలోగానే తన రెండు చేతులు అతని మెడచుట్టూ పెనవేసి అతని మొహం దగ్గరగా మొహంపెట్టిఅంది ఆమె— "ఆరోజు మర్చిపోయాను దేవుడిదగ్గర... ఇప్పుడు నాదేవుడు నీ దగ్గర ప్రమాణంచేసి చెప్తున్నాను.... ఇకమీదట చీరా, పొడుగు చేతుల బ్లౌజూ తప్ప మరో రకమైన డ్రెస్సు వేసుకోను... ఇలాటి వెస్టరన్ మ్యూజిక్ ప్రోగ్రాంలకి నీకిష్టంలేకపోతే రాను... నిజం చెందర్... నామాట నమ్ము."

ఇబ్బందిగా మొహంపెట్టి ఆమె చేతులను మెడ మీదినుండి తీసి తన చేతులతో పట్టుకుని కొద్దిగా అవతలకు జరిగి అన్నాడు చంద్రం "ఎవళ్ళ అభిరుచులు వాళ్ళవి. నిజానికి ఇందాక మనస్ఫూర్తిగానే చెప్పాను, ఈ ప్రోగ్రాం బావుందని" కొద్దిగా ఆగిఅన్నాడు. బాధనిండిన గొంతుతో అతడు "నాకోసం ఎందుకిలా నీకిష్టమైనవన్నీ వదిలిపెట్టుకుంటున్నావు? వద్దు వద్దు సుమా"

తన కుడిచేయి అతని చేతుల పట్టునుండి విడిపించుకుని తన చిరుగడ్డం కింద పెట్టుకుని రెప్పవేయకుండా అతని కళ్ళలోనికి తిన్నగాచూస్తూ అంది ఆమె. "ఎందుకా చెందర్... కారణం నీకు తెలియదూ?"

రెప్ప వేయకుండా ఆమెవైపు తానూ చూశాడు కొన్ని క్షణాలు చంద్రం. ఒక అర నిమిషం మౌనంగా గడిచింది.

ఆమెకు తన మీద ప్రేమవుందని అతనికి తెలుసును, అయితే తనలో ఆమె అంటే ఉన్నభావం ఆమె మంచితనంమీది అభిమానంవల్లనో లేక మరే కారణంవల్లనో అతనికి సరిగ్గా తెలియదు. దాన్ని గురించి ఎప్పుడూ ఆలోచించలేదు. అప్పుడే పెళ్ళి అన్న విషయం గురించి అనుకోవడం ఇష్టంలేదు అతనికి. అందుకే ఎవళ్ళ విషయంలోనూ ఆ దృష్టితో ఆలోచనలు పోనివ్వలేదు.

తనమీది ప్రేమవల్లనే తన కిష్టంలేని పనులు చేయడం ఆమె మానుకుంటున్నదని ముందే అర్థమైంది అతనికి. "ఎందుకు" అన్న ప్రశ్న తాను వేయకుండావుంటే బావుండును అనిపిస్తున్నది అతనికి ఇప్పుడు.

హఠాత్తుగా ఆమె కుడిచేయి జాపి అతని మొహం తన మొహానికి దగ్గరగా వుండేలా తీసుకొని రెప్పవేయకుండా చూస్తూ "మాట్లాడవేం చెందర్?" అంది.

ఆమె వెచ్చని ఊపిరి అతని మొహానికి తగుల్తున్నది. నెమ్మదిగా "సుమా" అని ఏదో చెప్పబోయి అంతలో ఆగిపోయాడు.

ఆ పిలుపులో ఒక్కసారిగా పైకిఉబికిన అనురాగపు వెల్లువలో తేలిపోతూ అంది ఆమె— "నేను చెప్పనా? ఐ లవ్ విత్ ఆల్ మై హార్ట్ చెందర్".

మొదటిసారిగా తమ ఇద్దరిమధ్య పొటమరించిన ఈ సంభాషణకు విచలితుడైన అతడు కొద్దిక్షణాలు మౌనంగా వుండిపోయి ఆతరువాత నెమ్మదిగా అన్నాడు. "నీ ప్రేమకు నేనర్హుణ్ణి కానేమో! ఇంతవరకు ఏ స్త్రీనీ నేనీ దృష్టితో చూడలేదు. మన పరిచయం మొదలై రెండేళ్ళే అయింది. నేనొక వింత మనిషిని... నాగు





రించి నీకు పూర్తిగా తెలియదు. ప్రస్తుతం నేను పెళ్ళి చేసుకోడానికి సిద్ధంగాలేను. కొన్నాళ్ళు పోనీ... ఈ ప్రస్తావన మనమధ్య రానివ్వవద్దు ప్రస్తుతానికి. ఒకరినొకరు పూర్తిగా అర్థం చేసుకుందాం ఈలోగా. అయితే నాకోసం నీ కిష్టమైనవన్నీ నువ్వుమానుకోవడం నాకిష్టంలేదు. ఇద్దరి అభిరుచులకూ సమన్వయం కుదుర్చుకోగలం అని నమ్మకం ఏర్పడినప్పుడు చూద్దాం. నాకు త్యాగాలమీద నమ్మకంలేదు. క్షణికమైన ఉద్రేకంతో ఏదో అనుకుని ఆతరువాత జీవితాంతం ఏదో పోగొట్టుకున్నామని బాధపడవలసి వస్తుంది''

''నీకోసం ఎన్నాళ్లైనా, ఎన్నేళ్లైనా ఆగుతాను... తొందరలేదు. ఒకవేళ నిన్నే ఏకారణం వల్లనైనా నాలైఫ్ పార్ట్నర్‌గా చేసుకోలేకపోతే బ్రహ్మచారిణిగానే వుండిపోతాను... నిజం.''

ఆమె చేయి తన మెడమీది నుండి తీసి నెమ్మదిగా అన్నాడు చంద్రం. ''అలా అనకు సుమా! నామీది అభిమానంవల్ల, నువ్వు చేస్తా నన్న త్యాగానికి బెదిరిపోయి, నిజంగా నీమీద... ఆ... ఆ... రకమైన దృష్టి లేకపోయినా నిన్ను నేను పెళ్లిచేసుకుంటే నీకుగాని, నాకు గాని సుఖం ఉంటుందనుకోను''

''కాదు... కాదు... బెదిరించి నిన్ను నావాడిగా చేసుకోవడం నాకిష్టంలేదు. ఏదో అనేశాను, క్షమించు చెందర్! కాని... కాని... ఒకటి మటుకు నిజం. నీదగ్గర తప్ప నేనొక 'స్త్రీ'ని అని ఇంకెవ్వరిదగ్గరా నాకనిపించదు... నాకోసం నువ్వు, నీకోసం నేనూ పుట్టాం, అని పిస్తుంది నాకు... నమ్ము చెందర్''

ఒక స్త్రీ గుండెలోతులలో నుండి తన గురించి ఈ విధంగా మాట్లాడటం గాభరాగా అనిపించింది అతనికి. ''నమ్ముతాను... కాని... కాని... నాకూ అలాఅనిపించాలికదూ? అందుకే కొన్నాళ్లు పోనిమ్మంటున్నాను''

''చెప్పాను కదూ... ఎన్నాళ్లైనా ఉంటానని నీకోసం'' ఆగి ఎగఊపిరి తీస్తూ, స్త్రీత్వం పూర్తిగా రెచ్చిపోయిన ఆమె అతనిమీదికి ఎగబాకి మాటలు కూడబలుక్కుంటూ అంది. ''కాని... కాని... ప్లీజ్... ఒక్కసారి... ఒక్కసారి... నన్ను... ప్లీజ్... కిస్‌మి'' మళ్లీ ఆమె చేతులు అతనిని చుట్టుకున్నాయి. ఈసారి పూర్తిగా గాభరాపడిపోయాడు చంద్రం.

బలవంతాన ఆమెపట్టు విడిపించుకుంటూ ''వద్దు ఇలాటి పనులూ, మాటలూ ఇక్కడితో ఆపుదాం'' అంటూ దూరంగా తలుపుపక్కకు జరిగి ''ప్లీజ్ ముందు కారు స్టార్ట్‌చెయ్యి లేదా ఈ పక్కకురా... నేను నడుపుతాను. అప్పుడే లేటయింది నావనికి'' అన్నాడు కొద్దిగా కరకు గొంతుతో.

ఆమె హఠాత్తుగా తలుపు హేండిల్‌కు తగిలించిన తనహేండ్ బాగ్‌తీసి తన పెదవుల మీది లిప్‌స్టిక్ తుడిచేసుకుంటూ అంది ''ఈ లిప్‌స్టిక్‌ల వాసన నీకుపడదు. అందుకే దూరంగా జరిగిపోయావు—''

''అదికాదు సుమా... నన్ను అర్థంచేసుకో. నాకు లిప్‌స్టిక్‌ల మీదా బాబ్డ్‌హెయిర్‌మీదా, స్లీవ్‌లెస్ బ్లౌజులమీదా ద్వేషంలేదు. కొన్నికొన్ని సొసైటీలలో అవి మామూలు అయిపోయాయి. కాని... కాని.. ఎలా చెప్పడమో బోధపడటంలేదు. అవి వేసుకోడానికి వెనుకవున్న సైకలాజికల్ బాక్‌గ్రౌండ్‌తోనే నాకు వచ్చిన పేచీఅంతా. ఏవాతావరణంలో పుట్టిపెరిగినవాళ్లు ఆ వాతావరణాన్ని జీర్ణించుకోవాలి. తల్లి ఒకరకమైన అలంకరణకు అలవాటుపడినదైతే ఆమె కుమార్తె చిన్నప్పటినుండీ అదే సహజం అనుకుంటుంది. అదేవిధంగా అలంకరణ చేసుకుంటుంది. దానికి ప్రత్యేకమైన సైకలాజికల్ కారణాలు అక్కరలేదు. కాని... కాని... మీ అమ్మగారు చూడు, స్వచ్ఛంగా పదహారణాల తెలుగుముత్తయిదువలా ఉంటుంది. మీ ఇంటి వాతావరణమూ పూర్తిగా తెలుగు వాతావరణమే. అయితే మీ అన్నా నువ్వు ఈ విధంగా మరోదారి తొక్కారంటే దానికి బాక్‌గ్రౌండ్‌వేరే ఉండాలి. ఇంటి అవతల మీ కంపెనీ వేరు.. ఆవాతావరణ ప్రభావం మీమీదపడి మీ సైకలాజికల్ బాక్‌గ్రౌండును మార్చింది, అటువంటి మనుషులలో ద్వంద్వప్రకృతి పెరుగుతుంది. నీలాటి భావాలున్న మనుషులతో సంఘర్షణ రావటానికి అవకాశం ఉంటుందని నా అనుమానం. మొదటినుండీ అటువంటి వాతావరణంలో పెరిగిన వాళ్లతో ఏ సంఘర్షణా నాకు కలగదు. బహుశా... ఏమిటో మాట్లాడుతున్నాను... మన



న్నులో ఉద్దేశం సరిగా వివరించడానికి మాటలు సాయపడవు అప్పుడప్పుడు" వాచీచూసుకుని అన్నాడు అతడు "పద... లేటయింది"

అప్పటికి లిప్‌స్టిక్ పూర్తిగా చెరిపేసుకున్న ఆమె "నీఉద్దేశం బోధపడింది. మధ్యలో ఈ రకంగా అలవాట్లు మార్చుకోవడం, కొత్తపద్ధతులు అలవర్చుకోవడం నీకు నచ్చదు. ఏమైనా నా ఇష్టదైవమైన వేంకటేశ్వరులవారిమీద ప్రమాణంచేసి చెప్తున్నాను.. జన్మలో ఈ లిప్‌స్టిక్ మరిరాసుకోను. మొదటిలో పెరిగిన ఆ తెలుగు వాతావరణంలోని ఆడబడుచులాగే ఉంటాను జీవితమంతా. నీకెప్పుడు నామీద నమ్మకం కలుగుతుందో అంతవరకు కాచుకుని ఉంటాను... సరేనా?" అంటూ ఇంజన్‌స్టార్ట్ చేసింది.

చంద్రానికి గుండె జోరుగా కొట్టుకోవటం మొదలుపెట్టింది. ఇటువంటి పరిస్థితిని జీవితంలో ఎన్నడూ ఎదుర్కొనలేదు అతడు. ఒక ఆడది తనకోసం చాలా ఏళ్ళుగా అలవాటయినవన్నీ మనస్ఫూర్తిగా వదులుకోడానికి సిద్ధపడటం చిరాకూ భయమూ కలిగిస్తున్నాయి అతనికి. ఏదో అదృశ్యశక్తి తన మీదికి వలవిసిరి ఆ ఉచ్చుతాళ్ళు బిగిస్తున్నట్లుగా అనిపిస్తున్నది. ఏవలలోనూ చిక్కుపడటం తనకిష్టంలేదు.

రేఖతోనూ ఇదే పరిస్థితి ఎదురయింది. అది బోధపడినప్పటినుండి ఆమెకు దూరంగా ఉంటూ అటువంటి పరిస్థితికి అవకాశం ఇవ్వకుండా ప్రవర్తిస్తున్నాడు. సుమతోనూ అలాగే ప్రవర్తించాలి. సాధ్యమైనంతవరకు ఈమెకు దూరంగా ఉండాలి అన్న నిర్ణయానికి వచ్చాడు, కారు ఆమె ఇంటిదరిదాపులకు వచ్చేటప్పటికి.

ఆమె కారు జోరు కొద్దిగా తగ్గించి అతని వేపు అప్పుడప్పుడూ చూస్తూ అంది "సారీ చెందర్... ఎప్పుడూలేంది ఈవాళ నీదగ్గర ఒళ్ళుమరచి హద్దుమీరి ప్రవర్తించాను... నేనెటువంటి సొసైటీలో తిరిగినా, ఒకపురుషుడితో ఈ విధమైన అనుభవం ఇదే మొదటిసారి. నువ్వు నమ్మితే నమ్ము... లేకపోతే లేదు. క్షమించునన్ను ఇంకెప్పుడు ఇలా చెయ్యను... ప్రపంచంలో అందరికన్నా ఎక్కువైన నీ మీదే ఒట్టుపెట్టి చెప్తున్నానీమాట. నామీద పూర్తినమ్మకం కలిగి నన్ను నీ అంతటనువ్వు దగ్గరకు తీసుకునేవరకు ఎన్నాళ్ళైనా కాచుకుని వుంటాను. అది ఈలోకంలో నాచివరి రోజైనాసరే"

కారు వాళ్ళ ఇంటికిచేరింది. దర్వాన్‌గేటు తెరిచాడు పోర్టికోలోనికి కారు వెళ్లి ఆగగానే ఆమెదిగి— "నీకు పనుంది, ఇప్పుడు నిన్ను లోపలికి రమ్మనను.. బై..." అంటూ మరివెనుకకు తిరిగి చూడకుండా లోపలకు వెళ్లింది.




క్లినిక్ ఆవరణగేటు ఇంకాతీసి ఉండడంవలన కారు తిన్నగాలోపలికి వెళ్లింది.

గారేజిలో దాన్ని పెట్టడానికి వెళ్తుండగా హఠాత్తుగా, కారు లైటు వెలుగు పెంకుటిళ్ల వరసమీద పడ్డాయి. రేఖ ఉండే చివరి గది తలుపుపైన పెద్ద తాళం కప్పకనిపించడంతో ఆశ్చర్యంగా దానివైపు చూసి, కారు అక్కడే ఆపి గేరేజి తాళం తీయడానికి పరుగెత్తుకు వచ్చిన సుబ్బుతో అన్నాడు అతడు. "ఆ చివరిగది తాళంవేసి ఉందేమి? అక్కడిపేషెంట్ ఎక్కడికి వెళ్లింది?"

ఆశ్చర్యంగా అతనివైపుచూసి అన్నాడు సుబ్బు "అయమ్మకి ఈయేల డిశ్చార్జయిపోనాది కదండి? ఇందాకెల్లిపోయిందండి"

"ఎవళ్లు డిశ్చార్జ్‌చేశారు. రేఖ వెళ్లిపోయిందా? ఎన్ని గంటలకిరా సుబ్బూ?"

"ఇంకా ఎనిమిదవనేదండి అప్పుడు... పావుగంటో ఎంతో బాకీ ఉండేది. ఆయమ్మ ఎల్లిపోనాకే ఎనిమిది కొట్టిందండి గడేరం."

విసురుగా వెళ్లి కారులోకూర్చుని స్టార్ట్ చేసి రివర్స్‌చేశాడు చంద్రం. అతివేగంగా గేటులో నుండి దూసుకుని రోడ్డుమీదికి వెళ్లింది కారు.

ఉత్తరదిక్కుగా వెళ్లే రైలు ముందు వచ్చింది.

కామినిని అంతకుముందు బాగా ఎరిగివున్న ఒక లైసెన్స్ కూలీ సామాను మోయడంలోనూ, టిక్కెట్టు కొనిపెట్టడంలోనూ సాయంచేయగా రద్దీగావున్న ఆ రైలులో ఎక్కడానికి వెళ్లింది ఆమె.

గోనెసంచీ, బట్టలమూటా చూసి గుమ్మం దగ్గరవాళ్లు ఆమెను లోపలికి రానివ్వలేదు ముందు- కాని లైసెన్సు కూలీ "ఆడకూతురయ్యా- టికెట్టు కొనుక్కున్నదే... ఎందుకలా అడ్డుతారు?" అని దబాయించి ఆమెను లోపలకు తీసుకువెళ్లి అందరూ మొగాళ్లున్న ఒక బెంచీమీద చివరగా జాగాచేసి కూర్చోబెట్టాడు.

మధ్యాహ్నం క్లినిక్‌లో తాగిన పాలుతప్ప మళ్లీ ఏమీ తీసుకోకపోవడంతో కడుపు ఖాళీగా వుంది.

తాను ఎదుర్కోబోతున్న అనిశ్చిత భవిష్యత్తు గురించిన ఆలోచనల వేడితో అంతకుముందు మంచుగడ్డలా అయిన మనస్సు కరిగిపోయి కన్నీళ్లుగా పైకిరాలడం మొదలుపెట్టాయి.

రైలు సామర్లకోట చేరుకుంది. దిగేవాళ్లు దిగడం, ఎక్కేవాళ్ళు ఎక్కడం జరిగింది. కొంతసేపటికి ఆ రైలు బయల్దేరడానికి సూచకంగా మొదటి బెల్ కొట్టారు.

ఇంక కొద్దినిముషాలలో రైలు బయలుదేరబోతున్న సమయంలో ఆ చివరి తలుపు ద్వారా లోపలికి వచ్చి ఒక్కొక్క బాక్స్ పరిశీలించి చూస్తూ ఈ చివరికి వచ్చిన చంద్రం కళ్లపడింది కామిని. అప్పుడు ఆమె మగతనిద్రలో ఏదో కలలోవుంది.

చంద్రం సంతృప్తిగా నిట్టూర్చి "అమ్మయ్య" అని మనసులో అనుకుని మృదువుగా "రేఖా... రేఖా" అని పిలిచాడు. కామిని కలలోకూడా చంద్రం అలాగే పిలుస్తున్నాడు అప్పుడు. అందువల్ల ఇంకా అది కలే అనుకుంటున్నా ఆమె కళ్లు తెరవలేదు.

అతడు ఈసారి గట్టిగా "రేఖా... రేఖా" అంటూ ఆమె భుజంమీద మృదువుగా తట్టి పిలిచాడు. తుళ్లిపడి కళ్లు తెరిచిన కామిని ఎదురుగా నిలబడివున్న చంద్రాన్నిచూసి గాభరాగా నోరుతెరిచి ఏదో అనబోయి, మాటరాక కొద్ది క్షణాలు అలాగే ఉండిపోయి చివరకు అతికష్టంమీద "మీరా?" అంది.

ఎడమచేతిలో ఆమె చేయి పట్టుకులేవతీసి "ఎక్కడ ఉన్నాయి నీ సామాన్లు?" అన్నాడు చంద్రం.

"ఎలా వచ్చారిక్కడికి మీరు?"

"ఎలా వచ్చానో తరువాత చెప్తాను. ముందు ట్రెయిన్ దిగు. ఏవీ సామాన్లు?"

"వద్దు వద్దు... నన్ను పోనీండి! ప్లీజ్... మీ కాళ్లు పట్టుకుంటాను" ఆమె వంగబోయిన ఆమెను కుడిచేతితో గట్టిగా పొదివిపట్టి వంగి బెంచీకింద చూశాడు. అతడు క్లినిక్‌లో చూసిన మూట కనిపించి రెండవచేతితో అది పైకి లాగాడు అతడు.

"నామాట వినండి... నన్ను పోనీండి... వదలండి నన్ను..." కొద్దిగా హిస్టీరికల్‌గా గట్టిగా అంది ఆమె. అక్కడ మనుషులు మూగారు, ఆ గింజులాటా గోలావిని. అందులో ఒక సూటువేసుకున్న వ్యక్తి చంద్రం చేయిపట్టుకుని లాగుతూ అన్నాడు- "ఎవరయ్యా నువ్వు? ఎవరో అమ్మాయినిలా రమ్మని బలవంతపెడ్తున్నావు రాననంటుంటే?"

చంద్రం గంభీరంగా అతనివైపు చూసి ఇంగ్లీషులో అన్నాడు. "నేను డాక్టర్ చంద్రశేఖరం! రాజమండ్రిలో శ్రీనివాస శుశ్రుత నిలయం మాది. ఈ అమ్మాయి నా పేషెంట్- కొద్దిగా మెంటల్ కేస్... క్లినిక్ నుండి తప్పించుకొని వచ్చేసింది. కారులో వచ్చాను నేను- నా కారు అవతలవుంది" అని సూటు వ్యక్తిమీది నుండి చూపులు మరలించి "వద రేఖా!" అంటూ ఒక చేతితో ఆమె మూట పైకెత్తాడు.

ఇంతలో ఎ.యస్.యం. "దొరికిందా ఆ పిచ్చిపిల్ల డాక్టరుగారూ?" అంటూ చంద్రం దగ్గరకు వచ్చాడు. ఆ మాటలతో రకరకాలుగా మాట్లాడుతున్న మనుషులు గొంతులు కట్టుబడ్డాయి.

ఇంత గోల జరుగుతున్నా మనస్సు అసలు పనిచేయకపోవడంతో కర్రబొమ్మలా నిలబడివున్న కామిని వెర్రిగా అందరి మొహాలూ చూస్తు




న్నది. ఆ చూపులు గమనించినవాళ్లు అందరూ ఆమె నిజంగా పిచ్చిదే అని నిర్ధారించుకున్నారు.

"దొరికింది... థాంక్స్ మిస్టర్ విశ్వనాథం" అని చంద్రం- "పద రేఖా..." అన్నాడు రేఖ వీపుమీద చేయివేసి.

నూటోవేసుకున్న వ్యక్తి చేయిజాపి చంద్రంతో కరచాలనంచేసి ఇంగ్లీషులో "సారీ డాక్టర్... నేను తప్పుగా అర్థంచేసుకున్నాను పరిస్థితి" అన్నాడు.

మూట ఒక చేతితో చంద్రం పట్టుకుని ఉండటం చూసిన విశ్వనాథం (ఎ.ఎస్.ఎం.) "ఉండండి- కూలీని పిలుస్తాను" అని కిటికీ దగ్గర నిలబడి లోపల తమాషా చూస్తున్న ఒక కూలీని పిలిచాడు.

సామాన్లతో కూలీ, ఆ తరువాత చంద్రం, కామినీ, ఆ వెనుక ఎ.ఎస్.ఎం. బండి దిగారు. స్టేషన్ మాస్టర్ ఆకుపచ్చదీపంతో సిగ్నల్ ఇవ్వగా రైలు కూతపెట్టి కదిలింది.

కారు కొంతదూరం వెళ్లింది. ఇద్దరూ మౌనంగానే వున్నారు. ఒకచోట రోడ్డుపక్క లారీ డ్రైవర్లకోసం నడుపుతున్న హోటలు కనిపించగానే హఠాత్తుగా రేఖ ఏదీ తిని ఉండదని తోచిన చంద్రం కారు ఆపి ఆమెవైపు తిరిగి అడిగాడు. "క్లినిక్‌లో భోజనం చేయకుండా వచ్చావు. ఆ తరువాత కూడా ఏదీ తినలేదు కదూ నువ్వు?"

మౌనంగా అతనివైపు చూసింది ఆమె.

"నిజం చెప్పు రేఖా..."

"లేదు... కాని ఆకలిగాలేదు"

"నాకు మటుకు ఆకలిగా వుంది..." అని అతడు అప్పటికే కారు దగ్గరకు పరుగెత్తుకు వచ్చిన హోటల్ కుర్రవాడికి ఆర్డర్ చేశాడు ఇద్దరికీ. "ఒక పావుగంటలో తెస్తాను" అని హోటల్‌లోకి పరుగెత్తుకు వెళ్లాడు ఆ పిల్లవాడు.

ఒకరి మొహం ఒకరు చూస్తూ అలాగే వుండిపోయారు అయిదారు నిమిషాలు.

ఆ హోటలు ముందుపక్క రెండు రాటలకు కట్టిన పెట్రోమాక్స్ లైటువెలుగులు వచ్చి కారు లోపలపడుతున్నాయి.

హోటలు కుర్రవాడు రెండు సీసాలలో మంచినీళ్లూ, ఖాళీగ్లాసులూ, ఒక నీళ్లజగ్గూ తెచ్చి వాళ్లకిచ్చి మళ్లీ హోటలులోకి వెళ్లాడు.

తనవైపు తలుపు తెరుచుకుని "దిగు రేఖా-పైన బోన్నెట్‌మీద ప్లేట్లు పెట్టుకుని తిందాం" అంటూ అతడు పైకి వచ్చాడు. ఆమె దిగకుండా అలాగే కూర్చుని నెమ్మదిగా అంది- "ఏమిటో... ఏమీ తినాలని లేదు"

"ముందు దిగు- నాకు కంపెనీగా వుందువు గాని"

మరి మాట్లాకుండా దిగి ఆమె బోన్నెట్‌మీద చేయివేసి నిలబడింది. తానూ అవతలిపక్కకు జగ్గుతో వెళ్లి తన చేతులు కడుక్కుని "చేతులిలా పెట్టు" అన్నాడు. మాట్లాడకుండా చేయి చాచింది ఆమె. అతడు నీళ్లు పోయగా కడుగుకుంది. జగ్గు బోన్నెట్‌మీద పెట్టి వెళ్లి నీళ్లసీసాలూ, గ్లాసులూ తెచ్చి ఆ పక్క వుంచాడు. రాటవైపే ఆమె చూస్తూండగా అతడు ఆమెవైపే కళ్లు సన్నవిగాచేసి చూస్తూ నిలబడ్డాడు.

భోజనపదార్థాలు వచ్చాయి. హోటలు కుర్రవాడు వెళ్లిపోయిన తర్వాత "ఊఁ... కానీ" అన్నాడు చంద్రం. ఒక పరోటాతీసి ముక్కవిరిచి పప్పులోముంచి, నోట్లో పెట్టుకోడానికి చేయి పైకెత్తి...

రేఖ తన ప్లేటుమీదికి చేయిపోనీకుండా చేతులు కట్టుకుని నిలబడి అంది "డాక్టరుగా ఆజ్ఞాపిస్తున్నారా?"

"ఉఁహూ... సాటిమనిషిగా చెప్తున్నాను"

"ఆకలి లేదని చెప్పాను కదూ?"

తన చేతిలో పరోటాముక్క రోడ్డు పక్కకు గిరవాటువేసి అన్నాడు చంద్రం. "అయిదు సెకండ్లకు ఒక ముక్క చొప్పున ఈ పరోటాలు అయిపోయేంతవరకూ ఇలాగే విసురుతాను. ఆ తరువాత కూరా, పప్పూ కూడా అలాగే వెళ్తాయి. ఆ తరువాత పాలు..." అని మరొక పరోటా ముక్కవిరిచి విసిరి పారెయ్యడానికి చేయి చాపాడు.

పెదవులు బిగించి ఆమె చేయి చాపి తన ప్లేటులో పరోటా ముక్కవిరిచి పప్పులో ముంచి

నోట్లోపెట్టుకుంది.

తృప్తిగా అనిపించిన చంద్రం తానూ తిన డానికి ఉపక్రమించాడు.

భోజనం ముగిసింది. పాలగ్లాసులూ ఖాళీ అయ్యాయి. స్టార్ హోటలులో కన్నా చాలా రుచికరంగా ఆ హోటలు పదార్థాలు వున్నట్లు గా అనిపించింది చంద్రానికి. హోటలు కుర్ర వాడు వచ్చి బోన్నెట్ మీదివన్నీ తీసి గుడ్డతో తుడిచి శుభ్రంచేసి బిల్లు తీసుకుని వెళ్లిపో యిన తరువాత కారు మళ్లీ బయలుదేరింది.

ఒక అయిదు నిమిషాలు గడిచిన తరువాత ఆమె అంది కన్నీటితో పూడుకుపోయిన గొంతుతో-

"ఎందుకిలా ఏనాడో ఊపిరి తీయడం మానేసి చచ్చిపోయిన నా మనస్సు మళ్లీ ఊపిరితీసేలా చేస్తున్నారు?"

అతడు జవాబివ్వలేదు.

కారు ధవళేశ్వరం దాటేంతవరకూ ఇద్దరూ మౌనంగానే వున్నారు. ఊరి పొలిమేరలు దాటి కొంతదూరం వెళ్లిన తరువాత అతనే అన్నా డు-

"నువ్వు ఆరోజు నాకిచ్చిన మాట గుర్తుందా? నేను వెళ్లవచ్చును అన్నంతవరకు క్లినిక్ వదిలి వెళ్లనన్నావు... అవునా?"

'అవును' అన్నట్లు తలఆడించింది ఆమె.

"మరి ఎందుకిలా నా అనుమతి లేకుండా క్లినిక్ వదిలి వచ్చావు?"

జాలిగా నవ్వింది.

"ఇందాకా అక్కడ మనం ఆకలి తీర్చుకున్న ట్లే ఇద్దరి ఆకలి-మనస్సులోది కూడా ఒక్కసారే తీరాలి... ఎందుకు వచ్చేశావు నువ్వు?"

కిటికీలోనుండి అవతలివైపు చూస్తూ అంది ఆమె "మీ బతుకు నా మూలాన చిక్కుముళ్లు పడటం నాకిష్టంలేదు"

ఆశ్చర్యంగా ఆమెవైపు రెండుమూడు క్షణా లు చూసి అన్నాడు చంద్రం- "అంతే?"



హఠాత్తుగా అతనివైపు తిరిగింది. అవతలి వెన్నెల మసకగా లోపల ప్రతిఫలిస్తున్న వెలుతురులో తిన్నగా అతని కళ్లలోనికి చూస్తూ అంది. "ఆ సుమలతగారు మీకు కాబోయే భార్య... నేనొక పతితను. సిఫిలిస్ జబ్బు మనిషిని... మీ పేషెంటును. ఎక్కువ చదువు కోకపోయినా బతుకులో చాలా నిజాలు నేర్చుకున్నాను. ఈమధ్య కొన్నాళ్లుగా ఎందుకో మనిద్దరి మధ్యా ఏదో అనుబంధం పెరుగుతున్నట్లు అనిపించింది. ఆ అనుబంధంతో కట్టుబడిపోవడానికి ఇష్టంలేక దూరంగా వుంటున్నాను కొన్నాళ్లగా. కాని నా మనస్సు ఎదురుతిరుగుతూంది. నిజం చెప్పండి... ఇవాళ ఆ ప్రోగ్రాం నగంలో ఎందుకు తిరిగి వచ్చేశారు మీరు?"

ఆశ్చర్యంగా అన్నాడు చంద్రం- "ఎలా తెలిసింది నీకీ సంగతి?"

"ప్రోగ్రాం చివరివరకూ వుంటే రాజమండ్రి స్టేషన్‌లో ఎంక్వైరీచేసి నేనా రైలులో వున్నానని తెలుసుకుని సామర్లకోటకు సరిగ్గా సమయానికి కారులో చేరుకోవడం అసంభవం. నాకోసమని మీరు ఆ సుమలతగారి మనస్సు కష్టపెట్టి వెనక్కు వచ్చేశారు... అవునా?"

ఆమె అన్నది అక్షరాలా నిజమే. సాయంత్రం సుమలత రేఖ గదిలోకి వచ్చినప్పుడు రేఖ మనస్సు ఎందుకో గాయపడిందని అనిపించింది అతనికి. అందుకే ఇంజక్షన్ వంకపెట్టి ఇంటర్‌వెల్‌లో తిరిగి వచ్చేసి ఒక్కసారి రేఖను చూసి ఆమె మనస్సు గాయానికి మందు రాద్దామని ఎక్కడో అంతరాళాల్లో తనకు తెలియకుండానే కోరిక చెలరేగింది. ఒకవేళ రేఖే తన జీవితంలో అడుగుపెట్టకపోయివుంటే తిరిగి కారులో వస్తున్నప్పుడు సుమలత "ప్లీజ్ ప్లీజ్... కిస్‌మి" అన్నప్పుడు తాను ఏమిచేసివుండేవాడో?

తనకే అర్థం సరిగాకాని తన ఆలోచనలను ఎంత సూటిగా ఊహించగలిగింది ఈమె.

ఆశ్చర్యంగా ఆమెవైపు చూసి కొద్దిక్షణాలు మౌనంగావుండి చివరకు అన్నాడు— "నువ్వు ఊహించింది కొంతవరకు నిజమే. కాని... కాని... సుమలత నాకు కాబోయేభార్య కాదు... నిజానికి ఆమె నాకేమీ కాదు..."

ఈసారి ఆశ్చర్యపడటం ఆమెవంతు అయింది. కళ్ళు విప్పార్చి అతనివైపే చూస్తూ వుండిపోయింది.

"అయినా నీకెవరు చెప్పారు ఆమె నాకు కాబోయే భార్య అని? వాళ్ల మనస్సులో ఉద్దేశం వుందోలేదోకాని మా అమ్మానాన్నా కూడా ఎవరితోనూ ఈ మాట అనలేదే"

"ఏమో"

"మరి ఎవరన్నారు నీతో ఇది?"

"ఆ పేరు చెప్తే ఆవ్యక్తిమీద మీకు కోపంరావచ్చు. ఒకరిమీద చాడీలుచెప్పి వాళ్లకిబ్బంది కలిగించడం నాకిష్టంలేదు"

"ఏ కోపమూ రాదునాకు— నువ్వా పేరు చెప్పినంతమాత్రాన వాళ్లమీద— నాదగ్గర పనిచేసే మనుమలైనా— నేనేమీ చర్య తీసుకోను... నిజం. చెప్పు రేఖా... తెలుసుకోవాలని వుంది"

"నర్స్ సునంద"

"సునందా?"

"అవును... మీమీద నాకు పూర్తి నమ్మకంవుంది, నేనిలా చెప్పినందుకు ఆమెను మీరేమీ అనరని"

"ఆ హామీ నీకు ముందే ఇచ్చాను" అని ఇంకేమీ అనకుండా కారు స్టార్ట్‌చేశాడు. కాని ఒక ఏభైగజాలు వెళ్ళిన తర్వాత రెండు నేరేడుచెట్లకు నడుమగా గోదావరి గట్టువైపు వెళ్తున్న నాటుదారిలో కారు మళ్ళించాడు.

"ఎక్కడికి?"

"అలావెళ్ళి గోదావరి గట్టుమీద కూర్చోవాలనివుంది కొంతసేపు. భయమేస్తోందా నీకు?"

"భయమా... నాకా? మీరుండగా? మీదగ్గరా?" అంది రేఖ నవ్వుతూ.

పండువెన్నెల పిండారబోసినట్లుగా వుంది. ఆకాశంమీద ఎక్కడా ఒక్క మబ్బుతునక కూడా లేదు. దక్షిణపు గాలులు గట్టునవున్న నేరేడుచెట్లనూ, మామిడిచెట్లనూ, వేపచెట్లనూ దాటుకు వచ్చి తమ చలువవేళ్లతో అలవోకగా వాళ్లను తాకి వెళ్ళిపోతున్నాయి ఎక్కడికో.

రేఖా, చంద్రం గట్టుమీద రాతిబండల మీద కూర్చున్నారు. నది .ఎండిపోయివుండ




టంవలన నీరు కొద్దిదూరంలో వుండి వాళ్ల కాళ్ళు ఇసకవ(స్త్రమీద అనుకునివున్నాయి.

చం(ద్రం అన్నాడు "ఒకరోజు చెప్పావు... చిన్నప్పుడు సంగీతం నేర్చుకున్నావనీ, బాగా పాడతావని అందరూ అనేవారనీ?"

"అవును. కాని... కాని..." ఆగి కొద్దిగా జాలిగానవ్వి అంది ఆమె— "బలవంతాన తప్ప మనస్ఫూర్తిగా వదేళ్లై ఎప్పుడూ పాడలేదు"

ఈ వాక్యం ఏదో చక్కని పాటలో మాటలకు ఎవరో అమరగాయని కుదిర్చిన మధురమైన ట్యూన్‌లా వినబడింది అతనికి.

చిరునవ్వుతో అన్నాడు అతడు— "పాడమని నిన్ను బలవంతపెట్టనులే నేను. ఈ వెన్నెలా, ఇసుక తిన్నెలూ, ఆ దూరపు నీరూ, ఈ చల్లనిగాలీ చూస్తుంటే ప్రకృతే ఏదో సంగీతం ఆలపిస్తున్నట్లుగా అనిపించింది. ఎప్పుడో ఏదో సినిమాలో విన్న పాట జ్ఞావకం వచ్చి అడిగాను అంతే!"

"ఏ సినిమాలో? ఏ పాట? నాకు చాలా సినిమా పాటలు వచ్చును. హిందీ, తెలుగు, శాస్త్రీయ సంగీతంతోపాటు తెలుగు సినిమాలు ఎక్కువ చూడకపోయినా టేపు రికార్డర్ పెట్టుకుని వింటుండేవాళ్లం" అంటూనే అ(గ్రా బ్రోతల్ సంగతి స్పృహకురాగా కొద్దిగా మొహం ముడుచుకుంది రేఖ.

దూరంగా నీటిమీద ప్రతిఫలిస్తున్న వెన్నెల వెలుగులను చూస్తున్న అతడు అది గమనించకుండా ఏదో కలలో మాట్లాడుతున్నట్లుగా ఆ సినిమా పేరూ, పాటా చెప్పాడు.

ఆ పాత స్మృతి అడుగుకు తొక్కుకుని సర్దుకున్న ఆమె "నాకు వచ్చు ఆపాట... పాడమన్నారా?" అని అడిగింది.

"పాడాలనివుంటే— మనస్ఫూర్తిగా— పాడు... బలవంతమేమీలేదు"

"మనం వస్తున్నదారిలో పక్కను కాలవా, అక్కడక్కడా చెట్లను పెనవేసుకుపోయిన మోకుతాళ్లలాటి తీగలూ, అప్పుడప్పుడు కమ్మని పూలవాసనా, గాలిలో ఊగే మర్రివూడలూ, కారు కిందినుండి వెనక్కి ఎవరో జోరుగా లాగుతున్నట్లుగావున్న బూడిదరంగు తివాచీలాటి రోడ్డూ ఇవన్నీ నా మనస్సునాకట్టుకుని నా ఆలోచనలమధ్య ఏదో పాటలో చరణాల్లా మనస్సులో మెదులుతుండేవి. ఇప్పుడిక్కడ ఏదో రాగం మోగుతోంది, వింత వీణతీగలలో. నిజంగా దానితో శ్రుతికలిపి పాడాలనివుంది... మీరడగకపోయినా నేనే పాడివుందునేమో"

పాట పాడుతుండగా ఆమె మనస్సులో కదిలిన రంగులకలలు, జీవితపు జ్ఞావకాలు అన్నీ ఎక్కడో పాతాళంలోకి దిగజారి మాయంకాగా— తీయగా, హాయిగా రేఖ మనస్సులో ఇప్పుడు మళ్ళీ కొత్తగా కదలడం మొదలుపెట్టాయి.

కలల లోకంలో వున్న రేఖ చివర పాట పల్లవి అవుతుండగా తాను కూర్చున్న రాతిమీదినుండి లేచి చం(ద్రం కూర్చున్న రాతి ముందు ఇసుకలో చతికిలబడింది. అతని మోకాళ్లమధ్య తలపెట్టుకుని కళ్ళు మూసుకుని చివరి రాగాలావన అంతకంతకూ తగ్గిపోయే స్థాయిలో చేస్తూ మౌనంగా వుండిపోయింది.

తానూ అటువంటి కలల లోకంలోనే వున్న చం(ద్రం తనకు తెలియకుండానే ఆమె జుట్టూ, చెంపలు నిమిరి... కళ్ళూ, కనుబొమ్మలూ, ముక్కూ, పెదవులు ఈ అవయవాల రేఖలన్నీ చూపుడువేలితో చిత్రకారుడి కుంచెలా దిద్దడం మొదలుపెట్టాడు. జలజల పులకరించింది ఆమె ఒళ్ళు తెరలు తెరలుగా.

మౌనంగా కొన్ని నిముషాలు గడిచాయి. మగతని(ద్ర కమ్మినట్లుగాఅయి ఆమె తల కిందికి కొద్దిగా వాలింది.

అసలే పసిమిఛాయలోవుండే ఆమె మెడ— సము(ద్రపు కెరటంలో కొట్టుకువచ్చి ఒడ్డున తడి ఇసుకలో పడిన శంఖంలా కనిపిస్తూ వెన్నెల వెలుగులో మరింత బంగారు రంగు సంతరించుకుంది.

అతడి కళ్ళు ఆ మెడమీదే నిలిచిపోయాయి చాలాసేపు.

గట్టునవున్న పెద్దమామిడి చెట్టు కొమ్మలలో ఏదో పిట్ట వింతగా ని(ద్రలో కలవరించింది. దానితో మగతని(ద్ర చెదిరిన ఆమె మెడపైకెత్తి అతని కళ్ళలోనికి తిన్నగా చూసింది. ఆ

కోణంలో చిన్ని చిన్ని చందమామల అందపు చక్రాలు ఆమె రెండు కనుపాపలలోనూ ప్రతిఫ లిస్తూ తళతళ మెరిశాయి.

గాలికి రేగిన ముంగురులు కొన్ని ఆ చక్రా లకు అడ్డుగా వచ్చిపడగా చంద్రం మృదువు గా వాటిని మళ్ళీ నుదుటిమీదికి తోసి అలవోక గా నిమరడం మొదలుపెట్టాడు. ఆ తాకిడి ఆ రాగి రంగు వెంట్రుకలలో దాగివున్న బంగార మూ, రాగీ, ఇనుమూ, వెండీ మొదలైన లోహా లు అన్నిటినీ కరిగించి వేస్తున్నది, సృష్టికర్తే ఆమె దేహాన్ని మూసలోపోసి కరిగించి మరొక రకంగా-ఇంతకన్నా దివ్యంగా- తీర్చిదిద్దడానికి ప్రయత్నిస్తున్నాడా అన్నట్లుగా ఆమె కళ్ళు మళ్ళీ మూతలుపడ్డాయి ఏదో దివ్యానుభూ తితో.

ఆ మొహంవైపే చూస్తున్న అతను వంగి ఆమెను ముద్దు పెట్టుకోవాలన్న కోరికను అతి బలవంతాన నిగ్రహించుకున్నాడు.

ఎంతసేపు అలా గడిచిందో ఇద్దరికీ తెలి యదు.

స్పృహలోనికి వచ్చినట్లయిన రేఖ నెమ్మది గా కనురెప్పలు తెరిచింది. ముందు తాను ఎక్కడ వున్నానో, ఏమిటో, తనకెదురుగా ఆకాశా నికి అడ్డుగావున్న మొహం ఎవరిదో.

ఆమెకు తెలియరాలేదు.

అక్కడ గట్టుపైన దగ్గరలో ఒక ఎత్తైన నేరేడు చెట్టు కొమ్మమీద కూర్చొని వాళ్ళను కొంతసేపటినుండి చూస్తున్నది గుడ్లగూబ ఒకటి!

అరవడంతో తుళ్ళిపడ్డారు వాళ్ళు ఇద్దరూ.

రేఖ లేచినిలబడి ఆ నేరేడు చెట్టువైపు చూసి, ఇసుక నిండిన చీరకుచ్చెళ్ళు దులుపు కుంటూ చంద్రంవైపు ఓరగాచూసి అడి గింది— "టైమెంత అయింది?"

"ఆఁ?" అని వాచీ చూసుకుని "రెండు దాటుతూంది..." అన్నాడు చంద్రం తానూ లేచినిలబడి.

నిజానికి తూర్పుదిక్కున చిరువెలుగులు పైకి ఎగబాకేవరకూ అక్కడే అలాగే వుండిపో వాలని అనిపిస్తున్నది ఇద్దరికీ.

"రెండయిందా" కొద్దిగా ఆగి అంది— "వెళ్దామా?"

"పద, వెళ్దాం"

★ ★ ★

క్రితంరాత్రి రేఖ ఎనిమిది కొట్టకముందే తన సామాన్ల మూటతో వెళ్ళిపోయింది అన్న సంగతి సుబ్బు తల్లి సునందకు చేరవేశాడు. అమ్మగారు రాత్రి పదకొండు వరకు ఏదో భారతమో, భాగవతమో చదువుకుంటూ మేలుకొని వుంటారని తెలిసిన సునంద సు బ్బు కంచంలో అన్నంపెట్టి వాడు తింటున్న ప్పుడే హడావుడిగావెళ్ళి ఆవిడకు రేఖ వెళ్ళి పోయిన సంగతి చెప్పింది. చిన్నబాబుగారు ప్రోగ్రాంనుండి తిరిగివచ్చి మళ్ళీ వెంటనే కారులో ఎక్కడికో వెళ్ళారని కూడా చెప్పింది. ఆవిధంగా చంద్రం అప్పుడప్పుడు ఏవో సీరి యస్ కేసులు చూడటానికి వెళ్ళడం అల వాటే. అందువల్ల ఈ రెండు విషయాలకూ ముడిపెట్టకుండా ఎలాగైతేనేమి రేఖ పీడ వదిలిపోయింది అన్న సంతోషంతో తన ఇష్టదై వాలను తలచుకుని ధన్యవాదాలర్పించు కుంది రామలక్ష్మి.

ఆ మరునాడు ఉదయం మామూలు అల వాటు ప్రకారం భర్తకు ఆరు గంటలకు కాఫీ ఇవ్వడానికివెళ్ళిన ఆమె, రేఖ క్లినిక్ వదిలి వెళ్ళిపోవడం, సుమలతతో చంద్రం సంగీత కచ్చేరీకి వెళ్ళడం గురించి చెప్పింది.

ఆయన సంతృప్తిగా నిట్టూర్చాడు.

కాని ఆ తర్వాత చంద్రం రేఖను మళ్ళీ క్లినిక్‌కు తీసుకువచ్చి పాత గదిలో పెట్టాడని విన్నప్పుడు ఆమెకు గుండె ఒక్కసారిగా ఆగిన ట్లయింది. కొద్దిగా ఆలోచించి ఆమె తనకీ కబురుతెచ్చిన సునందతో, పెద్దబాబుగారికీ సంగతి ప్రస్తుతానికి తెలియనివ్వవద్దనీ, తానే చంద్రంతో స్వయంగా మాట్లాడతాననీ చె ప్పింది.

తనకు వీలయినప్పుడు భోజనానికి వస్తాడు మధ్యాహ్నం చంద్రం. ఆ విషయం మామూ లుగా వంటమనిషే చూసుకుంటుంది. అయితే ఈరోజుమటుకు రెండు గంటలకు చంద్రం భోజనానికి వచ్చినప్పుడు వంటమ

నిషి బదులు తల్లే స్వయంగా డైనింగ్ హాల్ లోనికి రావడం ఆశ్చర్యం కలిగించింది. తల్లిని అడిగాడు "పేరవ్వగారేరమ్మా?"

"దానింటికి ఎవరో చుట్టాలొచ్చారట—నేనే వేగం వెళ్ళిపొమ్మన్నాను." అంటూ అతని భోజనం నర్దడం మొదలుపెట్టింది ఆమె.

"నీకెందుకమ్మా శ్రమ? వెళ్ళి పడుకో... అన్నీ ఇక్కడే వున్నాయి నువ్వెందుకు కాచుకు కూచున్నావు?"

"శ్రమేమిటి? రాత్రెలాగూ నువ్వే పెట్టుకు తింటున్నావు పేరవ్వ వెళ్ళిపోయాక వస్తే... ఒక్కొక్కరోజు ఎక్కడో ఎవరితోనో భోంచేసి తెల్ల వారుఝామున వచ్చినవాడివి ఈ లోపలికే రావు! వగలన్నా తల్లిని నేనామాత్రం ఒక్క పూట కాచుకోవడంలో తప్పేముంది?"

వింతగా తల్లివైపు చూశాడు చంద్రం. కాని తలవంచుకుని ప్లేటులో అన్నం వడ్డిస్తున్న ఆమె మొహంమీది భావాలు అతనికి కనరాలేదు.

అందువల్ల ఆ విషయమే తల్లి అంటున్నది అనుకున్న అతడు భోజనానికి ఉపక్రమించాడు. ఆమె బల్లకు అవతలివైపు కుర్చీలో ఎదురుగా కూర్చుంది.

భోజనం ముగిసింది. అతడు వాష్‌బేసిన్ దగ్గరకు వెళ్తుండగా ఆమె అంది— "చేతులు కడుక్కునివచ్చి ఇలా కూర్చో చంద్రం... నీతో కొద్దిగా మాట్లాడాలి"

ఏదో తనపెళ్లి గురించి అయి ఉంటుంది అనుకున్న అతడు తిరిగివచ్చి ఆమె ఎదుట కూర్చుని అన్నాడు— "ఏమిటమ్మా అది?"

"చూడబ్బాయి— నాన్నగారు జబ్బు మనిషి— ఆయన మనస్సుకు కష్టం కలిగించి ఆవేశం తెప్పించే పనులు మన మెవ్వరమూ చేయకూడదు. అందుకే నాన్నగారికి మన మాటలు వినపడరాదని ఇక్కడ మాట్లాడుతున్నాను"

ఈవేళ తల్లిధోరణి వింతగా అనిపిస్తున్న చంద్రం కనుబొమలు కొద్దిగా ముడిచి ఆమె కళ్లలోనికి తిన్నగా చూస్తూ అన్నాడు "నాన్నగారికి కష్టం కలిగించే పనులు నేనేమీ చేయటంలేదే! నువ్వూ, నేనూ మటుకే కదూ ఈ ఇంట్లో ఉంటున్నది?"

"చేస్తున్నావు కనుకనే" నిట్టూర్చి అంది ఆమె.

చిరాకుగా అన్నాడు చంద్రం. "ఏమిటమ్మా నువ్వనేది?"

"ఆ భోగంపిల్ల గురించి...."

"ఆ చివరిగదిలో ఉన్న రేఖ గురించా నువ్వంటున్నది?" ఆశ్చర్యంగా అడిగాడు చంద్రం.

"అవును... ఆ పిల్ల నిన్న సాయంత్రం వెళ్లిపోతే నువ్వు కారులోవెళ్లి మళ్లీ తీసుకొచ్చావట— ఎందుకంత శ్రద్ధనీకా భోగందానిమీద? దానికే నీవైద్యం అనవసరం అయినప్పుడు? నాన్నగారికి ఈ విషయం తెలిస్తే ఎంత బాధపడ్తారో ఏమన్నా ఆలోచించావా?"

కొన్నిక్షణాలు మౌనంగా తల్లివైపు చూసి అన్నాడు అతడు. "అందులో తప్పేమిటుందమ్మా? అటువంటి కేస్ కుదర్చగలిగితే మనక్లినిక్కే పేరొస్తుంది"

"కుదర్చవచ్చు— వద్దనలేదు. కాని అది తనంతటతాను వెళ్లి పోయినప్పుడు నువ్వు— అర్థరాత్రి వెళ్లి దాన్ని వెనక్కు తీసుకురావడం మటుకు ఏమీ బావులేదు"

"ఆ అమ్మాయి చాలా అమాయకురాలు... ఏదో అనుకుని వెళ్లిపోయింది. అందుకనే స్వయంగా వెళ్లి నచ్చచెప్పి మళ్లీ తీసుకొచ్చాను."

"ఏమిటనుకుంది?"

"మన దయాధర్మాల మీద బతకడం, ఉచితంగా ఖరీదైన చికిత్స చేయించుకోవడం ఆ అమ్మాయి కిష్టంలేదు."

దీంట్లో కొంతనిజం లేకపోలేదు— మొదట్లో రేఖ అందుకే బాధపడింది. ఆ తరువాతనే సుమలత గురించి.

"ఆ అమ్మాయి జబ్బు పూర్తిగా నయంచేయగలనన్న నమ్మకం నాకుంది. చూడమ్మా... నా సంగతి నీకు బాగా తెలును, ప్రస్తుతం ఎటువంటి అనుబంధాల్లోనూ చిక్కుకోవడానికి నాకిష్టం లేదనీ, అనవసరపు ముళ్లు వేసుకోననీ నువ్వెరుగుదువు. మరిఎందుకిలా నాగురించి దురభిప్రాయపడుతున్నావో బోధపడ




దు"

"దురభిప్రాయపడుతున్నది నేను కాదు చంద్రం"

"మరెవరు?"

"అందరూ... శ్రీనివాస శుశ్రుతనిలయం చిన్న డాక్టరుబాబు తక్కిన పేషంట్ల గదుల్లోకన్నా ఎవరో బోగంపిల్ల గదిలోనే ఎక్కువసేపు గడుపుతున్నాడనీ, ఏదో బాతాఖానీ కొడ్తుంటాడనీ.... మన స్టాఫేకాదు, పేషంట్లూ, ఊళ్లోవాళ్లు అందరూ నానా రకాలుగా అనుకుంటున్నారు. అవసరంలేక పోయినా నెలల తరబడీ ఇన్పేషంట్గా ఉంచుతున్నావనీ, బోలెడంత డబ్బు దానికోసం ఖర్చు పెడ్తున్నావనీ.... ఈ మాటలు వింటూంటే నాకే బాధగావుంది, నీ మంచి తనం గురించి ఎంత తెలిసినా నాన్నగారు ఇంకెంత బాధపడ్తారో ఇది తెలిస్తే"

ఈ విధంగా తమగురించి తప్పుగా అనుకుంటున్నారని ఏనాడూ ఊహించని అతడు నిశ్చేష్టుడయ్యాడు ముందు. కాని అంతలో నర్దు కుని కొద్దిగా చిరాకుగా మొహం పెట్టి అన్నాడు... "చూడమ్మా— నాకు సైకియాట్రీ, సైకోథెరపీ అంటే అభిమాన విషయాలనీ, ఫారెన్కు వెళ్లి రీసెర్చి చేయాలనుందనీ నీకు తెలుసు. ఆ దృష్టితోనే అంతమంచి పిల్ల, అంతగా తెలివితేటలూ సంస్కారమూ కలది ఆ వృత్తిలోకి ఎందుకు దిగవలసి వచ్చింది అని శాస్త్ర దృష్ట్యా కుతూహలంతో వివరాలు తెలుసుకోడానికి ఆ అమ్మాయి గదిలో నేను కొద్దిగా ఎక్కువ కాలంగడపడం నిజమే— అయితే ఆగది తలుపులు ఎప్పుడూ తీసే ఉంటాయి. పైగా రాత్రిళ్ళెప్పుడూ ఆ గదిలో నేనడుగు పెట్టలేదు. మరి మా గురించి ఈ తప్పుడు అభిప్రాయం ఎందుకు పడుతున్నారో అర్థంకాదు నాకు. ఆమెను వృత్తి దృష్ట్యా పరీక్షించడం అంటావా, నర్స్ సునంద ఎప్పుడూ నావక్కనే ఉంటుంది. అలాటి పరీక్షలు ఎంతమందో ఆడవాళ్లకి చేశాం నేనూ, నాన్నా ఆ సమయాల్లో తనవృత్తి మీద గౌరవం, అభిమానం ఉన్న ఏడాక్టరూ తనమనస్సు లోనికి చెడు ఉద్దేశాలు రానివ్వడు"

కొడుకు అంటున్నది నిజమే అనిపిస్తున్నది ఆమెకు. కాని... కాని....

కొద్దిగా ఆగి అంది ఆమె- "పోనీ ఆమెను ఔట్పేషెంట్గా ట్రీట్ చెయ్యకూడదూ? ప్రతీ రోజూ రావచ్చు ఆమె అవసరమైతే"

జాలిగా నవ్వి అన్నాడు చంద్రం. "లాభంలేదమ్మా— ఒక్కరాత్రి గేటుదాటి ఆపిల్ల అవతల ఎక్కడో గడిపిందంటే ఇంతవరకూ చేసిన చికిత్స బురదలో పోసిన పన్నీరవుతుంది. నీకీ సైంటిఫిక్ విషయాలు తెలియవమ్మా" ఆగిఅన్నాడు అతడు. "సరేలే... సాధ్యమైనంత వరకు ఆమెగదిలో ఎక్కువసేపు ఉండను. అవసరమైతే ఆమెను నా కన్సల్టింగ్ రూంకే పిలిపించి మాట్లాడ్తాను. ఆ మాటమటుకు నీకిస్తున్నాను"

మరి ఈ సంభాషణ పొడిగించడానికి ఇష్టంలేక లేచి నిలబడి అన్నాడు. "థాంక్స్ మ్మా ఇలా మనస్సువిప్పి మాట్లాడినందుకు. నీలాటి తల్లి దొరకడం నా అదృష్టం" వెళ్లబోతూ వెనక్కు తిరిగి అన్నాడు. "నాన్నగారికి ఈ కేసుగురించి నేనే స్వయంగా వివరించి చెప్తాను ముందుగా... ఎవరన్నా ఆయన చెవులు కొరికినా దురభిప్రాయ పడకుండా ఉండటానికి. ఆయన అర్థం చేసుకుంటారు"

"వద్దులే అబ్బాయి... ప్రస్తుతానికి ఆ అవసరం లేదు. చూడు... ఒక్కసారి ఇలారా"

టేబుల్ దగ్గరకువచ్చి నిలబడి అడిగాడు... "ఎందుకమ్మా?"

"సుమలత గురించి— వాళ్లతో మాట్లాడమన్నావా? తొందరపడుతున్నారు వాళ్లు"

కొద్దిగా నవ్వు వచ్చింది అతని పెదవుల మీదికి. నెమ్మదిగా అన్నాడు. "నిజం చెప్పమన్నావా? నిన్న రాత్రి క్లబ్బులో సుమా, నేనూ దీన్ని గురించి మాట్లాడాం. పరస్పరం సమన్వయం కుదురుతుంది అన్నప్పుడు మేమే మీతో చెప్తాం" ఇంకొద్దిగా నవ్వుతూ అన్నాడు అతడు. "ఫారెన్కు వెళ్లి ఎవరో దొరసానిని పెళ్లి చేసుకుంటానని మటుకు ఎప్పుడూ భయపడకు నువ్వు"

★ ★ ★

అది కార్తీక మాసం. శుక్ల పక్షపు రెండవ వారం మొదలైంది.

కొత్తవట్టణం అని సముద్రం ఒడ్డున ఉన్న

ఒక ఊళ్ళో పెద్దతిరణాల అవుతుంది కార్తీక పౌర్ణమికి. అది మూడునాలుగు గంటల ప్రయాణ దూరంలో ఉంది ఆ పట్టణానికి. అక్కడ ఆ పర్వదినంనాడు సముద్రస్నానాలు చేయడానికి పేషెంట్లలో కొందరూ, వారికి తోడుగావున్నవాళ్ళూ సరదాపడుతూ మాట్లాడటం రేఖ గమనించింది.

స్పెషల్ బస్సులో తానూ వెళ్ళడానికి డాక్టరు చంద్రాన్ని అనుమతి అడిగింది రేఖ. ముందు ఒప్పుకోలేదు కాని ఆమె తన తల్లి గురించి చెప్పడంతో అతడు అంగీకరించాడు.

★ ★ ★

కన్నెపిల్లలు కార్తీకపౌర్ణమినాడు కొత్తపట్టణంలో స్నానం చేసి సూర్యచంద్రులకూ, అగ్ని






దేవుడికి పూజ చేస్తే వేగంగా వివాహం అవుతుందనీ, మంచి వరుడు దొరుకుతాడనీ, పనసపళ్ళలాంటి పిల్లలు పుడతారనీ అన్న నమ్మకం ఆ ప్రాంతాల్లో వుంది.

ఈ సంగతి తెలిసిన మమలత అన్న వివేకానంద్‌తోనూ, తల్లి వేదవతితోనూ ఆ జాతరకు వెళ్ళడానికి ప్రోగ్రాం వేసింది. ఈ సంగతి విన్న రామలక్ష్మి చాలాఏళ్ళుగా తానూ వెళ్ళని ఆ జాతరకు వెళ్దామని చంద్రంతో అంది. ఆ అయిదుగురూ వెళ్ళడానికి చాలారోజుల కిందటనే స్థిరమైంది.

ఆ రాత్రికి అక్కడే ఉండిపోయి పండు వెన్నెలలో సముద్రం ఒడ్డున కూర్చుని చంద్రంతోపాటు ఆ దృశ్యం చూద్దాం అన్న ఉద్దేశంతో మమలత అక్కడ శ్రీయా లాడ్జిలో రూంలు బుక్ చేయించింది.

★ ★ ★

రేఖ ఎక్కిన బస్సు ఉదయం ఏడుగంటలకి కొత్త పట్టణం చేరుకుంది. బస్సు మళ్ళీ సరిగ్గా పన్నెండు గంటలకు— ఒక నిమిషం అటూ ఇటూ కాకుండా— బయల్దేరుతుందనీ అలోగా అందరూ తిరుగుప్రయాణానికి బస్‌స్టాండ్‌లో స్థిరంగా ఉండాలనీ, ఎవరు రాకపోయినా

ఉండిపోవలసివస్తుందనీ, బస్సు టిక్కెట్టు డబ్బు వాపసు చేయడం ప్రశ్న లేదనీ గట్టిగా చెప్పాడు ఆ డ్రైవరు.

ఆ ముసలావిడ తోడుగా సముద్రపుటొడ్డు చేరుకుంది రేఖ. అక్కడ ఇసుకలో చేపలు పట్టేవాళ్ళ పడవలు చాలావున్నాయి. అన్నిటిమీదా యాత్రీకులు తమ తమ బ్యాగ్గులూ, బట్టలూపెట్టి ఎవరినో ఒకరిని కాపలాగా ఉంచి స్నానాలకు వెళ్తున్నారు. ఆడవాళ్ళు చాలామంది పూజకు కావలసిన గంధం, కుంకుమా, పసుపూ, అక్షింతలూ, పూలూ, చిల్లర డబ్బులూ, వీటితోపాటు మూడు చిన్న గుండ్రటి రాళ్ళూ తెచ్చుకున్నారు. అలా తెచ్చుకోనివాళ్ళు అక్కడా ఇక్కడా వెతికి రాళ్ళు సంపాదించి పూజాద్రవ్యాలు అమ్మే దుకాణాల దగ్గర కావలసినవి కొనుక్కుంటున్నారు. ఆ దుకాణాలవాళ్ళు రాళ్ళు కూడా పావలాకు మూడు చొప్పున అమ్ముతున్నారు రాళ్ళేరుకోడానికి ఓపికలేని వాళ్ళ కోసం.

స్నానాలకు వెళ్ళేముందే అనువైన చోట్ల పూజా సామాగ్రి, రాళ్ళూ సర్ది పెట్టుకుంటున్నారు అందరూ— భార్యాభర్తలు పంచా చీరె కొంగుముడి వేసుకుని 'సరిగంగ' స్నానాలు చేస్తున్నారు. తడిసిన బట్టలతోఉన్న ఆడవాళ్ళ వైపు చాలా కళ్ళు బిగుసుకుంటున్నాయి.

ముసలావిడ రేఖకు సొంత తల్లిలా అన్ని విషయాల్లోనూ సాయపడి తానే మంత్రాలు చదివి రేఖ పేరిటా, ఆమె తల్లి చంద్రిక పేరిటా పూజ చేయించింది.

పూజ పూర్తి అయిన తర్వాత ఆ ఇసుకలో ముసలావిడకు సాష్టాంగ నమస్కారం పెట్టి పదిరూపాయల నోటూ, పచ్చు రూపాయ ఒకటీ పెట్టిన తాంబూలం ఆమె చేతిలో పెట్టింది రేఖ. ముసలావిడ ఆశ్చర్యంతో "ఇదేమిటమ్మా? డబ్బు కోసం నేను నీకు సాయంచేయలేదు. నిన్ను చూస్తే పోయిన మా మనవరాలు జ్ఞాపకం వచ్చిది. అంతేగాని!" అంటూ అదితీసుకోడానికి నిరాకరించింది. కానీ... రేఖ "పూజ తర్వాత దక్షిణ బ్రాహ్మణులకు ఇస్తేగాని ఆ పూజాఫలం దక్కదని మా అమ్మ చెప్పింది. అందువల్ల వద్దనకండి- బ్రహ్మస్వరూపులు మీరు" అని బలవంతపెట్టగా తీసుకుంది.

తన పినతల్లి కూతురు ఆ జాతరకు వచ్చి ఉంటుందనీ ఆమెను కలుసుకోవాలని ఉందనీ చిన్న అబద్ధం ముసలావిడకు చెప్పి, సరిగ్గా పన్నెండులోగా బస్సుస్టాండుకు చేరుకుంటానని చెప్పి, రేఖ తన బ్యాగ్‌తో సహా నెమ్మదిగా జనంలో కలిసిపోయింది.

★ ★ ★

జనసమ్మర్దం ఎక్కువగా ఉండటంవలన బస్సుల్ని సముద్రం ఒడ్డుకు మూడుమైళ్ల దూరంలోనే ఆపేశారు పోలీసు బందోబస్తువాళ్లు. కార్లూ, జీపులూ, రెండుచక్రాల బళ్లూ మటుకు వదిలి పార్కింగ్ ప్లేసులు సముద్రం ఒడ్డున ఏర్పాటుచేశారు.

అంత జనసమ్మర్దంలోనూ అతి చలాకీగా కారునడుపుతున్న సుమలత చాకచక్యానికి ముగ్ధుడు అయ్యాడు చంద్రం.బాగాతాగి ఉన్నప్పుడూ వివేకానంద్ కారు నిపుణంగానే నడుపుతాడుగాని లోపల కూర్చున్న వాళ్లకుమటుకు ప్రతిక్షణమూ ఒక గండం గడిచాం అన్నట్లుగానే అనిపిస్తుంది. సుమలత ఎంత జోరుగా నడిపినా నిశ్చింతగా కూర్చోవచ్చు అనిపించింది అతనికి.

కారు పార్కింగ్ ప్లేస్‌లో ఆగింది. నలుగురూ దిగి కారులాక్ చేసి స్నానానికి వెళ్లారు.

సరిగ్గా వాళ్ళు వెళ్లిన అయిదు నిముషాలకు రేఖ వచ్చింది నాలుగోసారి పార్కింగ్ ప్లేస్‌కు-క్లినిక్‌కారుల కోసం చూసిందికాని ఎక్కడా కనిపించక ఏదో పోగొట్టుకున్న దానిలా బాధపడుతూ మళ్ళీ వెళ్ళిపోయింది. క్లినిక్ కారులో కాకుండా సుమలత కారులో వాళ్ళూ వచ్చారని ఆమెకు తెలియదు. జాతరలో ఏవో గాజులూ, పూసలదండలూ, చెవులరింగులూ, జడపిన్నులూ, మొదలైనవి చాలా కొంది ఇదివరకే. అయినా మరొకసారి వెళ్లి దుకాణాల దగ్గర చంద్రం పార్టీకోసం వెదకుతోంది.

పూజ ముగిసిన తర్వాత పార్కింగ్ ప్లేసుకు దగ్గరలోనే ఉన్న శివాలయానికి, స్వామీజీవారి మఠానికీ వెళ్లివస్తానని అన్నారు రామలక్ష్మి, వేదవతీ. సుమలత కూడా వారితో వెళ్లింది.చంద్రం జాతరలో కొంతసేపు అటూ ఇటూ తిరిగి మళ్లీ పార్కింగ్ ప్లేస్ దగ్గరకు

వచ్చేటప్పటికి అక్కడ కారుదగ్గర సుమలత కనిపించింది.

పార్కింగ్ ప్లేస్ దగ్గరలోనే ఒక రావి- జువ్వి చెట్ల జంటకు చుట్టూకట్టిన పెద్దగుండ్రని చప్టా ఉంది. అక్కడికి వెళ్లి పక్కపక్కగా ఆ చెట్టుకానుకుని కూర్చున్నారు చంద్రం, సుమలత.

సుమలత ఏదో హుషారుగా మాట్లాడుతోంది మధ్యమధ్యలో అతని మీద ఎందుకో ఒకందుకు చేతులు వేస్తూ. జనసందోహాన్ని చూస్తున్న అతని మనసులో ఆ మూకలో ఎక్కడో రేఖ ఉందన్న ఆలోచన కదలాడుతూంది.

వాళ్లు అక్కడకూర్చుని మాట్లాడుతున్నప్పుడు రేఖ అయిదవసారి ఆ పార్కింగ్ ప్లేసుకు వచ్చింది. చంద్రాన్ని ఆ జాతరలో చూడాలన్న ఆతురత ఎందుకో ఆమెకే తెలియదు.

ఒకవేళ అతడు కనిపించినా తనవాళ్ల మధ్య ఉన్న అతని దగ్గరకు వెళ్లి తాను మాట్లాడే అవకాశం లేదు. కాని ఏదో తెలియని అనుబంధం ఆమె మనస్సును ఆరాటపెట్టూ కాళ్లు అక్కడికి లాక్కువస్తున్నాయి.

మళ్లీ నిరాశే ఎదురైనా ఆమె ఎవరినో టైం అడిగి అప్పటికింకా పదిన్నరే కావడంవల్ల మరొక అయిదారు నిముషాలు అక్కడే తచ్చాడుతూ రావి-జువ్వి చెట్ల చప్టాకు కొద్దిదూరానికి వచ్చింది. చంద్రం-సుమలత ఆమె కళ్ళబడ్డారు.అప్పుడు సుమలత చంద్రానికి ఆనుకుని కూర్చుని అతని కుడిచేతిలోని రేఖలను పరీక్షిస్తోంది.

వాళ్లకు తాను కనిపించకుండా ఆచప్టాకు పక్కగా పార్క్ చేసివున్న ఓ కారు వెనుక నక్కింది రేఖ. ఆమెకు మనసులో ఏవో చీమలు 'ప్రాకుతున్నట్లుగా' అక్కడక్కడ కుట్టున్నట్లుగా అనిపిస్తున్నది. అంతలో ఒక కుర్రవాడు భుజాలకు తగిలించుకున్న పెట్టెలో కూల్‌డ్రింక్స్ తీసుకురాగా సుమలత రెండు ఆరంజ్ సీసాలు తీసుకుని ఒక సీసా స్ట్రాతో చంద్రానికి అందించింది. చంద్రం అది కొద్దిగా చప్పరించి పక్కకు పెట్టగానే సుమలత అతని సీసా రెండవచేతితో తీసుకుని ఆ స్ట్రాతో నోట్లోపెట్టుకుంది.

గుండెలో పెద్ద గండుచీమ కుట్టినట్లయిన రేఖ చూపులు మరలించుకుని వెర్రిగా ఓ పిల్లవాడు ఊదుకుంటూ వెళ్తున్న రబ్బరు బూరవైపు చూస్తూ నిలబడింది. హఠాత్తుగా ఆ రబ్బరు బూర పెద్దచప్పుడుతో పేలి గాలిలో చిన్నిచిన్ని రబ్బరుముక్కలు ఎగిరిపోయాయి. చిన్న వనువు రబ్బరు ముక్క మటుకే చేతిలో మిగిలిన ఆ పిల్లవాడు ఆ ముక్కవైపు ఏదో పగిలిన బంగారుకలలోని ముక్కలా బాధగా చూస్తున్నాడు. అదేరకమైన భావన రేఖ మనస్సులోనూ కదలాడుతూంది అప్పుడు.

మళ్లీ రేఖ చూపులు వాళ్లమీదకి వెళ్లాయి. అతని స్లీవ్స్ మడతవిప్పి కఫ్‌లింక్స్ పెడ్తున్నది సుమలత. మరొక గండుచీమ కుట్టింది రేఖ మనస్సులో నెత్తురు కారేలా. వెర్రిగా వాళ్లవైపే చూస్తూ నిలబడిన ఆమెకు ఎంత సేపు తాను అక్కడ ఉందో, ఆతరువాత వాళ్లేం చేసారో తెలిసిరాలేదు.

పదకొండుంబావుకు రామలక్ష్మి, వేదవతీ అక్కడికి రావడం చంద్రంతో సుమలత గట్టుదిగి పార్కింగ్ ప్లేస్‌వైపు నడిచారు. వాళ్లతోపాటే వెళ్లాయి రేఖ చూపులు. తానూ, తెలియకుండా, నడవడంమొదలుపెట్టి వెళ్లి వాళ్ల కారుకు కొద్దిదూరంలో ఒక కారు పక్కగా నిలబడి అది వెళ్లిపోయేంతవరకూ ఉండిపోయింది. ఆ తరువాత ఎవరో పదకొండున్నరైంది అనడంవిని తుళ్లిపడి వడివడిగా నడిచి బస్ స్టాండ్ చేరుకుంది. అప్పటికే తామువచ్చిన స్పెషల్ బస్ వెళ్లిపోయి చాలాసేపైందని ఆమెకు తెలియవచ్చింది. మరొక బస్సు డ్రైవరు అన్నాడు... "రేఖంటే నువ్వేనా? పాపం ఎవరో ముసలావిడ మీ బస్సు డ్రైవరితో దెబ్బలాడి పదిపదిహేను నిముషాలు ఆపించింది నీకోసం. కాని లోపల పాసెంజర్ల ఒత్తిడి ఎక్కువై 'బతకనేర్చిన మనిషి-దాని సంగతి అదే చూసుకుంటుంది, నువ్వు పదవయ్యా' అనగా డ్రైవరు వెళ్లిపోయాడమ్మా" అన్నాడు.

★ ★ ★

కొత్తపేట లాడ్జింగ్‌లో ఉదయం తలుపులు బిడాయించుకుని, విస్కీ, రం, జిన్, బ్రాందీ, ఓడ్కా అన్నీకలిపి పెద్ద స్పెషల్‌డ్రింక్ తయారుచేసుకొని తక్కినవాళ్ళు తీర్థంనుండి తిరిగి వచ్చేంతవరకూ ఆ ద్రవసేవలోనే ఉన్నాడు

వివేకానంద్. ఎలాగో అతికష్టంమీద చంద్రం- సుమలతలతోపాటు భోజనం ముగించి తన గదిలో మంచంమీద ఒళ్ళువాలగానే గాఢనిద్ర లోనికి దిగజారాడు. ఆ పున్నమినాడు ఉప వాసం ఉండదలచుకున్న వేదవతీ, రామలక్ష్మీ పిల్లలు ఎంతచెప్పినా వినకుండా ఉత్తమజ్జిగ మటుకే తాగి చంద్రంగదిలో బాతాఖానీకొడ్తూ కూర్చున్నారు.

సుమలత తనగదికి వెళ్ళింది. చంద్రం ఏదో పుస్తకం చదువుకొంటూ లాంజ్‌లో కూర్చున్నాడు.

అతడు తన గదిలోనికి వస్తే బావుండును అనిపించి కొంతసేపు అటూ ఇటూ పొరలాడి చివరకు లేచివెళ్ళి చంద్రంతో బాతాఖానీ మొదలుపెట్టింది సుమలత.

నిజానికి ఈమధ్య పని ఒత్తిడి ఎక్కువ కావడంమటుకేకాకుండా మానసికంగా కూడా ఏదో సరిగా కారణం తెలియని ఒత్తిడిలో వున్న చంద్రం ఆరోజు భోజనం అయినతర్వాత స్లీ పింగ్ పిల్ వేసుకుని సాయంత్రంవరకూ నిద్ర పోదాం అనుకున్నాడు. కాని తల్లీ, వేదవతిగా రూ, తన గదిలో బాతాఖానీ పెట్టడంతో అది వీలుకాలేదు. పుస్తకం చదువుతున్నా అతని ధ్యానం దానిమీద లగ్నంకాక ఎక్కడో తిరుగు లాడుతూంది. సుమలతవచ్చి తనను బల వంతాన మాట్లాడించడం చాలా చిరాకుగా అనిపిస్తున్నదికాని పైకి అది తెలియనివ్వ కుండా ఏదో ముక్తసరిగా జవాబులు చెప్తున్నా డు.

ఎందుకో అతనికి తనవృత్తీ ఒకరకపు వ్యభి చారవృత్తిలాగే కనిపిస్తున్నది. బాగా డబ్బున్న మనుమలకోసం శాస్త్రరీత్యా అవసరంలేని పను లు చాలా చెయ్యవలసి వస్తున్నది. వాళ్ళ క్లినిక్ కస్టమర్స్‌లో ఎక్కువమంది ఊహాజనితమైన జబ్బులూ, లేక కావాలని కల్పించుకుని నటిస్తు న్న జబ్బులూ కలవాళ్ళే. ఏ ప్రాక్టీసూ చేయకపో యినా మరొక రెండు తరాలవరకూ జీవితం గడిచిపోగల సంపత్తి తండ్రి కూడబెట్టి ఉంచా డు.

తనకు క్లినిక్ కట్టిపెట్టి విదేశాలకు వెళ్ళి సైకియాట్రీలో పైచదువులు చదవాలని వుంది. కాని తండ్రి జబ్బుమనిషి- ఏ క్షణంలో ఏమి జరుగుతుందో. తాను ఒక్కడే సంతానం. తల్లి జీవితం తండ్రిచుట్టూ అల్లుకుని వుంది. ఆవిడ జీవితం తాడుతెగిన గాలిపటం అవు తుంది. అందువల్ల తాను ఫారెన్‌కు వెళ్ళే అవకాశాలు చాలా తక్కువ.

అదీగాక, రేఖ...

మొదటిసారి చూసినప్పుడే ఏదో గమ్మత్తుగా తన మనస్సును ఆకట్టుకుంది ఆమె. ఆమె అందం దానికి కారణం కాదు. అంత సంస్కారం వున్న మనిషి ఆ వృత్తిలోనికి ఎందుకు దిగవలసివచ్చిందో లోతుగా తెలుసు కుందామనే మొదట్లో తనను తాను నమ్మించు కోడానికి ప్రయత్నంచేశాడు. కాని చివరకు ఆమెదగ్గర గడుపుతున్న క్షణాలలో తక్కిన సమయాలలోకన్నా ఎక్కువతృప్తి కలుగుతున్న ట్లుగా అనిపించడం మొదలుపెట్టింది. ఆమె క్లినిక్‌వదలి పారిపోయిననాడు తనకు వెర్రెత్తిన ట్లుగా అనిపించింది. ఎన్నడూనడపనంత జోరుగా కారునడిపి సామర్లకోట చేరుకొన్నాడు ఆవేళ. ఆ రాత్రి గోదావరిగట్టున ఎంతో నిగ్రహం తెచ్చుకుంటేగాని ఆమెను ముద్దుపె ట్టుకోవాలనీ, కౌగిలించుకోవాలనీ ఉన్న కోరిక అదుపులోనికి రాలేదు. తల్లితో రేఖ గురించిన సంభాషణ అయిన తర్వాత ఆమెను దూ రంగా వుంచుతున్నాడుకాని జీవితంలో ఏదో జారవిడుచుకుంటున్నట్లుగా అనిపిస్తున్నది. నిజానికి ఈరోజు ఉదయం బయల్దేరేముందు మధ్యాహ్నం అందరూ విశ్రాంతి తీసుకుంటు న్నప్పుడు వెళ్ళి జాతరలో వెదికి రేఖను పట్టు కుందామనీ, ఇద్దరూకలిసి ఏ ఏకాంత ప్రదేశా నికో వెళ్ళి ఒకరినొకరు చూస్తూ కూర్చునివుంటే బావుంటుందనీ అనిపించింది.

అతడి పరధ్యానాన్ని మరోరకంగా ఊహించుకుంది సుమలత. తాము ఇద్దరూ తమ గదిలోకివెళ్ళి గడపాలని అతనికీ ఉంది- కాని తనలాగే అది బే- సబబు అని ఇక్కడ లాంజ్ లో కూర్చున్నాడు. ఒకవేళ అదే వీల యివుంటే ఏమి జరిగి ఉండేదో తనలాగే అతడూ ఊహించుకుంటూ ఉండి వుంటాడు. ఈ ఆలోచనలతో ఆమె కూడా అన్యమనస్కంగా అయి మధ్యమధ్యలో ఏదో అంటూ మళ్ళీ కొంతసేపు మౌనంగా ఉండిపోతూవుంది.




అలా ఎంతసేపు జరిగిందో ఇద్దరికీ తెలియదు. వేదవతీ, రామలక్ష్మిల బాతాఖానీ ఎప్పుడో ఆగిపోయి ఇద్దరూ ఎవరి పద్ధతిలో వాళ్ళు గుర్రుపెట్టి గదిలో రెండు మంచాలమీదా నిద్రపోతున్నారు.

హఠాత్తుగా చంద్రం గదిలో ఇంటర్‌కాం టెలిఫోన్ మోగింది. వాచీచూసుకున్నాడు అతడు. అయిదుగంటలు దాటింది.

"ఇప్పుడే వస్తానుండు- క్లినిక్‌నుండి ఏదో ట్రంక్‌కాల్ వచ్చి వుంటుంది" అని తన గదిలోపలికి వెళ్ళాడు.

రిసీవర్ పైకెత్తిన అతనికి "ట్రంక్ కాల్ సార్" అని ఎక్స్‌ఛేంజ్ మనిషి "పార్టీలైను మీద ఉన్నారు అనడమూ, ఆ తరువాత సుబ్బుగొంతు హడావుడిగా, గాభరాగా "రేఖమ్మగారు అందరితో తిరిగిరాలేదు చిన్నబాబుగారూ... జాతరలో ఎక్కడో తప్పిపోయారు" అనడమూ వినిపించింది.

గుండె హఠాత్తుగా ఆగిపోయి మళ్ళీ కొట్టుకోవడం మొదలుపెట్టింది చంద్రానికి.

కిందటిసారి క్లినిక్‌నుండి రేఖ తప్పించుకుని వెళ్ళిపోయినతర్వాత చంద్రం సుబ్బుకూ, సునందకూ మళ్ళీ ఈసారి ఆమె అటువంటిపని చేస్తే తానెక్కడున్నా తనకు వెంటనే తెలియచేయాలని చెప్పాడు. స్పెషల్‌బస్సు తిరిగిరాగానే రేఖ రాలేదని ముందుగా విన్న సుబ్బు పరుగెత్తుకునివచ్చి ట్రంక్ కాల్ బుక్‌చేశాడు అతనికి.

చంద్రం ఏమీ మాట్లాడకపోవడంతో సుబ్బు గాభరాగా- "హల్లో హల్లో హల్లో... సార్, సార్... లైను కట్టయిందా? మాట్లాడరేం?" అన్నాడు.

"లేదు... వినబడింది... సరే... ఫోన్ పెట్టెయ్యి" అని తానూ అదే పనిచేసి దానివైపే చూస్తూ ఉండిపోయాడు కొన్నిక్షణాలు చంద్రం.

చివరకు వెళ్ళి బట్టలు మార్చుకుని లాంజ్ లోకి వచ్చి సీలింగ్ ఫాన్‌వైపు చూస్తూ కూర్చున్న ఆమెతో "ఈ ఊళ్ళో ఇదివరకు నేను ట్రీట్ చేసిన ఒక కేసువాళ్ళు నేనిక్కడికి రావడం తెలిసి ఒకసారి వచ్చి చూసివెళ్ళమని ఫోన్ చేశారు. ఒక గంటా రెండు గంటల్లో వస్తాను... అమ్మావాళ్ళులేస్తే చెప్పు... కారు తీసుకువెళ్తాను. తాళాలిలా ఇయ్యి" అంటూనే బయలుదేరాడు చంద్రం.

ఆక్షణాలలో చంద్రానికి, అంతవరకు తాను అనుకున్నదంతా ఆత్మవంచనకోసం అనుకున్న మాటలనీ, నిజానికి ప్రపంచంలో అందరికన్నా తనకు ఎక్కువైనది రేఖ అనీ, ఆమెను చూడకుండా ఒక రోజుకూడా ఉండటం దుర్భరం అనీ అనిపించింది. తమాయించుకుని ఆమెను ఎలా మళ్ళీపట్టుకోవడం అని ఆలోచించాడు.

మొదట తానే వెళ్ళి ఆమె కోసం జాతరలో వెదుకుదాం అనుకున్నాడు కాని లక్షమందిపైగా జమకూడిన చోట అవని యాదృచ్ఛికంగా జరిగితేతప్ప, సఫలీకృతం కాదనిపించింది. హఠాత్తుగా ఆ ఊళ్ళో ఉన్న పోలీస్ ఇన్‌స్పెక్టర్ శ్రీపతి జ్ఞాపకం వచ్చాడు. మూడు నెలల క్రిందట వృద్ధాప్యంలో ఉన్న అతని తండ్రికి తమ క్లినిక్‌లోనే వైద్యం జరిగింది. అతడి సాయం తీసుకుంటే రేఖ జాడదొరకడం సాధ్యంకావచ్చు.

అతడు పోలీసు స్టేషన్ చేరేటప్పటికి శ్రీపతి అక్కడే వున్నాడు. డాక్టర్‌ను చూడగానే అతని మొహం విప్పారింది.

"థాంక్‌గాడ్" అని మనసులో అనుకున్న చంద్రం, శ్రీపతికి తన పేషంటు తప్పిపోవడం గురించి చెప్పి ఆమె పూర్తి వర్ణన వివరించాడు.

"కొద్దిగా ఇక్కడే కూర్చోండి సార్... మఫ్టీలో ఉన్న స్పెషల్ స్టాఫ్, సి.ఐ.డి. వాళ్ళూ చాలామంది వచ్చారీవాళ. అవతలిగదిలో కొంతమంది మధ్యాహ్నం డ్యూటీచేసి వచ్చినవాళ్ళు ఉన్నారు... కనుక్కుని వస్తాను. అలాటి అమ్మాయిని వాళ్ళెక్కడన్నా చూశారేమో!" అని చంద్రాన్ని అక్కడే కూర్చుండబెట్టి తాను వెళ్ళి ఒక పది నిముషాలలో తిరిగి వచ్చి అన్నాడు- "మీరు చెప్పిన వర్ణనకల అమ్మాయి స్పెషల్ బస్ స్టాండుకి ఒంటిగంట ప్రాంతంలో వచ్చిందట. తమ బస్సు వెళ్ళిపోయిందని విని జాతర వైపు వెళ్ళిందట. ఆ తరువాత జాడ తెలియదు. జాతరలో అటూ ఇటూ తిరుగుతూ ఉండి వుండవచ్చు. మా వైర్‌లెస్ వాన్లు చాలా తిరు




గుతున్నాయి ఈవాళ ఈ ఏరియా అంతా. అందరికీ మెసేజ్ పంపే ఏర్పాట్లు చేసివచ్చాను. ప్రతీచోటా డ్యూటీలో ఉన్న మా స్టాఫ్‌కి ఆ అమ్మాయి వర్ణన ఒక అరగంటలో అందుతుంది. కనిపిస్తే వెంటనే ఇక్కడికి తీసుకురమ్మని ఆర్డర్సు వెళ్తున్నాయి... మీరు వర్రీఅవకండి. సాధ్యమైనంత త్వరలో ఆమెను అప్పచెప్పగలమన్న ఆశ వుంది నాకు. ఇంతవరకు దేవుడి దయవల్ల ఏ ఆక్సిడెంట్లూ, స్టాంపేడ్ జరగలేదు. ఇంకో అరగంటకు బీచ్‌లో ఫోకసింగ్ లైట్లు వెలుగుతాయి. అదీగాక వెన్నెలరాత్రి. మీరు వెళ్లి రెస్టుతీసుకోండి... లేక కారులో జాతరవైపు వెళ్లిచూసి రండి మీరు కూడా, ఒక కానిస్టేబుల్‌ని మీకు తోడిస్తాను''.

ఒక పదినిముషాల్లో ఇంత భోగట్టా లక్ష మందిలో ఒక అమ్మాయి గురించి తమ డిపార్ట్‌మెంటువాళ్లనుండి సంగ్రహించడం శ్రీపతికి చాలా గర్వంగా అనిపిస్తున్నది. చంద్రానికి కూడా శ్రీపతి చేసినపని నిజంగా గర్వించతగినదే అనిపించింది.

అయితే రేఖ కావాలనికాక పొరపాటున బస్సు తప్పిపోయి తమ ఊరికి తిరిగి వెళ్లడానికి ప్రయత్నించింది అన్నమాట! తప్పించుకు మళ్లీ పారిపోయే ఉద్దేశం ఆమెకు లేదు. ఒకవేళ ఈవాళ దొరకకపోయినా రేపు ఉదయం బస్సులోనైనా ఆమె తిరిగి వస్తుంది అన్నధైర్యం కొంతవరకు వచ్చింది చంద్రానికి.

శ్రీపతికి థాంక్స్ చెప్పి తనకు సాయంగా పంపిన కానిస్టేబుల్‌తోపాటు జాతరకు కారులో వెళ్లాడు చంద్రం. ఒకవేళ తాను తిరిగివచ్చేలోగా రేఖగాని దొరికితే ఆమెను పోలీస్ స్టేషన్‌లో ఉంచమని చెప్పాడు, వెళ్లేముందు శ్రీపతికి.

కారు పార్కింగ్‌ప్లేస్‌లో పెట్టి కానిస్టేబుల్‌ను ఒక వైపుపంపి తానొకవైపు వెళ్లాడు రేఖను వెదకిపట్టుకోడానికి.

కొంతసేపు తిరిగిన తర్వాత డ్రెస్‌లో ఉన్న ఒక పోలీసు కానిస్టేబుల్ కనిపించగా అతన్ని రేఖ గురించి అడిగాడు అతడు. ఆమె గురించి ఆదేశాలు తనకింకా అందలేదనీ, అయితే అలాటి వర్ణనకల అమ్మాయి శివాలయంవైపు వెళ్లడం తాను చూశాననీ చెప్పాడు అతడు.

వడివడిగా శివాలయంవైపు వెళ్లాడు చంద్రం. అక్కడ డ్రెస్‌లో వున్న కానిస్టేబుల్ ఎవరూ కనిపించలేదు.




ఏడుగంటలు కావస్తున్నది. మరొకగంట అటూ ఇటూతిరిగి రేఖజాడ ఎక్కడా తెలియక చివరకు పోలీస్ స్టేషన్ చేరుకున్నాడు చంద్రం. అప్పటికింకా ఆమె అక్కడకు చేరుకోలేదని తెలిసింది. శ్రీపతి కూడా లేడు. అతనికి తిరిగి లాడ్జింగ్‌కి వెళ్లాలి అనిపించలేదు. వెళ్తే పండువెన్నెలలో బీచ్‌కు వెళ్దామని సుమలత బలవంతపెడుతుంది. ఆమెతోపాటు వివేకానంద్ కూడా వస్తాడు. ఈ పరిస్థితులలో వెన్నెల విహారానికి తగిన మూడ్‌లో లేడు తాను. అందువల్ల అక్కడే వరండాలో వేసిన కుర్చీలో కూర్చున్నాడు చంద్రం.

ఎందుకో వివేకానంద్ జ్ఞాపకం వచ్చాడు అతనికి- రేఖ గురించి ఆలోచించకుండా తక్కిన విషయాలగురించి ఆలోచించే ప్రయత్నంలో. ఏకోశానా వివేకంలేని ఆ మనిషికి ఆ పేరెందుకు పెట్టారో! అతని లివర్ పాడవడానికి ఎక్కువఏళ్లు పట్టదు- అంతే మితిమీరిన తాగుడులో! ఏకాంతంగా పిలిచి అతనితో మాట్లాడి అతన్ని మార్చాలి అని నిశ్చయించుకున్నాడు మనసులో.

సుమలత!

ఒకే తల్లీ తండ్రికి పుట్టినా ఇద్దరిలో ఎంత తేడా? హఠాత్తుగా గుండెకలుక్కుమన్నట్టుగా అయింది అతనికి.

తనంటే ఎంత ప్రేమ ఆమెకు!

ఒకవేళ తాను రేఖను గాఢంగా ప్రేమిస్తున్నానని ఆమెకు తెలిస్తే?

మళ్లీ రేఖ గురించి ఆలోచిస్తున్నాడు తాను...బలవంతాన ఆలోచన తెంపుకుని తన చిన్ననాటి స్నేహితుల గురించి ఆలోచించడం మొదలుపెట్టాడు.

అలా ఎంతసేపు గడిచిందో తెలియదు. పోలీస్‌స్టేషన్ ఆవరణలో పదిగంటలు కొట్టినప్పుడు అతనికి స్పృహవచ్చింది.

అంతవరకు తాను తిరిగి రాకపోవడంతో అమ్మ గాభరాపడుతుండవచ్చని అనిపించిన అతడు అక్కడి డ్యూటీ ఆఫీసర్‌ను పిలిచి తన పేషెంట్ గురించి జాడ తెలిస్తే వెంటనే ఫోన్ చేయమని చెప్పి కారులో లాడ్జింగ్‌కు తిరిగి వచ్చాడు.

అప్పటికి ఇంకా లాంజ్ లోనే కూర్చుని ఉంది సుమలత. ఇంకెవళ్లూ లేరక్కడ. జాతరలో తిరిగి అలిసిపోయి ఎవరి గదులకు వాళ్లు వెళ్లిపోయారు.

అతనిని చూడగానే విప్పారిన మొహంతో లేచి నిలబడిన సుమలత "వచ్చావా చెందర్? గంటా రెండు గంటలలో వస్తానన్నవాడివి, ఇంతాలస్యం చేశావే? బీచ్‌కు నీతో వెళ్లామని ఆరునుండి రెడీఅయి కూర్చున్నాను" అంది

అతనికి చిరాకుగా అనిపించిందిగాని అది కప్పుకుని "ఇంకా భోజనం చేయలేదా సుమా మీరు?" అన్నాడు- ఆమె అడిగిన ప్రశ్నకు జవాబు చెప్పకుండా.

"అమ్మా, అత్తయ్యగారు ఫలహారం ముగించి తొమ్మిదికే పడుకున్నారు. అన్నయ్య గదిలోంచే రాలేదు! అక్కడికే అన్నీ తెప్పించుకున్నాడు"

తన సంగతి చెప్పకుండా తక్కిన ముగ్గురి సంగతి ఆమె చెప్పడం విన్న అతనికి ఎందుకో జాలిగా అనిపించింది. "అందరి సంగతీ చెప్తున్నావు నువ్వు భోంచేశావా లేదా?" అని మృదువుగా అడిగాడు.



ఒక పేషెంటును చూడటానికి వెళ్ళి, తాము వెన్నెలలో బీచ్‌లో తిరుగుదామని అనుకున్న సంగతే స్పృహలో లేకుండా అంతరాత్రివరకూ అతడు తిరిగి రానందుకు చాలా చిరాకుగా వుంది సుమలతకు.

రేఖా-చంద్రంల గురించి ఆమెకూడా ఈమధ్య యాదృచ్ఛికంగా విన్నది. చంద్రానికీ, తనకూ పెళ్ళిజరిగే ప్రయత్నాలు అవుతున్నాయని తెలియని ఒక అమ్మాయి— తనకు కొద్దిగా పరిచయస్థురాలు— ఒకరోజు "డాక్టరు చంద్రబాబు ఎవరో వీధుల్లో ఒళ్లమ్ముకొనే అమ్మాయిని తెచ్చి క్లినిక్‌లోపెట్టి చాలా ఇంటరెస్ట్ తీసుకుని ట్రీట్‌చేస్తున్నారట! ఒకరోజు అర్ధరాత్రి దాటాక ఇద్దరూ కారులో తిరిగిరావడం చూశారటకూడా చాలామంది. ఏమిటో ఊళ్ళో నానారకాలుగా అనుకుంటున్నారు. గొప్పగొప్పవాళ్లంతా ఇంతేకాబోలు" అంది. తన గుండె కలుక్కుమంది ఆరోజు.

ఆ తరువాత తాను నర్స్ రంజనను రహస్యంగా ఈ విషయం గురించి అడిగింది. అమ్మగారు చెప్పడంవలన చిన్నబాబుగారు రాత్రిళ్ళు రేఖ గదివైపు రాకుండా చూస్తున్న ఆమె గడుసుదనంగా జవాబుచెప్పింది "ఆ అమ్మాయి కొద్దిగా మతిస్థిరంలేని మనిషి. ఒకరోజు తప్పించుకు పారిపోతే చిన్నడాక్టరుబాబు వెళ్ళి వెతికి అర్ధరాత్రి తీసుకువచ్చారు వెనక్కు. ఆయనకు ఇలాంటి సైకలాజికల్ కేసులంటే ఇంటరెస్ట్. అంతేకాని మరేమీ లేదండీ" అంది.

ఆ మాటలతో కొంత గుండెనిబ్బరం తెచ్చుకుంది సుమలత. ఆ తరువాత నవ్వుతూ అంది రంజన— "చూడండి... డాక్టర్లను పెళ్ళాడబోతున్నవాళ్ళు ఇలాంటివాటిని పట్టించుకోకూడదండీ! వాళ్ల వృత్తిలో రకరకాలైన పరిస్థితులని ఎదుర్కోవలసివస్తుంది. ఏ అపరాత్రి ఎక్కడికి వెళ్లవలసివస్తుందో వాళ్లకే తెలియదు. అసలు నిజానికి మీరంటే ఎంతో అభిమానం చిన్నబాబుగారికి. మీరు కనిపించేటప్పటికల్లా ఎంత చికాకుల్లోవున్నా ఆయన మొహం విప్పార్చుకోవటం గమనించాను"

ఆ మాటలతో అన్నీ మరిచిపోయింది సుమలత. కాని ఈరోజుమటుకు ఎందుకో ఆ బోగంపిల్ల గురించిన విషయం మాటిమాటికీ స్ఫురణకు రావడం మొదలుపెట్టింది ఎనిమిది దాటినప్పటినుండీ. 'ఆమె కూడా వచ్చిందా జాతరకి? ఎక్కడో ఇద్దరూ రహస్యంగా కలుసుకుంటున్నారా ఈ క్షణాల్లో?' అన్న ప్రశ్నలు సూదులుగా మనస్సులో గుచ్చుకుంటున్నాయి.

అతడు తిరిగివచ్చి తన భోజనం గురించి ఎంతో ప్రేమగా అడగడంతో ఆమెకు తనను వేధించుకుతింటున్న ప్రశ్నలన్నీ అడుగుకి వెళ్ళిపోయి ఎంతో నిండుగా అనిపించడం మొదలుపెట్టింది. అతడు లాంజ్‌లో అడుగుపెట్టినప్పుడే అప్రయత్నంగా ఆమె మొహం విప్పారింది.

చంద్రం కళ్లలోనికి రెప్పవేయకుండా చూస్తూ అంది ఆమె! "ఊహూఁ... ఇంకాలేదు! ఎందుకో ఈ పున్నమిరాత్రి మీతో కలిసి భోంచెయ్యాలనిపించి వుండిపోయాను"

ఆమెవైపు కొద్దిగా బాధగా చూశాడు అతడు. తనకోసం జుట్టు మళ్ళీ బాగా పెంచుకుంటూంది ఈమె! లిప్‌స్టిక్ రాసుకోవడం మానేసింది. మాక్సీలూ, మినీలూ లోకట్‌బ్లౌజులూ అన్నీ మూలబడి మోచేతులవరకూ వుండే జాకెట్లూ, చీరలూ వాడుకలోకి వచ్చాయి. చక్కగా తలనిండా పూలు తురుముకుంటున్నది ప్రతిరోజూ. ఇదివరకు ఎప్పుడోమటుకే పెట్టుకునే నుదుటి బొట్టు ఇప్పుడు నిత్యాలంకరణలో ఒక భాగమైంది. బ్యూటీస్పాట్ ప్రత్యక్షం కావటంలేదిప్పుడు. తనకోసం ఎంతగా మారుతున్నది ఈమె! రేఖను గురించి వెర్రిగా ఆలోచిస్తూ తాను బాధపడ్తున్నాడేమో!

ఒక్కసారిగా ఎంతో జాలిగా, అభిమానంగా అనిపించిన అతడు ఆమె చెంపలు నిమిరి మృదువుగా అన్నాడు.

"వెర్రి సుమా! నాకోసం కాచుకున్నావా ఇంతవరకూ? ఐయాం రియల్లీ సారీ! మెడిసిన్‌లో మా క్లాస్‌మేట్ డాక్టర్ రమేశం ఇక్కడికి ట్రాన్స్‌ఫర్అయి వచ్చాడీమధ్యనే! అతడు కనిపించి వాళ్ళింటికి లాక్కెళ్ళి టిఫినూ అదీపెట్టి బాతాఖానీతో వదలలేదు. కబుర్ల పోగు! రియ




ల్లీ... సారీ సుమా..."

డాక్టరు రమేశం కబుర్లపోగూ, ఆ ఊరికి కొత్తగా రావడమూ... అన్నీ నిజమే. ఆ నిజానికి కొంత అబద్ధం కలిపి తాను సుమలతకు కలిగించిన బాధ తగ్గించడానికి ప్రయత్నంచేశాడు చంద్రం.

ఆ లాలనతో అనురాగం గుండెలనిండా నిండిపోయిన ఆమె అతనికి మరింత దగ్గరగా జరిగింది. ఏ అలంకరణా లేకుండానే పూర్తిగా విచ్చుకున్న పెద్ద గులాబీమీద వక్కనున్న జినియా మొక్కనుండి రెండు లేత ఎరుపురంగు రేకులు వచ్చి పక్కపక్కల పడినట్లుగా కనిపిస్తూ తెరుచుకున్న పెదవులతో ఎంతో ఆకర్షణీయంగా వుందామె. మిలమిలలాడే కళ్లతో, జీరగొంతుతో అంది— "మరి నీకోసం కాకపోతే ఇంకెవరికోసం కాచుకుంటాను చెందర్?"

అప్రయత్నంగా చంద్రం చేతులు ఆమె రెండు భుజాలమీదావడ్డాయి.

అంతకు ఒక నిముషం ముందే తన గది తలుపులు ఓరగా తెరుచుకుని ఆ లాంజ్‌లో జరుగుతున్నది గమనిస్తున్నాడు వివేకానంద్. — సుమలత, చంద్రం హద్దుమీరకుండా చూడ్డమని తనతండ్రి చేసిన హెచ్చరిక జ్ఞావకంవచ్చింది. వాళ్లకు అడ్డువెళ్తున్నానన్న సంగతి స్పృహలో లేకుండా నవ్వుతూ పైకివచ్చాడు.

ఇద్దరూ తుళ్లిపడి అతనివైపు చూశారు... సుమలత పట్టరాని కోపంతో పళ్లూ పెదవులూ బిగించి అన్న వైపు చూసింది.

ఒక్క పది సెకండ్లు అతడు లాంజ్ లోకి రాకపోయి వుంటే తన మొహం మీదికి వంగి పెదవులమీద-ఒకనాడు తాను అతనిని అడిగిన-ముద్దుపెట్టి వుండును చంద్రం. తప్పతాగి ఒళ్లు తెలియకుండా ఉన్న ఈ ఛండాలుడు సరిగ్గా సమయానికి పానకంలో పుడకలా అడ్డు వచ్చాడు.

ఒక అడుగువేసింది ఆమె-లాగి లెంపకాయ కొట్టాలన్న ఉద్రేకంతో-కాని అంతలో ఆగిపోయి బలవంతాన నిగ్రహం తెచ్చుకుని, వెర్రిగా చూస్తూ వుండిపోయింది.

ఆ టెన్షన్ తగ్గించడానికి చంద్రం నవ్వు తెచ్చుకుని ఏదో అన్నాడు.

★ ★ ★

శ్రీయాలాడ్జీ కొత్తపట్టణంలో ఊరికి ఈ చివర్న వుంటే మూడుమైళ్ల దూరంలో ఊరికి అవతలి చివర్న ఒక రెండంతస్థుల లాడ్జింగ్ వుంది. పైన వున్న ఆరు గదుల రెండవ అంతస్థు నుండి పైకి వెళ్తే అక్కడ చెక్కలతో సీటుగా కట్టిన ఒక పెద్ద గది వుంది. ఆ లాడ్జింగ్ పేరు "శ్రీ బజరంగ బలీ" రోజుకింత, రాత్రికింత అనికాకుండా గంటకింతా అన్న రహస్యపు రేట్లమీద గదులు అద్దెకు ఇస్తారు అక్కడ. బోర్డుమీద రాయకపోయినా "సమయానుకూలంగా రేట్లు హెచ్చింపబడును" కూడా! ఇరవైనాలుగు గంటలకు లెక్కలుకడితే "స్టార్" హెూటళ్లకన్నా ఆ గదుల రేట్లు ఎక్కువే! ఆ హెూటల్ ప్రొప్రయిటర్ రాధేశ్యాం ఉత్తరప్రదేశ్ వ్యక్తి.

మూడవ అంతస్థు కర్రకాబిన్‌కి వెళ్లడానికి మామూలు మెట్లేకాక రహస్యంగా వెనుక వక్క నుండి చేరుకోడానికి వీలుగా పైకి కనిపించని మెట్లు వేరేగా వున్నాయి. లోపల స్టార్ హెూటళ్ల గదులకన్నా శుభ్రంగా అలంకరించి వుంటుంది ఆ కాబిన్- డబుల్‌కాట్, డ్రెస్సింగ్ టేబుల్, అటాచ్డ్ బాత్‌రూం, ఇంటర్‌కాం, మొదలైన అన్ని సదుపాయాలూ ఉన్న ఆ కాబిన్ ఎవ్వరికీ "అద్దెకివ్వబడదు". అది మరీ ఎక్కువ ముఖ్యమైన అతిథులకోసం మటుకే. ప్రభుత్వాధికారంలో ఉన్న వాళ్లూ, వాళ్ల వాళ్ల కోసం మాత్రమే అది కేటాయించబడింది. పోలీసు అధికార్లు "మైము" అని సంకేతనామంపెట్టారు దానికి-అలాగే వ్యవహరిస్తారు సంభాషణలో.

బీచ్ రిసార్ట్ అయిన ఆ ఊరికి మాటిమాటికీ ఆఫీసు పనుల మీద వచ్చే పెద్దపెద్ద అధికార్లు, ప్రజాప్రతినిధులు ఎవరో ఒకరు ప్రత్యేకంగా తమకోసం ఏర్పాటుచేయబడిన వాహనాల్లో వెనుకవక్క చీకటిలో దిగగానే ఆ వాహనాలు ఇంజను కూడా ఆగకుండానే అలాగే తుర్రున వెళ్లిపోతాయి-మళ్లీ అనుకున్న వేళకు వచ్చి వారిని తీసుకుని వెళ్లిపోతాయి.

ఎవరు వస్తున్నారో, ఎవరు వెళ్తున్నారో ఆ లాడ్జింగ్‌లో పనిచేసే మనుషులకు కూడా తెలి

యుదు. వారికి స్వాగతం చెప్పి లోపలకు తీసుకువెళ్లి మళ్లీ వీడ్కోలు చెప్పే పని ప్రొప్రయిటర్ రాధేశ్యాందే. ఆ లోపల పోలీసు అధికార్లు ముందే ఇచ్చిన ఆదేశాల ప్రకారం కావలసిన పదార్థాలన్నీ ఆడవాళ్లతోసహా . . . . .
సిద్ధంగా వుంటాయి. కొన్నికొన్ని పదార్థాలు వారితో పాటే వస్తాయి. మధ్యలో అదనంగా ఏమన్నా కావలిసివస్తే అక్కడ ఒక స్విచ్ నొక్కితే స్వయంగా రాధేశ్యామే వచ్చి అవసరాలు కనుక్కొని సప్లై చేస్తాడు. ఒక్కొక్కసారి అతనికి ఈ కార్యకలాపాల్లో అతని పెద్ద భార్యగా వ్యవహరించబడే నలభైఏళ్ల "రింజీ" అనే అందమైన యువతి సాయపడ్తూ వుంటుంది. ఆ ఊళ్లోని స్త్రీశాల్తీలు పనికిరారని ఎవరైనా అంటే ఆమెగాని, ఆమె చెల్లెలుగా, అతని చిన్నభార్యగా వ్యవహరింపబడే "శింజీ"గాని అందమైన ఆ శాల్తీలకు బదిలీలుగా ఉపయోగపడ్తారు. రింజీ, శింజీలు ఘోషా మహిళలుగా చెలామణీ అవుతూండటం వలన అక్కడ పనిచేసేవారికి వాళ్ల మొహాలు ఎలా వుంటాయో తెలియదు.

ప్రస్తుతం ఆ కాబిన్‌లో మంచంమీద మోకాళ్లపైన గడ్డం ఆనించుకుని, చేతులు మోకాళ్లకు పెనవేసుకుని ఎదురుగా గోడపైన వున్న పెద్ద నగ్నసుందరి లేత నీలిరంగు తైలవర్ణం చిత్రం వైపు చూపులు నిలిపి కూర్చుని వుంది రేఖ. కాని నిజానికి ఆమె మనస్సు సెక్సీ బొమ్మమీద లేదు- ఏ ఆలోచనలూ పైకిరాకుండా అణగతొక్కుకునే ప్రయత్నంలో సతమతమవుతూంది.

చేతులు కట్టుకుని ఆగదిలో అటూఇటూ పచార్లు చేస్తున్నాడు డాక్టరు చంద్రబాబు.

అప్పుడు రాత్రి రెండు గంటలు దాటింది.

బీచ్‌లోని ఫోకసింగ్ లైట్లకు దూరంగా ఒక చోట సముద్రం లోతులలో దిగి ఆత్మహత్యా ప్రయత్నం చేయబోతున్న రేఖను పట్టుకున్నారు. పోలీసు అధికార్లు రాత్రి పన్నెండు గంటలకు ఠాణాకు తీసుకువచ్చారు. వెంటనే ఫోన్ ద్వారా కబురు అందిన చంద్రం అక్కడికివెళ్లి శ్రీపతితో మాట్లాడి ఆ రాత్రికి తన పేషెంటును ఉంచడానికి ఎక్కడన్నా హొటలు గది ఏర్పాటుచేయమని కోరాడు. ఆరోజు అన్నిచోట్లా రద్దీగానే వుంది. ప్రభుత్వంలో ఎంత నిజాయితీపరులైనా అధికార్లు కొన్నికొన్ని విషయాల్లో తప్పనిసరిగా ప్రవర్తించవలసి వుంటుంది. బజరంగ్ లాడ్జి రాత్రి పదకొండున్నరకు ఖాళీ అయిపోవడంవలన వెంటనే డైరెక్టరీలో కనిపించని ప్రత్యేకపు ఫోను నంబర్‌లో రాధేశ్యాంతో మాట్లాడి ఆ కాబిన్ చంద్రంకోసం ఏర్పాటుచేశాడు. తన తండ్రిని మృత్యుముఖం నుండి తప్పించిన డాక్టర్ చంద్రబాబు- అందులోనూ ఏ అవినీతి చర్యకూ ఏనాడూ దిగబోరని పేరున్న మనిషి కోసం ఈరోజు ఒక సత్కార్యం చేసిన శ్రీపతికి ఒకరకమైన సంతృప్తికలిగింది.

అక్కడికి ఒంటిగంటకు చేరుకున్నారు వాళ్లు. తన కారు వెనుకపక్క సందులో ఆ హొటలుకు కొద్దిదూరంలో పార్క్ చేశాడు చంద్రం. శ్రీపతి స్వయంగా మోటారు సైకిలు మీద వచ్చి వాళ్లను ఆ లోపలికి పంపి తాను వెళ్లిపోయాడు.

ఉన్నట్లుండి పచార్లుఆపి అక్కడ టేబుల్ మీది ఫ్లవర్‌వాజ్‌కిందపెట్టిన ఉత్తరం, పెదవులు బిగించి చదివాడు చంద్రం. శ్రీపతి దానిని ఇచ్చినప్పటినుండి పదవసారి చదవడం!

అందులో ఉన్నది రెండే రెండు వాక్యాలు.

"బతుకంటే విరక్తిపుట్టి ఆత్మహత్య చేసుకుంటున్నాను. నా చావుకు ఎవరూ బాధ్యులుకారు- రేఖ"

రెండవవైపు కేరాఫ్ అని శ్రీనివాస శుశ్రుత నిలయం అడ్రెస్ వుంది. ఒక్కనిముషం ఆలస్యం అయివుంటే ఆమె శరీరాన్ని సముద్రం తన పొట్టనుపెట్టుకుని వుండును. సరిగ్గా ఆ సమయానికి పోలీస్ పెట్రోల్ జీప్ ఫోకసింగ్ లైట్‌లో చిక్కుకున్న రేఖను పోలీసు అధికార్లు ఉద్ధరించి వెంటనే పోలీస్ ఠాణాకు వైర్‌లెస్ మెసేజ్ అందజేసి తడిబట్టలతో అలాగే ఆమెను అక్కడికి చేర్చారు.

చంద్రం అక్కడికి వచ్చేవరకు అలాగే తడిబట్టలతో వరండాలో గోడకు చేరబడి గజగజ వణుకుతూ కూర్చుంది ఆమె. అక్కడి డ్యూటీ ఆఫీసర్ ఇచ్చిన ఒక కప్పు టీ మటుకు తాగింది.




ఆపక్కనవున్న ఒక కుర్చీలాగి "కూచో" అన్నాడు చంద్రం. మాట్లాడకుండా కూర్చుంది రేఖ. అప్పటినుండి అతడు ఏది చెయ్యమంటే ఆ పని ఒక మరబొమ్మలా చేసింది ఆమె.

పదవసారి ఆ ఉత్తరం చదవడం పూర్తిచేసి అతడు మళ్లీ యథాస్థానంలోవుంచి చివాలున ఆమెవైపు తిరిగి బాధనిండిన గొంతుతో అన్నాడు "నాలుగున్నరకు లైను బస్సులో క్లినిక్కు తిరిగివెళ్లడానికి సిద్ధపడినదానివి, ఆ తర్వాత ఈ ఆత్మహత్య చేసుకోవాలన్న దరిద్రపు ఆలోచన అసలు ఎందుకు వచ్చింది?"

రేఖ నెమ్మదిగా మెడతిప్పి కనురెప్పలు తెరుస్తూమూస్తూ వుండిపోయింది. ఆ కళ్లల్లో ఏ చైతన్యమూలేదు.

ఈవిధంగా జరగడం ఇది నాలుగవసారి.

ఈసారి చిరుకోపంతో చివాలున మంచం దగ్గరకువచ్చి గట్టిగా అన్నాడు చంద్రం "నిన్నే అడుగుతున్నది... ఇది నాల్గవసారి"

ఆమె ఇంకా మౌనంగానే ఉండిపోవడంతో ఒక్కఉదుటున చేయిజాపి ఆమె చిరుగడ్డంపట్టుకుని తలబాగా పైకిఎత్తి గద్దిస్తూ అడిగాడు అతడు "ఏం రేఖా... నేనంటున్నది వినబడటంలేదా?"

'వినపడింది' అన్నట్లుగా నెమ్మదిగా తల కొద్దిగా కదిలించింది ఆమె. 'మరి జవాబు చెప్పవేం? శివాలయానికి వెళ్లేతోవలో ఎవరన్నా నిన్ను..."

"లేదు" అన్నట్లుగా తల కొద్దిగా ఆడించింది ఆమె.

ఆమె గడ్డం వదిలి మంచంమీద ఒకపక్కగా ఆనుకుని కూర్చుని చిరాకుగా అన్నాడు చంద్రం, "పన్నెండుకల్లా బస్సు బయల్దేర్తుంది అన్న సంగతి నీకు తెలునును. తక్కినవాళ్ల నుండి విడిపోయినా దారితప్పడంఅంటూ వుండదే, అన్నీ తెలిసిన నీలాటి దానికి!"

అతని ఆఖరు మాటకు ప్రతి చలనంగా ఒక చిన్న చిరునవ్వు ఆమె పెదవులమీద కదలాడి అంతలో మెరుపులా మాయమైంది. ఏమీ మాట్లాడలేదు ఆమె. చంద్రం లేచివెళ్లి ట్రే లోంచి ఉత్తరంతీసి 'బతుకంటే విరక్తిపుట్టి ఆత్మహత్య చేసుకుంటున్నాను' అన్నది పైకి గట్టిగా చదివి ఆ కాగితం బల్లమీద విసురుగా వడేసి ఆమెవైపు చూసి అడిగాడు లాలనగా.

"చెప్పు రేఖా! ఎందుకిలా బతుకంటే విరక్తి? బతుకంటే ఆశతో రోజూ మూడుమైళ్లు నడిచి ఆస్పత్రికి వెళ్లేదానివి, నా దగ్గర ఏ కష్టంకలిగిందని నీకిలా విరక్తిపుట్టింది ఈనాడు?"

అతని కళ్లు చెమరించి లైటు వెలుగుపడి తళతళ మెరిశాయి.

ఆ ప్రశ్నతో హఠాత్తుగా ఆమె కళ్లలో చైతన్యం కలిగి అవి చెమరించాయి. మనస్సు పనిచేయడం మొదలుపెట్టింది. మోకాళ్లమీది నుండి చేతులుతీసి వెనుకవైపుకు చాపి వరుపుమీదపెట్టి కొద్దిగా వెనుకకువంగి అంది ఆమె- "మీ దగ్గర క్లినిక్లో పొందిన హాయీ, ఆనందమూ నా బతుకులో పదేళ్లుపైగా ఏనాడూ పొందలేదు నేను... నిజం! అలా ఏదో అనుకుని బాధపడకండి!"

"మరి?"

ఎడమచేతిలో ముఖమల్ గలీబు దిళ్లు రెండు లాగి ఒకదానిమీద ఒకటిపెట్టి వెనుకకు చేరబడి చేతులు పెనవేసుకుని తల ఆమధ్య వుంచి, మోకాళ్లు పైకెత్తి పడుకుని, సీలింగ్ ఫాన్వైపుచూస్తూ కదలకుండా కొంతసేపు వుండిపోయింది. "మీరు నన్ను చాలా ప్రశ్నలు అడిగారు...మిమ్మల్ని ఒక్క ప్రశ్న అడగాలని వుంది. — ఆ అడిగే హక్కు నాకు లేదుకానీ... ఏమీ అనుకోకుండా సూటిగా జవాబిస్తారుకదూ?"

అతడు ఒక పేము కుర్చీ మంచానికి దగ్గరగా లాగుకుని కూర్చుని అన్నాడు: "నా దగ్గర హక్కుల ప్రశ్నదేనికి? మనస్సులో ఏమున్నాపైకి చెప్పు. ఇష్టంవచ్చినన్ని ప్రశ్నలు అడుగు... ఏమీ అనుకోను... సూటిగానే జవాబిస్తాను"

"నా జబ్బు చాలావరకు కుదిర్చారు మీరు. పూర్తిగా కుదిర్చి నన్ను మామూలు మనిషిగా చేస్తే మీ వృత్తి దృష్ట్యా ఏదో సాధించానన్న తృప్తి మీకుంటుందని అన్నారు ఒకటి రెండు సార్లు. అలా పూర్తిగా నయమైపోయిన తర్వాత నన్నేం చెయ్యదల్చుకున్నారు?"

ఆ ప్రశ్నకు చాలా గాభరాపడ్డాడు చంద్రం. అప్పుడప్పుడు ఏదో అనుకోవడం, ఒక నిశ్చయానికి వచ్చినట్లయి మళ్లీ అంతలో ఏవో ప్రశ్నలు తనకుతనే వేసుకుని ఆ నిర్ణయం సరికాదనుకోవడంతప్ప నిజానికి ఆమె భవిష్యత్తును గురించి ఏ నిశ్చితాభిప్రాయానికీ రాలేదు ఇంతవరకు - ఏమి జవాబు చెప్పాలోతోచక, ఈసారి తనవంతుగా మౌనంగా ఉండిపోయాడు.

ఆమె జాలిగా నవ్వి అంది- "చూశారా? నేనడిగిన ఒక చిన్న ప్రశ్నకు జవాబు చెప్పడానికి తోచక మీరే - ఇంత చదువుకున్నవాళ్లే - మాట్లాడకుండా ఊరకుండిపోయారు! మరి మీరడుగుతున్న చిక్కు ప్రశ్నలకు నాలాటిది ఏమని జవాబు చెప్పగలదు? జవాబు ఉన్నా దానిని సరిగా ఒక వరసలో మాటలలో ఎలాపెట్టగలదు?"

అతడు ఆమెవైపేచూస్తూ ఉండిపోయాడు...ఈ క్షణాలలో ఏదో నిర్ణయానికి వచ్చి అదే తన తుది నిర్ణయంగా ఆమెకు చెప్పాలని దాన్నిగురించి ఆలోచిస్తున్నాడు.

ఆమె కూడా కొంతసేపు మౌనంగా వుండిపోయి చివరకు అంది: "పోనీ—మీకున్న అవకాశాలు నా గురించి ఒకటొకటే నేనే చెప్తాను... అందులో ఏది మీకు సబబైనది అని తోస్తే అప్పుడు "ఊ" అనండి...ఏం?"

కొద్దిక్షణాలు ఊరుకుని నెమ్మదిగా "చెప్పు..." అన్నాడు - నిర్ణయానికి రావడానికి అది సాయపడవచ్చు అనుకుని.

"మొదటిది—మళ్లీ నా మూటాసంచీతో స్టేషన్‌కు వెళ్లి ఇన్నేళ్లుగా అలవాటయిపోయిన నా మామూలు వృత్తిలో బతుకు..."

హఠాత్తుగాలేచి ఆమె మొహం తనవైపుకు తిప్పుకుని ఆ కళ్లలోనికి చూస్తూ అన్నాడు: "ఉహూఁ...పనికిరాదు...మళ్లీఇటువంటి జబ్బులే వస్తాయి నీకు"

ఆమె జాలిగానవ్వి అంది: "సరే... దాని సంగతి వదిలెయ్యండి - రెండవది..." అని ఆగిపోయి "వెళ్లి కుర్చీలో కూర్చోండి... చెప్తాను"

అతడు వెళ్లి కుర్చీలో కూర్చున్నాడు.

ఆమె ఈసారి అతనివైపే చూస్తూ అంది: "రెండవది - నేను ఎనిమిదవక్లాసు పాసయినదాన్ని. తెలివితేటలు ఒకరకంగా ఉన్నదాన్ని అతిసులభంగా ప్రైవేటుగా మెట్రిక్ పరీక్షకు కట్టి పాసవవచ్చు. వెనక మీదన్నూ ఉంటుంది ప్రతిదానికీ"

అతడు కొద్దిగా ఆగి గడ్డిపోచ మునిగిపోతున్నప్పుడు దొరికిన మనిషిలా అన్నాడు, "అవును - ప్రస్తుతానికి ఆ పని నువ్వు చెయ్యవచ్చు"

ఆమె పెదవులమీద చిరునవ్వు చిందులాడింది. "రెండేళ్లలో ఆ పరీక్ష పాసవుతాను. ఆ తర్వాత?"

"కాలేజిలో చేరి పైచదువులు చదువవచ్చు"

"మరొక అయిదేళ్లు - డిగ్రీ సంపాదిస్తాను. ఆ తరువాత మరొక రెండేళ్లు పోస్ట్ గ్రాడ్యుయేట్ అవుతాను. ఆ తరువాత మరొక మూడు నాలుగేళ్లు డాక్టరేట్ పట్టా పొందుతాను... అప్పటికి నా వయస్సు ఎంతవుతుంది?"

ఆమె అనుకుంటున్న విషయమే అతని మనస్సులోనూ మెదలుతూ ఉండటంతో వరుసగా లెక్కకడ్తున్న అతడు వెంటనే అన్నాడు: "నలభై—"

"మీరూ అంచనా వేస్తున్నారన్నమాట. ఇప్పుడు నాకు ఇరవై ఎనిమిది నిండబోతున్నది — చాలామంది ఆడపిల్లలకు మన తెలుగుదేశంలో ఈపాటికి పెళ్లికూడా అయి వుండకపోవచ్చు. — కానినా టీన్స్ దాటకుండానే రెండేళ్లముందునుండి సెక్సు జీవితం ప్రారంభమైంది - అంటే యౌవనంలో సుమారు పదకొండేళ్లు గడిపాను నేను! నలభై ఏళ్లు. మధ్యదశ మొదలవుతుంది... అంటే నా చదువు పూర్తిఅయ్యేటప్పటికి యౌవనం చెల్లి వృద్ధాప్యదశకు చేరుకోబోతుంటాను... అంతేకదూ?"

"అవును" అన్నట్లుతలూపాడు అతడు.

ఎందుకో కొద్దిగా కిలకిలనవ్వి ఆగిపోయింది ఆమె.

"ఆగిపోయావేం?"

"ఆఁ... ఆలోచిస్తున్నాను- ఆ తరువాత?"

"ఎక్కడో ఉద్యోగం చేసుకొని..."



హఠాత్తుగా లేచి కూర్చుని అతనివైపు తిన్నగాచూసి అంది ఆమె—

"అమ్మను వదిలేసి లేచిపోయినప్పటి నుండి ఒంటరిగానే బతుకుతున్నాను. చివరివరకూ అలాగే ఒంటరితనంతో జీవితం గడపాలంటూ నేను?"

కొద్దిగా ఆగి కుర్చీలో నుండి లేచి అటూఇటూ పచార్లుచేస్తూ చివరకు అన్నాడు—

"ఒంటరిగా వుండనక్కరలేదే? చదువుకుంటున్నరోజులలోనే నీకు నచ్చినవాడు దొరికితే... ... ...?"

ఈసారి పకపక నవ్వింది ఆమె.

ఆశ్చర్యంగా అతడు పచార్లు ఆపి ఆమెవైపు చూసి అన్నాడు— "ఎందుకిలా నవ్వుతున్నావు?"

"ఏమీలేద... నాకు నచ్చవచ్చు కాని అతనికి నేను నచ్చవద్దూ?...

అతడు తిర్లీ పచార్లుచేస్తూ మౌనంగా వుండిపోయాడ

రేఖ నెమ్మదిగా మంచందిగివెళ్ళి డ్రెస్సింగ్ టేబుల్ దగ్గర నిలువు టద్దంలో తననుతాను చూసుకుంటూ నిలబడింది. ఆమె పైట జారిపోయి వక్షోజాలు నిండుగా కనిపిస్తున్నాయి అద్దంలో. ఆమె కళ్ళు వాటిమీదే నిలిచాయి చాలా క్షణాలు.

అతడు ఆగి ఆమెవైపు చూసి అన్నాడు—

"ఎందుకు నచ్చవు? ఏ ఆదర్శభావాలున్న యువకుడైనా... ...."

అతడు ఆ వాక్యం పూర్తిచేయకుండానే కిలకిల నవ్వి అంది ఆమె. "అతడిని పెళ్ళిచేసుకుని, ఆ జాలినీ, దయాధర్మభిక్షగా అతడు నాతో పొందే సెక్సు అనుభవాన్నీ శాశ్వతంగా నిలబెట్టుకోడానికి కాళ్ళావేళ్ళాపడుతూ, కృతజ్ఞత చూపిస్తూ, ఇదివరకు ఎంతమందికో ఇష్టంవచ్చినట్లు చేసుకోండి అని ఈ ఒంటిని ఇచ్చినట్లే అతనికీ అప్పగించి బతకాలా నేను?"





ఆమె లాజికల్‌గా అంటున్న ఆ మాటలకు చంద్రం నివ్వెరపడి సగంనోరు తెరుచుకుని వుండిపోయాడు, నిశ్చేష్టుడై.

హఠాత్తుగా అతనివైపు తిరిగి అంది— "మీ క్లినిక్‌లో అడుగుపెట్టేంతవరకు పదేళ్ళు సెక్సు జీవితం గడిచింది నాకు. రోజుకు నాలుగుసార్లు లెక్కచూసినా మొత్తం ఎన్ని వేలసార్లు నా ఒళ్ళు ఎంతమందికి అప్పగించానో ఊహించగలరా మీరు?"

కొద్దిగా ఆగి, అతడు వెర్రివాడిలా తనవైపు చూస్తుండగా అంది ఆమె—

"సుమారు పదిహేను వేలసార్లు! అన్ని వేల మందికి!" మళ్ళీ అద్దంవైపు తిరిగి తన ప్రతిబింబాన్ని చూసుకుంటూ అంది— "కాని అందులో ఏదో అమరానందంవుంది అంటారే, అది ఒక్కసారి... ఒక్కసారి కూడా పొందలేదు నేను... ఒక బొమ్మలా అది పొందినట్లే నటించడంతప్ప! అటువంటి చెత్త సెక్సుకోసం మళ్ళీ ఆరాటం నాలో ఇంకా వుంటుందనే అనుకుంటున్నారా?"

ఆమె అడుగుతున్న ప్రశ్నలకు వైద్యశాస్త్ర నిపుణుడైన తనకు ఏ జవాబూ దొరకలేదు. తలవంచుకుని పచార్లుచేయడం మొదలుపెట్టాడతను.

ఆమే అంది మళ్ళీ "పోనీ ఆ ఆరాటం లేకపోయినా కడుపు ఆరాటంకోసం, ఇన్ని బతుకులకోసం, ఆ ఆదర్శ యువకుడికి సహచరిణిగా వుండాలంటారా చివరివరకూ? చూండీ... మొదట్లో ఎన్ని ఆదర్శభావాలున్నా ఆరోజుకీ నిజానికి క్షణక్షణానికీ, ఈ సంఘంలో ఎదురయ్యే రాటుపోట్లకు తట్టుకు, పదిమందీ సూటిగా, మాటుగా అనే నారకాలైన మాటలూ, దెప్పిపొడుపులూ సంచి చివరివరకూ నా పక్కనే, నాకు తోడుగా ఆ మనిషి నిలబడతాడని గ్యారంటీ ఎవన్నా ఇవ్వగలరా?"

హఠాత్తుగా పళ్ళు బిగించి, కళ్ళు పెద్దవి చేసి అద్దంలో తన ప్రతిబింబాన్ని కాక ఇంకెవరినోచూస్తూ కొద్దిక్షణాలు వుండిపోయి, వెనుకకుతిరిగి అతని వైపుచూసి కొద్దిగా గొంతు స్థాయి హెచ్చించి అంది ఆమె— "నామీద జాలిపడి తనకు ఏదో ఆదర్శభావాలున్నాయని నన్ను పెళ్ళాడటానికి సిద్ధపడి, చివరకు, నన్ను ఇంట్లో ఒక కుర్చీలా, చెత్త పోసుకునే డబ్బాలా, జబ్బుపడ్డ కుక్కలా, అసలు తనకు పెళ్ళాంఅని ఎవరికన్నా ఇంట్రడ్యూస్ చెయ్యడానికి అసహ్యపడే వస్తువులా చూసే మనిషితో జీవితం గడపాలని నాకులేదు!"

మామూలుగా చాలామంది వితండవాదం అనుకున్నా ఎంతో సహేతుకంగా కనిపిస్తున్న ఆమె మాటలకు ఆశ్చర్యపడ్డాడు. నిరుత్తరుడై పచార్లు ఆపి ఆమెవైపేచూస్తూ నిలబడ్డాడు చంద్రం.

అతని మనస్సులోని ఊహ గ్రహించిన ఆమెఅంది— "వితండవాదం అని అనిపిస్తున్నా అంతలోనే ఇది వితండవాదన కాదని నేనంటున్నా దాంట్లో ఎంతో నిజంవుందనీ అనుకుంటున్నారు కదూ మీరు? నిజానికి వాదన కాదిది... నన్ను నేనే ఈ మధ్యాహ్నం నుండి వేసుకుంటున్న ప్రశ్నలివి! మీరే జవాబులివ్వలేక పోయినప్పుడు నాలాటి మిడిమిడి జ్ఞానపు మనిషి ఏం జవాబు ఇచ్చుకోగలదు తనకు తాను? ఏదో బతకడానికి ఇంత కూడే కావాలంటే నా నీచవృత్తి ఎలాగూ వుండనే వుంది. కాని నేను కోరేది తిండికాదు, ఇంతవరకు వేలకొద్దీసార్లు అనుభవించిన సెక్సు పని కాదు..."

తన ధోరణి హఠాత్తుగా ఆపివెర్రిగా చూస్తూ ఉండిపోయి చివరకు నెమ్మదిగా అంది- "కాని...కాని... నాకేంకావాలో నాకే సరిగా తెలియదు. అందుకే బతుకంటే విరక్తి పుట్టింది. ఒక్కనిమిషం పోలీను జీపు అక్కడికి రావడం ఆలస్యం అయితే నా మనస్సులో జరుగుతున్న అంతంలేని వితండవాదన మీతో ఇలా పైకి చెప్పవలసిన అవసరమే ఉండివుండకపోను!" ఇది అంటున్నప్పుడు క్రమక్రమంగా గొంతు పూడుకుపోయి ఊపిరితిరగనట్లయి ఆఖరు మాటలు అస్పష్టంగా అయిపోయాయి.

ఉన్నట్లుగా వుండి వెళ్ళి మంచంమీద బోర్లా పడుకుని ఒక దిండు లాగుకుని అందులో మొహందాచుకుని ఎగఊపిరితీస్తూ, పెదవులూ, కళ్ళూ ఏడుపు పైకి రాకుండా గట్టిగా




బిగించింది రేఖ.

చేతులు వెనుక కట్టుకుని నిలబడిన చంద్రానికి, నిజానికి రేఖ ఆలోచించినంత లోతుగా తానెన్నడూ ఆమె భవిష్యత్తు గురించి ఆలోచించలేదని అనిపించింది.

ఎంత ఆపుకున్నా ఆగని దుఃఖం పొరలిపోయి పైకివచ్చేసింది ఆమెకు.

నెమ్మదిగావెళ్ళి మంచంమీద కూర్చుని వెక్కి వెక్కి ఏడుస్తున్న ఆమె రాగిజుట్టు మృదువుగా నిమురుతూ అన్నాడు చంద్రం- "వద్దు - ఏడవకు...ప్రస్తుతానికి ఏమనడానికి తోచడంలేదు నాకు. కాని ఒక్కప్రశ్న మాత్రం అడుగుతాను - ఈ మధ్యాహ్నంనుండి ఈ వాదన నీలో మొదలైంది అన్నావు... ఇన్ని నెలలుగాలేంది ఈవాళెందుకు వచ్చాయి ఈ ప్రశ్నలు?"

తల అతని వైపునకు త్రిప్పి ఏడుపు తగ్గించుకుని ఊపిరి నిండుగా పీల్చివదిలి అంది రేఖ- "ఒకసారి ఇటువంటి ప్రశ్నలే నన్నెదుర్కొన్నాయి! అందుకే ఆవేళ మీ క్లినిక్ నుంచి పారిపోయాను కాని నన్ను వెతికిపట్టుకుని మళ్ళీ మీరు వెనుకకు తీసుకొచ్చారు. ఆ రాత్రి గోదావరి గట్టున ఇసుకలో మీ కాళ్ళదగ్గర ఆనుకుని కూర్చున్నప్పుడు ఎంతో నిండుగా తృప్తిగా అనిపించింది. బతుకులో నాకు కావలసింది అటువంటి అనుభవమే అనిపించింది. ఆ తీయని జ్ఞాపకం ఆధారంగా, మీతో మళ్ళీ ఎప్పుడూ అలా కూర్చునే అవకాశం లేకపోయినా లక్ష్యపెట్టకుండా ఇన్నాళ్ళూ ముందురోజుల ఆలోచనే లేకుండా గడిపేశాను. కాని...కాని..." ఆగిపోయి దూరాల్లో చూస్తూ వుండిపోయింది ఆమె.

"అదే నేనడుగుతున్నది రేఖా! ఈవాళెందుకు వచ్చాయి ఆ ప్రశ్నలు?" ఈ మాటలు అంటూ అప్రయత్నంగా ఆమె చెంపలు మృదువుగా నిమిరాడు చంద్రం.

హఠాత్తుగా ఆమె వెల్లకిల తిరిగి పడుకుని తిన్నగా అతని కళ్ళలోనికి చూస్తూ అంది-

"మీ దగ్గర అబద్ధాలాడాలనిపించదు పదేళ్ళపాటు వచ్చి అబద్ధపు బతుకే గడిపినా! నిజంచెప్తాను, ఏమీ అనుకోకండి...ఉదయం ఆ స్నానం, పూజా అయినతర్వాత ఎందుకో వెర్రిదానిలా మీకోసం అన్నిచోట్లా గాలించాను. ఆ జాతరలో. మీరు సుమలతగారి కారులో వచ్చారన్నది తెలియక మీ క్లినిక్ కార్లకోసం పార్కింగ్ ప్లేస్‌కి ఎన్నిసార్లో వెళ్ళిచూశాను. చివరికి మిమ్మల్ని సుమలతగార్నీ - జంటచెట్లచప్టామీద చూశాను. నన్ను క్షమించండి... అలా దొంగతనంగా చూసినందుకు. ఏదో వెర్రి ఆరాటంగా ఉండేదినాకు, ఈ పున్నమినాడు మిమ్మల్ని ఎందుకో ఒక్కసారి చూడాలని - అంతేగాని సుమలతగారితో మీరు తిరుగుతున్నారా లేదా అనికాదు! నిజం... నామాట నమ్మండి. కాని తీరా మీరు కనిపించాక, ఆవిడ ఎంతో సరదాగా నవ్వుతూ మాట్లాడుతూ వుండటం, మీరిద్దరూ కూల్‌డ్రింక్స్ తాగడం, మీ ఎంగిలి ఆమె తాగడం, మీచేయి పట్టుకుని ఆమె పరీక్షించటం అన్నీ... కనిపించాయి వరసగా నా కళ్ళకి! ఆ అమ్మాయికి మీరంటే ఎంతోప్రేమ, అభిమానం అని తోచింది...నాకేం అసూయగా అనిపించలేదుగాని గుండెలోమటుకు ఏదో మంట బయల్దేరింది. నామనస్సులో ఆక్షణాల్లో ఏం ఆలోచనలు కలిగాయో చెప్పలేను, నాకేసరిగా స్పృహ లేదప్పుడు. కాని మీ అమ్మగారూ, ఇంకెవరో ఆవిడా వచ్చి మీ అందరూ కారులో వెళ్ళిపోయేవరకు మిమ్మల్నేచూస్తూ అలా వుండిపోయాను. మీ కారుకు కొద్దిదూరంలోనే ఒక కారువెనుక నక్కి...మా బస్సు టైమవుతున్నది అన్న ధ్యాసేలేకుండా. అందుకే ఆ బస్సు మిస్సయిపోయాను. నాలుగున్నరకు లైనుబస్సు ఏదో ఉందంటే లైనుబస్సు స్టాండుకి వెళ్ళి అక్కడ కాచుకు కూర్చున్నాను. ప్రశ్నలు గండుచీమల్లా పీక్కుతింటూనే ఉన్నాయి...మిమ్మల్ని మళ్ళీ క్లినిక్‌లో చూస్తే ఆ బాధతప్పిపోతుందేమో అన్నఆశతో ఉండేదాన్ని. కాని ఆ బస్సులో మొగవాళ్ళే ఎక్కలేకపోయారు. బస్సు వెళ్ళిపోతుంటే బెంగగా దానివైపే చూస్తూ నిలబడ్డ నాకు ఎందుకో భగవంతుడే నన్ను మీ క్లినిక్‌కి వెళ్ళనీయకుండా అడ్డుతున్నాడేమో అనిపించింది. మీ దారివేరు, నాదారివేరు అనిపించింది. సుమలతగారి అమాయకపు మొహం మనస్సులో మెదిలింది. ఎందుకో మీ దారిన మిమ్మునడవనియ్యకుండా నేనడ్డుపడ్తున్నాననిపించింది. నేనొక గుదికొయ్యను - మొయ్యాలేరు, పారెయ్యాలేరు మీరు

నన్ను. అందువల్ల నా అంతటనేనే తప్పుకు పోతే మంచిదనిపించింది. అలా బస్‌స్టాండు నుంచి నడిచి వెళ్తున్నప్పుడు...ఉదయం బస్సులో మళ్లీ క్లినిక్‌కు వెళ్లిపోదాం...జబ్బుపూర్తిగా నయమయ్యాక ఆలోచించుకోవచ్చు అని పించింది, కాని జాతరలోకి వెళ్లి పిచ్చిదానిలా అటూఇటూ తిరుగుతూంటే ఏదో గొంతు లోపలినుండి 'నువ్వుమరి ఆ క్లినిక్‌కి వెళ్లకు!'' అని అరుస్తున్నట్లుగా అనిపించింది...

''శివాలయానికి వెళ్లాను... అక్కడ ఆ దేవుణ్ని స్వయంగా అడిగితే ఏదన్నా జవాబు తోచేలా చేస్తాడేమో అన్న ఆశతో...''

ఆగికొద్దిక్షణాలు అలాగే ఉండిపోయింది ఆమె. అతడు మౌనంగా వుండిపోయాడు. ఆమె ధోరణికి అడ్డువెళ్లి ఏదో మాట్లాడితే ఆ వరుసతెగిపోతుంది అనిపించింది అతనికి.

మళ్లీ చెప్పడం మొదలుపెట్టింది రేఖ. ''నందివిగ్రహం కొమ్ములమధ్య నుండి శివలింగాన్ని చూశాను- దేవుడి గర్భగుడి ముందు సాష్టాంగపడి దణ్ణంపెట్టాను...ఎంతో వేడుకున్నాను. కాని ఆ దేవుడికీ దయరాలేదు. వెళ్లి పార్కింగ్ జాగా దగ్గర చప్టామీద ఉదయం మీరు కూర్చున్నచోటనే కూర్చున్నాను. ముందు కొద్దిగా హాయిగా అనిపించింది కాని అంతలో నా ఎదురుగా ఆ అమ్మాయి సుమలతగారు కూర్చున్నట్లు, నా వైపు బాధగా చూస్తున్నట్లు అనిపించింది. ''క్షమించండి, క్షమించండి, వెళ్లిపోతున్నాను...'' అన్నాను లోలోపలే. ఆ జాగాలో కూర్చునే హక్కు నాకు లేదనిపించి, వెంటనే లేచిపోయి అలా బీచ్‌వైపు వెళ్లాను. అక్కడ వేసివున్న టెంపరరీ షెడ్లవైపు చాలా మంది గుంపులు గుంపులుగా వెళ్తున్నారు. నేనూ వెళ్లాను వాళ్లతో - అందరూ ఎవరి షెడ్ల దగ్గర వాళ్లు జారిపోయారు. చివరి ఫోకసింగ్ లైట్‌దగ్గర వున్న షెడ్డు మనుమలు మటుకు మిగిలారు. వాళ్లతోపాటు వెళ్లాను. నావైపు వింతగా చూసి వాళ్లలో వాళ్లేదో అనుకున్నారు. ఆ షెడ్డు కూడా దాటి చాలాదూరం వెళ్లి వెన్నెట్లో అక్కడ ఇసుకలో పడుకున్నాను తల కింద చేతులు పెట్టుకుని. ఎంతసేపు అలా ఉన్నానో తెలియదు.'' హఠాత్తుగా చేతులతో మొహం కప్పుకుని దిళ్ళమీదికి వాలిపోయి, వెక్కివెక్కి మాట్లాడటం మొదలుపెట్టింది.

''నిజానికి ఇప్పుడనిపిస్తున్నది... ఇదీ సరి అయిన జవాబుకాదనీ, దేవుడికి నేనలా సముద్రంలోపడి చావడం ఇష్టంలేదనీ... మరి... మరి... ఇంక... ఇంక... ఏది... జవాబో నాకు తెలియదు.''

ఈ మాటలు అంటూ పక్కకు తిరిగిపోయి ఆ దిళ్లమీద తలవేసి కొట్టుకుంటూ ''ఏమి చేయడం? ఎక్కడికి వెళ్లడం? ఎందుకు నాకోసం వెతికించారు మీరు ఆ పోలీసుల ద్వారా'' అని ఏడుస్తూ అంది రేఖ.

నిశ్చేష్టుడై అలాగే ఉండిపోయాడు చంద్రం. ఆమె అన్నది పూర్తిగా అర్థంచేసుకోవడం, ఆ మాటల భావం జీర్ణించుకోవడం చాలా కష్టంగా అనిపిస్తున్నది అతనికి.

కొంతసేపటికి ఆమె ఏడుపు ఆగిపోయింది-కదలకుండా తల అటువైపుకు తిప్పుకుని పడుకుని వుండిపోయింది ఆమె.

ఆ గదిలో అలముకున్న నిశ్శబ్దంలో గడియారపు టిక్కు టిక్కు చప్పుడు తప్ప ఇంకేమీ వినిపించని నీరవత! అతడు నెమ్మదిగా ఆమె తలనిమురుతూ అన్నాడు— ''ఆ రోజే చెప్పాను సుమలత నాకేమీ కాదని- ఆమెకు నేనంటే ఎంతో అభిమానం, ప్రేమా అన్న సంగతి నిజమే. మనిషి చాలా మంచిది- కాని ఎందుకో ఆ రకమైన-అంటే ఆమెను నాదాన్నిగా చేసుకోవాలన్న అభిప్రాయం, ఊహ ఎప్పుడూ రాలేదు. ఆమె దగ్గర ఉన్నప్పుడు ఒక్కొక్కసారి ఏదో భయంగా అనిపిస్తుంది! నిజం... రేఖా! పైకి నవ్వుతూ మాట్లాడతాను కానీ పొద్దున నా ఎంగిలి కూల్‌డ్రింక్ ఆమె తాగినప్పుడు ఎంత చిరాకుగా, కోపంగా అనిపించిందో తెలుసా? అన్నీ చూశావుకదూ? నేనా సీసా తీసి అందులో దంతా కింద పారబొయ్యడం నువ్వు చూడలేదూ?''

హఠాత్తుగా అతని వైపు తిరిగి అంది ఆమె ఆశ్చర్యంగా! ''పారబోశారా! నిజంగా... నేను చూడలేదే!''

''నిజం... నీ తోడు'' ఎప్పుడూ ఒట్లు వెయ్యని అతడు తన మీద ఒట్టు వెయ్యడం ఆమెకు ఎంతో నిండుగా అనిపించింది. ఆ





పాల బిస్కట్లు–
నవ్వుతూ, తుళ్లుతూ పెరిగే పాపాయిలకు నేస్తం!






బ్రిటానియా

రుచికరమైన, పుష్టికరమైన బిస్కట్లు

LINTAS BIN MB 10 1710 TL

పారబొయ్యడం తానెందుకు చూడలేదు అనుకుంటూ పిల్లవాడి రబ్బరు బూర వైపు ఆ సమయంలో తన దృష్టిపడటం, అది పేలిపోవడం జ్ఞాపకం వచ్చి ఆ సంగతి చెప్పి అంది ఆమె. "ఎందుకో ఆ బూరలాగే నా మనస్సులో కల ఏదో పేలి ముక్కముక్కలుగా గాలిలో ఎగిరిపోయినట్లనిపించి పరధ్యానంగా అయిపోయాను ఆ సమయంలో- అందుకే మీరా పారబొయ్యడం చూడలేదు!"

కొద్దిగా ఆగి అన్నాడు అతడు - "నిజానికి ఏ ఆడదీ ఆ విధంగా ఆకర్షించలేదింతవరకు. నా మాటనమ్ము రేఖా! అసలు... అసలు..." అని ఏదో చెప్పబోయి ఏమని చెప్పాలో తనకే సరిగా బోధపడక ఆగిపోయాడు అతడు.

ఆశ్చర్యంగా అతనివైపు చూస్తూ ఉండిపోయింది ఆమె కూడా. చివరకు ఆమే మాట్లాడింది ముందుగా- "ఆగిపోయారేం? అసలు... అసలు అని?"

ఒక్కఉదుటున మంచంపైకి ఎగబాకి ఆమె భుజాల కింది నుండి చేతులు పోనిచ్చి ఆమెను పైకెత్తి ఆ కళ్లలోనికి చూస్తూ అన్నాడు అతడు - కొద్దిగా బొంగురుగా అయిన గొంతుతో- "అసలు నిజానికి నన్నావిధంగా ఆకర్షించిన మొదటి ఆడదానివి నువ్వే... నువ్వే...నువ్వే... రేఖా! ఇప్పుడు స్పష్టంగా తెలుస్తున్నది నాకు... ఐ లవ్ యు!"

వెర్రిగా "నన్నా?" అంటూ తేలిపోతూన్న కళ్లతో తనవైపు చూస్తున్న ఆమెను దగ్గరకు తీసుకుని తన గుండెలకు గట్టిగా హత్తుకుని "నిన్నే... నిన్నే!" అన్నాడు చంద్రం.

"ఐలవ్‌యు.." "ఐలవ్‌యు"... నిజంగా? నన్నా? నేనూ అంతే, ఐలవ్‌యూ... ఐలవ్‌యూ" అంటూ కండరాలు తేరిన చంద్ర గుండె మీద తల గట్టిగా అన్పుకున్న ఆమెకు మనస్సు ఎక్కడో తేలిపోతున్నట్లుగా అనిపిస్తున్నది. ఇదే ఆమె జీవితంలో ఇటువంటి అనుభవం! మొదటిసారిగా మనస్ఫూర్తిగా ఒక పురుషుడు తన గురించి తనలాంటి దాన్ని గురించి, ఈ విధంగా అనడం!

అతడు గట్టిగా ఊపిరితీస్తూ ఆమె మొహం పైకెత్తి కళ్లలోనికి చూస్తూ ఉండిపోయాడు...హఠాత్తుగా ఆమె తలను దిళ్లమీదికి చేర్చి ఆమె మీదికి వంగి రెండు బుగ్గలమీద్గా,మృదువుగా రెండు చేతులతో రాయడం మొదలుపెట్టాడు.

అప్రయత్నంగా సెలయేటి గలగలలా ఆమె గొంతు దారులలోనుండి కిలకిలనవ్వులు పైకివచ్చాయి బుగ్గలమీదా, నాసికమీదా, పెదవులమీదా, ఒళ్లంతా జలజల పులకరించి పోతుండగా!

అతడు ఆరోజు గోదావరిగట్టున చేసినట్లే కళ్లమీదా, కనుబొమలమీదా, చెవులమీదా వేళ్లతో చిత్రకారుడి కుంచెలా తీర్చిదిద్దడం మొదలుపెట్టాడు.

రేఖ ఆరోజు రాత్రి ఇసుక తెన్నెలలో అయినట్లుగా అయిపోతూ ఒక్కసారిగా అంతరిక్షాలను దాటి ఏదో ప్రపంచంలోకి ప్రయాణించ్చడం మొదలుపెట్టింది. అతని వేళ్లు నెమ్మదిగా ఆమె నుదిటిపైన చిందులాడ్తున్న ముంగురులలోనికి వెళ్లి వాటిని నిమురుతుంటే మళ్లీ ఆమె శరీరం కరిగి కుంచించుకుపోవడం మొదలుపెట్టింది.

ఇన్నాళ్లుగా తన మనస్సులో తానే నిశ్చయంగా అనుకోడానికి ఒప్పుకోడానికి- జంకుతూ, భయపడుతూ, అనుమానిస్తూ వుండిన మాటలు ఈరోజు అనుకోని పరిస్థితులలో పైకి స్పష్టంగా విడమరిచి నిబ్బరంగా చెప్పిన అతనికి ఎన్నడూ లేనంత ఆనందంగా అనిపిస్తూ అతనిలోని పురుషత్వం విజృంభించడం మొదలుపెట్టింది.

గట్టిగా ఆమె బుగ్గలమీద ముద్దుపెట్టుకున్నా అతనిలోని పురుషత్వపు వేడి ఏ మాత్రమూ తగ్గలేదు. వెర్రివాడిలా ఆమె కళ్లలోనికి చూస్తూ తనకు తెలియకుండానే చేతులు రెండూ పైటతొలగిపోయి వున్న గుండెలమీదికి పోనిచ్చాడు. జాకెట్టు రెండువైపులా లాగడంతో హుక్స్ పటపటా తెగిపోయాయి. ఆ తరువాత ఏమిచేశాడో అతనికి స్పృహలేదు.

జాకెట్టుగుండీలు తెగిపోయిన చప్పుడు, అంతవరకు నొక్కుకుపోయి ఉన్న వక్షోజాలు ఒక్క ఉదుటున స్వేచ్ఛగా పైకి ఎగతన్నుకు రావడమూ- వీటితో ఆపై అంతరిక్షాలనుండి ఒక్కసారిగా ఎవరో తనను కిందికి తోసేసినట్లుగా అయిన ఆమె తన దివ్యానుభూతి అంతా




పూర్తిగా జారిపోగా స్పృహవచ్చి కళ్లుతెరిచి అతనివైపు చూసింది.

అతని మొహం కనిపించలేదు ఆమె కళ్లకు. లైటు వెలుగుపడుతున్న అతని నల్లని జుట్టుమటుకు ఆమె కళ్ళలో ప్రతిఫలించింది. అంతదాకా విచ్చుకుని వున్న గులాబీ రంగు పెదవులు నీలిరంగు అలముకుని బిగుసుకు పోయాయి. అక్కడి నరాలన్నీ కరెంటులేని తీగలలా నిర్జీవంగా అయి- ఒళ్లంతా ఒక కొయ్యబొమ్మలా అయిపోయిన ఆమె కళ్లువి ప్పార్చి వెర్రిగా చూస్తూ కొంతసేపు అలాగే వుండిపోయింది.

ఎంతమందో వేలకొద్దీ విటులు- తన శరీ రంతో ఇలాగే ఆడుకున్నారు.

చివరకు జాలిగా నిట్టూర్చి లోలోపలే "హు" అనుకుని చేతులు జాపింది.

అయితే—

ఆరాత్రి గోదావరి గట్టున...

ఇసుకతెన్నెలలో...

అంతా అంతరిక్షంలో కాళరంధ్రపు లోతు లలోనికి దిగజారిపోయి మనస్సు- ఒళ్లు ముందు ఒక చుక్కగా అయి ఆ తరువాత అంతకంతకూ కుంచించుకుపోయి చివరకు పూర్తిగా మాయమైపోయిన క్షణాలలోని రేఖమ టుకు కాలేదు. కాలేకపోయింది.

తనలోని వేడి చల్లారిన చంద్రం ఆమెను గట్టిగా కౌగలించుకుని, ఆమె గుండెలమీద తలదాచుకుని ఉండిపోయాడు అలాగే. ఆ ఊపిరి చప్పుడు వింటూంటే ఏదో పెద్ద నాగు బాము తన మనస్సును కాటువేయడానికి బుస లు కొడ్తూ వస్తున్నదా అనిపించడం మొదలు పెట్టింది రేఖకు.

కాని ఎన్నిసార్లో ఇటువంటి సమయాల్లో అవతలి వ్యక్తిమీద కలుగుతూవుండే అసహ్యం మటుకు చంద్రంమీద కలగలేదు.

అతని ఊపిరి మామూలుగా అయింది. ఆమె మనస్సులో హఠాత్తుగా అతడంటే ఏదో జాలిగా అనిపించి, ఇంకా ఎక్కడో లోపల మూలలలో అతడంటేవున్న ప్రేమా, గౌరవ మూ అంతా వేళ్లకొనలలోనికి దిగజార్చి అతని జుట్టును నిమిరింది.




గాఢ నిద్రలోనికి దిగజారిన చంద్రం తుళ్లి పడినట్లుగా లేచికూర్చుని ఎడమచేతి వాచీ వైపు చూశాడు. అయిదుదాటి రెండు నిముషా లయింది. అతడు ప్రతిరోజూ మేలుకునే సమయం అదే. పూర్తిగా నగ్నంగాతన పక్క కళ్లుమూసుకుని పడుకునివున్న ఆమె వైపు చూసి, అదే దశలోవున్న తన ఒంటివైపూ చూసుకున్నాడు. గుండె కలుక్కుమంది. నెమ్మ దిగా మంచందిగి రెండు రగ్గులలో ఒటి తీసి ఆమె కాళ్లదగ్గరనుండి మెడవరకూ ప్పాడు. ఆ తరువాత మంచానికి రెండువైపుః కింద కార్పెట్‌మీదపడివున్న తన బట్టలుతీసివేసుకో వడం మొదలుపెట్టాడు.

నిద్రేకాదు అసలు చిన్న మగతనిద్రోనికి కూడా దిగజారకుండా అల్లకల్లోలంగా గుగు డుపడుతున్న ఆలోచనలలోవున్న ఆమెకళ్లు కొద్దిగా తెరిచి అతడు చేస్తున్నది అంతా ని స్తున్నది.

చంద్రం తన పనిపూర్తిచేసి మంచంగ్గర కువచ్చి తలగట్టున నిలబడి "రేఖా!" ని మృదువుగా పిలిచాడు. ముందు ఆమె ఏక లేదు కాని మరొకసారి గట్టిగా మృదువునే పిల్చినప్పుడు కళ్లు విప్పకుండానే చాలా న్మె దిగా అంది: "రేఖ చచ్చిపోయింది. ఇక్క ఉన్నది కామిని"

ఆ మాటలు విన్న అతనికి ఎవరో శెళ్లు తన చెంపమీద కొట్టినట్లయింది. వెర్రిగాఆ వైపే చూస్తూ వుండిపోయాడు.

ముందు నోట మాటపెగిలిరాలేదుకాసేపటి రకు గుండెదిటవు తెచ్చుకుని— "అదేట మాటలు రేఖా? అయిదుంబావు అవుతుది

ఆరుకు బయల్దేరి ఈ ఊరువదిలి వెళ్ళిపోవాలి. అర్జంటు పనులున్నాయి...'' అంటూ ఏదో అనబోతుండగా ఆమె రగ్గుకిందికి జార్చి గుండెలపైన చేతులు కట్టుకుని నిశ్చలంగా అతనివైపు చూస్తూ అంది:

''కారులో మీ అమ్మగారి పక్కన కూచోబెట్టుకుని నన్ను తీసుకెళ్తారుకదూ?''

ఉలికిపడిన అతడు ముందు తడబడి తరువాత మాటలు కూడ బలుక్కుంటూ అన్నాడు: ''నువ్విక్కడే రెస్టు తీసుకో ఈ పూటకి...నేను వాళ్లతో వెళ్లి అక్కడ పనులు చూసుకుని మళ్లీ నాలుగు లోపుగా ఇక్కడికి వస్తాను. నీకు టిఫినూ, కాఫీ, భోజనం...''

అతని మాటలుపూర్తి కానీకుండా హఠాత్తుగా ఒక్క ఉదుటున రగ్గు పక్కకుతోసి మంచందిగి అతనికి ఎదురుగా చేతులు కట్టుకు నిలబడి వ్యంగ్యం సూచించే గొంతుతో అంది: ''వచ్చి ఈ రాత్రికి మళ్లీ నన్నిక్కడ అనుభవిస్తారు కదూ?''



''అదేమిటి? సాయంత్రం బయల్దేరి క్లినిక్కు ఎనిమిది గంటలకు చేర్తాం''

''అంతేగాని నన్నుమటుకు ఇప్పుడు వాళ్లతోపాటు తీసుకువెళ్లరు! ఆ ధైర్యం మీలో లేదుకదూ?''

ఎగఊపిరితీసి ఆగిపోయాడు చంద్రం—తనకు తెలిసిన ఏ భాషలోనూ ఆ ప్రశ్నకు జవాబు చెప్పతగిన మాటలు లేనట్లుగా.

నిరసనగానవ్వి చిందరవందరగా ఉన్న తన పొడుగాటి జుట్టును ఒక్క మెడ విసురుతో చేతులు ఉపయోగించకుండా పూర్తిగా వీపుమీదికి వెళ్లేలా చేసుకుని అంది ఆమె:

''అప్పుడప్పుడు మటుకు మీలో కోరికలు చెలరేగి వేడిపుడితే, ఏదో వంకమీద ఎక్కడికో తీసుకువెళ్లి నన్నిలాగే బట్టలు లేకుండాచేసి మీ కోరికలు తీర్చుకుంటారు! మళ్లీ వెంటనే రగ్గో దుప్పటో కప్పి నన్ను రెస్టుతీసుకోమనిచెప్పి మీ పనులమీద వెళ్లిపోతారు! ఆ తరువాత

శాశ్వతంగా ఎక్కడో ఇలాటి గదిలో లేక ప్రత్యేక మైన ఇంట్లోనో నన్ను ఎవరికీ తెలియకుండా వుంచి నా ఊపిరి, అందం సాధ్యమైనన్ని నాళ్లు నిలవడానికి కావలసినవన్నీ వచ్చేలా ఏర్పాటు చేస్తారు, మీకు అవసరమైనప్పుడు ఉపయోగించుకోడానికి... అంతేనా?''

అసలు తనకు మాట్లాడటం వచ్చును అన్న దికూడా అతనికిస్ఫురణలో లేదప్పుడు. షాక్ తగిలినట్లుగా మనస్సుమటుకు విలవిలలా డ్తుండగా, ఒళ్లు చలనంలేని బొమ్మలా అయి పోయింది అతనికి.

చేతులు వెనుక జోడించి, పిడికిళ్లు బిగించి అటూ ఇటూ బోనులో సివంగిలా తిరుగుతూ, అగ్ని పర్వతం పేలేముందు ఆకాశం వైపుకు ఎత్తుగా ఎగిరిపడే పెద్ద పెద్ద నిప్పురాళ్లల్లా, ఎర్రగా కణకణలాడ్తూన్న లావా ముద్దల్లా మాటలు పైకెగజల్లింది ఆమె.

"జవాబు చెప్పలేరు మీరు! ఎందుకంటే నేనన్న మాటలు వచ్చినిజాలు కనక'' హఠాత్తు గా అతనికి ఎదురుగా ఆగిఅంది: "ఏదో... ఏదో మీగురించి అనుకున్నాను...

వెర్రిదానిలా ఏవో ఏవో కలలు కన్నాను రాత్రి మీరు నా చెంపలు నిమిరి ముద్దు పెట్టుకున్న ప్పుడు. కాని...కాని... మీరు అందరు మగవాళ్ళ లాంటివాళ్ళే. నేను ఊహించుకున్న ప్రత్యేకత ఏమీలేదు. మీలో అందరిలా మీకూ కావలి సింది- ఈ లోపల...ఈ లోపల...'' అంటూ ఎడమ చూపుడు వ్రేలితో గుండెలనడుమ చూపించి అంది "ఈ లోపల ఉన్న మనస్సు కాదు... ఇవి... ఇవి...'' ఈసారి రెండు పిడికెళ్ల తోనూ వక్షోజాల మీద గుద్దుకుని అంది. "ఇవి... ఈ మాంసం ముద్దలు... వెచ్చవెచ్చగా బిగువుబిగువుగా కావాలి మీకు'' నోట మాట రాక ఊపిరి గట్టిగా లోపలికి పీల్చి అలాగే ఉండిపోయింది కొంతసేపు. కళ్ళు మూసు కుని, చేతులు నిస్సహాయంగా పక్కలకు జా ర్చింది.

ఆమె హిస్టీరియాలోనికి జారిందని అని పించింది అతనికి. నెమ్మదిగా ఒక అడుగు ముందుకు వేసి మృదువుగా అన్నాడు-

"నర్దుకో రేఖా... నామాటవిను...''

కళ్ళు మూసుకునే అంది ఆమె- "మరి ఆ పేరుతో పిలవకండి. రేఖ మరిక్కడలేదు''

"పోనీ అలాగే అనుకో... చూడు, మూడునా లుగు గంటలకల్లా వస్తాను. ఇద్దరం కలిసి కూర్చుని నెమ్మదిగా ఆలోచిద్దాం ఏంచె య్యాలో... పద! నా మాటవిని వెళ్ళి పడుకో...'' ఆమె భుజం మీద చేయి వేశాడు అతడు.

ఆ చేయి విసురుగా తోసేసి అంది: "మీరు వెళ్ళండి... ముందు వెళ్ళిపోండి''

"వెళ్తాను... ఆలస్యం అయితే అయింది. ఎమర్జెన్సీ కిట్ తెచ్చి ఒక ఇంజక్షన్ ఇచ్చి వెళ్తాను. కాని ఒకటి...''

అతని మాట పూర్తి కానివ్వకుండా అంది ఆమె ఒక్కసారిగా కళ్ళుతెరిచి: "మీ ఇంజక్ష న్లూ మందులూ ఇంక నాకక్కర్లేదు. ముందు మీరు వెళ్ళండి... నా దారిని నన్ను వదిలి''

"వెళ్తాను కాని ఒకటి- నేను లేనప్పుడు నువ్వే అఘాయిత్యమూ చేయకూడదు. ఆ ఒక్క మాట మటుకు నాకియ్యి... లేకపోతే ఇక్కడినుండి నా అడుగులు కదలడానికి మన స్సు ఒప్పుకోదు''

"నేను మాట ఇస్తే నిలబెట్టుకుంటానని మీకు నమ్మకం వుందా?''

"ఉంది...''

"అయితే ఇదిగో-నేనివాళ సముద్రం ఒడ్డున నా తరఫునా, మా అమ్మ తరఫునా పూజచేసిన త్రిమూర్తి- అగ్నుల సాక్షిగా చెప్తు న్నాను... ఏ అఘాయిత్యమూ చెయ్యను జీవి తంలో ఇంకమీదట. చేయవలసిన అవసరం మరి లేదు... మీరు వెళ్లండి. చూడండి... రాత్రి మీరు "ఐ లవ్ యు'' అన్నారే? నిజంగా మీలో ఆవగింజంతన్నా నామీద- ప్రేమకాదు- అభి మానం అన్నది వుంటే, మళ్ళీ ఈ కళ్లకు మీరు కనిపించకండి... వెళ్ళిపోండి. కాని ఒక్క సాయం మటుకు చెయ్యండి ఆఖరిసారిగా... అక్కడ మీ క్లినిక్‌లో నా నంచీ, మూటా వున్నాయి... ప్రపంచంలో ఉన్న సర్వస్వమూ అవే! అందులో మా అమ్మఫొటో, నా చిన్నత నపు ఫోటోలు వున్నాయి. అవన్నీ ఎవరిచేత నైనా స్టేషన్ దగ్గరకు పంపండి. అక్కడ జిగ్నీ అనే మావృత్తివాళ్ళ నాయకురాలికి అప్పజెప్పే





ఏర్పాటు చెయ్యండి. అంతే... నేను మిమ్మల్ని చివరిసారిగా కోరుతుంది. మీరిన్నాళ్ళు నా మీద చూపించిన దయకూ, జాలికీ, వైద్యానికీ, పూర్తిగా బాకీ చెల్లించేశాను. ఇప్పుడింకా బాల న్స్ షీట్‌నిల్... నిల్... నిల్... నిల్... ''

''నిల్'' అన్నమాట అంతకంతకూ తక్కువ స్థాయిలో అంటూ చివరకు చప్పుడు కాకుండా పెదవులు మాత్రమే కదిలిస్తూ నెమ్మదిగా వెళ్ళి మంచం మీదకి వాలిపోయింది.

ఒకసారి ఊపిరి లోపలికిపీల్చి గట్టిగా వది లాడు చంద్రం. కొద్దిక్షణాలు ఆమె వైపే చూస్తూ ఉండిపోయి ఏదో అనబోయాడు. అంతలో ఆ పరిస్థితిలో తాను ఏమన్నా మరింతమంట రగుల్తుంది తప్ప ఆరదని అనిపించి, ఆగిపోయి నెమ్మదిగా అన్నాడు- ''నీ చివర కోరిక నెరవేర్చమన్నావు... అలాగే చేస్తాను. కాని నాదీ ఒక చివరి కోరిక నువ్వు మన్నించాలి. నేనిప్పుడే వచ్చి ఆఖరిసారిగా ఒక ఇంజక్షన్ ఇస్తాను... నువ్వు మధ్యాహ్నం వరకు నిద్రపో. లేచి భోజనం చేసి నేనిచ్చే టాబ్లెట్ వేసుకుని పడుకో ... సాయంత్రం నాలుగులోగా వస్తాను... నీ సామాన్లతో- అప్పటికీ నువ్వు క్లినిక్ రావడానికి ఒప్పుకోకపోతే స్వయంగా నేనే నిన్ను స్టేషన్ దగ్గర దిగబెడతాను... ఇంతే నేకోరేది''

అతనితో అంతవరకు అన్న మాటలతో పూర్తిగా గాలిపోయిన రబ్బరు బూరలా అయిన మనస్సుతోఉన్న ఆమెకొద్దిక్షణాలు మౌనంగా ఉండి ఆ తరువాత నెమ్మదిగా అంది.

''ఇంజక్షన్ ఇవ్వండి, మాత్రా ఇవ్వండి నాకూ కొంత సేపు ఏ ఆలోచనా లేకుండా నిద్రపోవాలని ఉంది. కాని మీరు మటుకు మరి రాకండి... వీలయితే కారు పంపండి లేకపోతే లైను బస్సులో నేనే వెళ్తాను స్టేషన్‌కి మీరు మటుకు మరి నా కళ్లపడకండి... పడకండి... పడకండి'' మళ్లీ అంతకంతకూ తగ్గు స్థాయిలో చివరి మాట అంటూ చివరకు గొంతు మూగబోయినట్లుగా పెదవులు కదిలిస్తూ వుండిపోయింది ఆమె.

''సరే... వస్తాను'' అని నెమ్మదిగా అడుగులలో అడుగులు వేసుకుంటూ గుమ్మం వైపునకు నడిచాడు అతడు.

ఆమె తల పైకెత్తి అతనివైపు తిరగబోయి మళ్లీ ఆగిపోయింది.

అతడు తలుపులు తెరచి, పరదాలు సరిగా లాగి గడపదాటి అవతలకు వెళ్లి నిలబడ్డాడు కొంత సేపు...

లోపలి నుండి ఆమె గొంతు సన్నగా వినవస్తున్నది. చెవులు రిక్కించి విన్నాడు.

''వెళ్లిపోయారు... మీరు నా మనస్సును పూర్తిగా మీదిగా చేసుకుని, శాశ్వతంగా నన్ను మీదానినిగా చేసుకుని ఉంటే నా అంతట నేనే ఈ ఒళ్లు, ఈ అందం అంతా మీకప్పగించి వుండేదాన్ని కాని....కాని... కాని...'' అంతకంతకూ స్థాయి తగ్గిపోయి మరే మాటలూ వినరాలేదు అతనికి.

నెమ్మదిగా తలుపులు దగ్గరకులాగి అక్కడ ఒక పక్కగా వున్న స్విచ్ నొక్కాడు చంద్రం. రాధేశ్యాం ఒక మూడు నిముషాలలో వచ్చాడు అక్కడికి. అతనిని దూరంగా తీసుకువెళ్లి ఏదో రహస్యంగా మాట్లాడి వెళ్లిపోయాడు అతడు.

రాధేశ్యాం ఆ స్విచ్ నొక్కగా రింజీ అయిదు నిముషాలలో వచ్చింది. ఆమెతో గుసగుసలతో ఏదో చెప్పి రాధేశ్యాం వెళ్లిపోయాడు. ఆమె గుమ్మం దగ్గరగా ఒక కుర్చీ లాగుకుని కూర్చుంది, ఒక అరగంటలో చంద్రం తిరిగివచ్చేటంత వరకూ.

★ ★ ★

చంద్రం లోపలికి వచ్చినప్పుడు ఆమె బట్టలు కట్టుకుని పేము కుర్చీలో కూర్చుని వుంది.

కిట్ నుండి ఇంజక్షన్ సరంజామా అతడు పైకితీస్తుండగా ఆమె తన జాకెట్టు కుడిచేతిని పైకెత్తి పెట్టి వుంచింది.

ఇంజక్షన్ ఇచ్చి, టాబ్లెట్ ఒకటి బల్లమీద పెట్టి ''భోజనం చేశాక వేసుకో... ఇక రెండు నిముషాల్లో టిఫినూ, కాఫీ వస్తుంది. అది తీసుకోకపోతే వికారంగా అయి వాంతి కావచ్చు ఆ తరువాత పడుకో.''

ఆమె జవాబివ్వలేదు.

తన కిట్ సర్దుకుని ''వస్తాను'' అన్నాడు.

అప్పటికీ ఆమె ఏమీ మాట్లాడలేదు.

అతడు వెళ్లిపోయాడు.

★ ★ ★

సరిగా నాలుగు గంటలకు శ్రీబజరంగబలీ లాడ్జింగ్ కాబిన్‌లో బెల్ మోగింది. మధ్యాహ్నం ఏదో పేరుకు మటుకే భోజనం ముగించి, డాక్టరు చంద్రబాబు ఇచ్చిన టాబ్లెట్లు వేసుకున్న ఆ వ్యక్తిమీద ఆ మందు ఏ ప్రభావమూ చూపించలేదు. మేలుకునేవున్న ఆమె వెళ్ళి వెంటనే తలుపు తీసింది. గుమ్మం దగ్గర నిలబడి ఉన్న రింజీ అంది— "కారు ఇప్పుడే వచ్చి మీకోసం సిద్ధంగా వుంది. ఎప్పుడు మీకు వీలయితే అప్పుడు బయల్దేరవచ్చు".

"డ్రైవర్ వచ్చాడా? లేక... ..."

ఆమె ఆ ప్రశ్న పూరిచేయకుండానే రింజీ అంది "డ్రైవరే వచ్చాడు".

గట్టిగా ఊపిరి పీల్చి వదిలి— "ఒక్క పావుగంటలో వస్తున్నానని చెప్పండి"

"చిత్తం" రింజీ వెళ్ళిపోయింది.

ఆమె తలుపు గడియపెట్టి లోపల అలా అక్కడే ఆనుకుని ఒక నిముషం నిలబడి ఆతర్వాత బాత్‌రూం లోనికి వెళ్లింది.

★ ★ ★

కారు దారిలో టైరు బర్స్టు కావడంతో కొంత ఆలస్యమై ఎనిమిది దాటాక రాజమండ్రి చేరుకుంది. పెద్ద స్టేషన్‌కు ఫర్లాంగు దూరంలోనే కారు ఆపమని కామిని అన్నప్పుడు డ్రైవర్ అన్నాడు "స్టేషన్‌కు తీసుకువెళ్లమన్నారు: చిన్నబాబుగారు"

"వద్దు వనుంది... ఇక్కడే దిగుతాను"

డ్రైవరు మరి మాట్లాడకుండా కారు వక్కకు తీసి స్ట్రీట్‌లైట్‌దగ్గర ఆపి వెనుకవైపు తలుపు తెరిచాడు. కామిని దిగి రోడ్డు వారగా నిలబడింది. అతడు వెళ్లి డిక్కీ తాళం తీసి ఆమె సామాన్ల మూటా, గోనెసంచీ ఆమె వక్కగా పెట్టి జేబులో నుండి ఒక సీల్లు వేసివున్న లావుపాటి కవరుతీసి ఆమె వైపు చేయిజాపి అన్నాడు "చిన్నబాబుగారు ఇదిమ్మని చెప్పారు"

తటపటాయిస్తూ దాని వైపు కొన్ని క్షణాలు చూసి, చివరకు చేయిజాపి అందుకుంది అది ఆమె.

డ్రైవరు ఏదో అనబోయి పెదవులు కొద్దిగా తెరిచి మళ్లీ అంతలో ఏమనుకున్నాడో అనదలచుకున్నది అనకుండా ఊరికే "వస్తాను" అని మటుకు అని కారు స్టార్ట్ చేసుకుని వెళ్లిపోయాడు.

ఆ కారు కళ్లకు కనబడుతున్నంత దూరంగా దానివైపే చూస్తూ, చివరకు నిట్టూర్చి అక్కడే బట్టల మూటమీద కూర్చుని సీల్లు విప్పి కవరులోని కాగితాలుపైకి తీసింది. పైని కవరేలావుగా ఉంది కాని లోపల వున్నవి రెండే కాగితాలు. పదివేల రూపాయలకు బాంక్ డ్రాఫ్ట్ ఒకటీ, ఒక చిన్న ఉత్తరం. ఆ రెండు కాగితాల మధ్య ఒక వంద రూపాయల నోటు వుంది. బాంక్ డ్రాఫ్ట్ ఎప్పుడూ చూడని ఆమె దాన్ని అటూ ఇటూ తిప్పి చూసింది. "స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, మెయిన్ బ్రాంచి, రాజమండ్రి" అని, మిస్.చంద్రరేఖకు పదివేల రూపాయలు ఇవ్వవలసింది అనీ ఉంది. అడుగున ఎవరిదో సంతకమూ స్టాంపూ వుంది. ఒక మూలగా రెండు గీతలు ఎడంఎడంగా పెట్టి ఆమధ్యను ఏ/సీ అన్న అక్షరాలు, ఆ తరువాత ఏదో ఆమెకు బోధపడని మాటా ఆ వక్క ఓన్లీ అన్న మాటా వున్నాయి. తన పేరట పదివేల రూపాయలకు చెక్కు వంపాడు డాక్టర్ చంద్రబాబు అన్నది ఆమెకు బోధపడింది. ఆ డ్రాఫ్టూ, డబ్బూ ముందు చింపివేయబోయి మధ్యను వాటిని పట్టిన వేళ్లు అలాగే ఆగిపోగా వాటివైపే కొన్ని క్షణాలు రెప్పలార్చకుండా చూసి చివరకు నిట్టూర్చి వాటిని జాకెట్టు లోపలి నుండి పర్సు తీసి అందులో మడతలుగా చేసిపెట్టింది. పర్సులో నుండి ఏభైరూపాయల విడినోట్లు తీసి బొడ్డున జాగ్రత్తగా దోపుకుని పర్సు మళ్లీ జాగ్రత్తగా లోపల పెట్టుకుంది. ఆ తరువాత ఆ లోపల ఉత్తరం చదివింది. కళ్లు కొద్దిగా చెమరించినా పెదవుల మీద మటుకు జాలిగొలిపే నన్నని చిరునవ్వు కదలాడింది. ఆ ఉత్తరమూ పర్సులో దాచింది.

మామూలు దారిన తిన్నగా స్టేషన్‌కువెళితే తనవృత్తివాళ్లు బీట్లువేసి ఉండేచోట్లు తగులుతాయి. వాళ్లెవరినీ కలుసుకోకూడదని మధ్యాహ్నం నిర్ణయించుకుంది ఆమె. అక్కడ ఒక




 **KORA** 

కిరాణా దుకాణందగ్గరవున్న తెలిసిన కూలీవాడిని పిలిచి అడ్డదారిని రైల్వేక్వార్టర్సు మధ్య నుండి వెళ్లి రైలుపట్టాలు దాటుకుని, బెజవాడకు రాత్రి తొమ్మిదిన్నరకు వెళ్లే రైలు ఆగే ప్లాట్‌ఫారంమీద తన సామాన్లు పెట్టడానికి మాట్లాడుకుంది.

ప్లాటుఫారం చేరుకున్న ఆమె అతడిని సామాన్లు చూస్తుండమని చెప్పి వెళ్లి ఒంగోలుకు టిక్కెట్టు కొనుక్కునివచ్చి ఆ కూలీ మనిషికి అనుకున్నదానికన్నా ఒక రూపాయి ఎక్కువ ఇచ్చింది. అతడు "రూపాయెక్కువిచ్చి నావు కావినమ్మా!" అని వావను ఇవ్వబోగా "వద్దు - కావాలనే ఇచ్చాను- సామాన్లు చూసినందుకు... వుంచుకో" అంది.

"ఎన్నమనను నీది! ఇలాటిరీతిలో ఉండాల్సినదానివికాదు! ఏమిటో బగమంతుడిలీల! ఒత్తానమ్మా!" అని వెళ్లిపోయాడు ఆమనిషి.

★ ★ ★

తొమ్మిదిన్నరకు రావలిసిన రైలు మూడు గంటలు ఆలస్యంగా వచ్చింది.

అది బెజవాడ చేరుకునేటప్పటికి తెల్లవారిపోయింది.

అక్కడ ఒకకప్పు కాఫీతాగిన తర్వాత బాత్ రూంకు వెళ్లి పర్సు పైకితీసింది. అందులోని ఉత్తరం తీసుకుని పర్సు మళ్లీ జాకెట్టుకు లోపలవున్న చిన్న జేబులో పెట్టుకుని పైకి వచ్చింది. తన సీటులోకివెళ్లి కూర్చొని ఆ ఉత్తరం మడతవిప్పి రెండవసారి చదివింది.

"రేఖా...కారులో నేనే వద్దామనుకున్నాను. కాని రాత్రి జరిగిందంతా ఆలోచించిచూడగా చివరకు నువ్వు చెప్పినట్లు చేయడమే సబబు అనిపించింది. నీకూ, నాకూ...అందరికీ...అదే మంచిదారి అనిపించింది.

"రాత్రి అలా ప్రవర్తించింది నేనుకాదు...నాలోని పశుత్వం...ఏమైనా ఈ నీచుణ్ణి క్షమించు.

ఒక రత్నాన్ని తాత్కాలికమైన ఉద్రేకంలో పోగొట్టుకున్నందుకు ఎంత బాధపడుతున్నానో. నీ సునిశ్చితమైన మనస్సును సరిగా అర్థంచేసుకుని దాన్ని పూర్తిగా నాదిగా చేసుకోవటం చేతకాకపోయింది నాకు...దురదృష్టవంతుడిని...

ఏమైనా ... జరిగిపోయిన గడియలను వెనక్కుమళ్లించి మరొక దారిన నడవలేము.

పదివేల రూపాయల డిమాండ్‌డ్రాఫ్ట్ పెడుతున్నాను. దానితో నువ్వే ఊళ్లో ఉన్న ఏ బాంకులోనైనా నీపేరిట అక్కౌంట్‌తెరువు. ఎప్పుడు ఎంత కావాలంటే అంత నీవు అందులోనుంచి తీసుకో. ఒక వందరూపాయల నోటు కూడా పెడ్తున్నాను.

ఈ డ్రాఫ్టునూ నోటునూ నామీదికోపంతో చింపిపారెయ్యకు. ఒకవేళ చింపిపారేస్తే ఆ విషయం నాకెలాగూ తెలియదు...ఆ డబ్బు మరి నాకు తిరిగిరాదు.

రాత్రి అనుభవానికి ఈవిధంగా విలువకడ్తున్నానని ఎన్నడూ అనుకోకు. ఆ అనుభవానికి సిగ్గుపడుతున్నానుతప్ప ఏ ఆనందమూ, సంతోషమూ కలగటంలేదు నాలో, అది తలచుకుంటే.

ఎందుకలా నాలోని రాక్షసత్వం పైకివచ్చిందో రాత్రి, అనుకుంటే కంపరం పుడుతున్నది! నిజం, నామాట నమ్ము. ఏమిటో - వెర్రిగా ఏదో రాస్తున్నాను-మరి రాయను..."

నిన్న రాత్రి కళ్లు కొద్దిగా చెమర్చాయికాని ఇప్పుడుమటుకు ఆ కళ్లవెంట తదేకధారలుగా నీళ్లుకారడం మొదలుపెట్టాయి. ఒకచుక్క ఉత్తరంమీద పడింది-దాన్ని చెరిపివేద్దామా అన్నట్లుగా.

మరి కన్నీళ్లు ఆ కాగితంమీద పడకుండా మడతపెట్టి, కళ్లు తుడుచుకుని బాత్‌రూంకు మళ్లీ వెళ్లి ఆ ఉత్తరం దాస్తున్నప్పుడు హఠాత్తుగా ఒక ఆలోచన వచ్చింది.

ఒకవేళ నిన్న సాయంత్రం కారులో డ్రైవరు కాక అతడే స్వయంగావచ్చి ఈమాటలు అని వుంటే, తాను మళ్లీ ఆ క్లినిక్‌కువెళ్లి వుండేదా?

అక్కడే నిలబడి మరొకసారి చదవడం మొదలుపెట్టింది. మొదటి పేరా చదవగానే ఆమె పెదవులు బిగించుకున్నాయి. ఆ మాటలు అతడు అనివుంటే తాను అక్కడికి మరి వెళ్లడం జరిగివుండేదికాదు. కాని...కాని...

ఆ మాటలు అనకుండా తక్కిన మాటలు అనివుంటేమటుకు.......

తాను తిరిగివెళ్లి వుండేదా?




తప్పకుండా వెళ్లివుండేది...

ఊహూ...వెళ్లి వుండేదికాదు...

వెళ్లి ఉండేది...వెళ్లి ఉండేదికాదు...

ఏమో!
నిట్టూర్చి పైకివచ్చింది ఆమె.

★ ★ ★

ఉదయం ఆరున్నర అయింది.

ఒంగోలు స్టేషన్‌కు అరఫర్లాంగు దూరంలో వున్న బజారులో ఒక టీదుకాణంలో గాదెపాయ్యి వెనుకనిలబడి కెటిల్‌నుండి ఆపక్కనేవున్న టేబుల్‌మీది గ్లాసులలో టీనింపి అవి తీసుకువెళ్లి అక్కడ ఉన్నవాళ్లకు ఇచ్చి, గల్లాపెట్టెముందు కుర్చీలో నెలలునిండివున్న రేఖ భారంగా కూర్చోబోతుండగా లోపలి తడికగది లోనుండి పైకివచ్చిన మంగపతి ఆమెతో ఆప్యాయంగా అన్నాడు- "నేకూర్చుంటాలే అమ్మడూ! నువ్వలా ఒకసారి తిరిగిరా! డాక్టరమ్మ రోజూ నడవమన్నారుకదూ?"

"అప్పుడే స్నానమయిపోయిందా బాబాయి?" అంది ఆమె కుర్చీలో కూర్చోకుండా అతనివైపు తిరిగి.

"అయిపోయిందమ్మా...ఎక్కువ దూరం వెళ్ళకు. స్టేషన్‌కివెళ్లి గేటుపక్కనే బెంచీమీద కొంతసేపు కూచుని తిరిగిరా" అంటూ ఆమెపక్కకు తప్పుకోగా గల్లాపెట్టిదగ్గర కూర్చున్నాడు అతడు. అరవైఅయిదేళ్లు నిండినవాడైనా దబ్బపండు ఛాయశరీరంతో, పెద్ద పెద్ద మీసాలతో ఎక్కడా ముడతలులేకుండా ఎప్పుడూ చిరునవ్వు చిందులాడుతున్నట్లుగానే కనిపించే మొహంతో, ఏభైఏళ్ళవాడిలాగే కనిపిస్తాడు మంగపతి. కాని అతనికి గుండెజబ్బు ఉంది. మొదటిసారి కొద్దిగా, రెండవసారి చాలాఎక్కువగా వచ్చి ఎలాగో గండంగడిచి బయటపడిన మనిషి అతడు. రెండవసారి జబ్బు వచ్చినప్పుడు రేఖ అతనిని తీసుకువెళ్లి పెద్దాసుపత్రిలో చాలా డబ్బు ఖర్చుపెట్టి బతికించుకుంది.

ఈ తొమ్మిది నెలలుగా మంగపతే ఆమెకు జీవితంలో ఆసరాగా దొరికాడు.

ఆరోజు ఒంగోలు స్టేషనులోదిగిన రేఖ ఎక్కడన్నా చాకిరీ దొరుకుతుందేమో అని ప్రయత్నిస్తున్నప్పుడు ఆ బజారులో టీదుకాణం నడుపుతున్న మంగపతి తగిలాడు. లోగడ విధవ అయిన అతని కుమార్తె సాయపడుతూ వుండేది. ఆమె సంవత్సరం కిందట పోయిన తర్వాత సరిఅయిన పనిమనిషి దొరకక ఇబ్బందిపడుతున్నాడు. అతని వ్యాపారం ప్రస్తుతం మందకొడిగా వుంది. ఈమధ్యనే ఒక పనికుర్రవాడు ఇరవైరూపాయలు దొంగిలించి అక్కడినుండి పారిపోయాడు.

అక్కడికి వెళ్లిన ఆమెను అల్లంతదూరంలో చూడగానే అతనికి చనిపోయిన తన కుమార్తె పోలికలు కొద్దిగా ఆమెలో కనిపించి ఆశ్చర్యంగా దుకాణంముందుకు వచ్చి ఆమెను చూస్తూ నిలబడ్డాడు. ఎత్తూ రంగూ ఒకటేగాని మొహంలోమటుకు తన కుమార్తెకూ, ఆమెకూ తేడా కనిపించింది అతనికి.

నిండుయౌవనంలో భర్తను పోగొట్టుకున్న తన కుమార్తెలో ఏవోతీరని కోరికలఛాయలు గూడుకట్టుకుని, అవి చివరకు చిరాకుముడతలుగామారి ఆమె మొహం ఎప్పుడూ ధుమధుమలాడ్తూ ఉండేది. సౌమ్యత అన్నది ఆమెలో ఏకోశానా కనిపించేదికాదు. కాని రేఖ మొహంలోమటుకు సౌమ్యత, సహనశీలత్వం అతనికి గోచరించాయి.

అప్పటికప్పుడు రేఖ కల్పించి చెప్పిన అబద్ధపు గతజీవితచరిత్ర అంతా సానుభూతితో విన్నాడు అతను. తన పేరు విమలగా మార్చి చెప్పిందామె.

తన భర్తా, అత్తగారూ తాను తగినకట్నం తేలేదని తనను యమయాతనలు పెట్టేవారనీ, వారంకిందట వాళ్లిద్దరూ తననుకొట్టి మెడలోని బంగారు మంగళసూత్రాలుతెంపి తీసుకుని ఇంటినుండి గెంటివేశారనీ, తల్లిలేని ఆమెను అన్నా వదినా పుట్టింటి గడపలోనికి రానివ్వలేదనీ, జబ్బు మనిషి అయి మతిస్థిమితంగా లేని తన తండ్రి వాళ్ల దురుసుతనానికి అడ్డుపడలేకపోయాడనీ, అందువల్ల తాను ఏదో చాకిరీచేసి బతకదలుచుకుని ఈ పట్టణం చేరుకున్నాననీ చెప్పింది ఆమె- ఇంకా ఏవేవో చిలవలూ పలవలూ కల్పించి.

పనిమనిషి అత్యవసరంగా ఉండటంవల్లనేమి, ఆమె తన కుమార్తెలా కనిపించడంవల్ల

నేమి ఆ పూట నుండే ఆమెను తన హొటలులో పనికి కుదుర్చుకున్నాడు మంగపతి.

తాను గర్భవతి అని తెలియవచ్చింది విమలకు త్వరలోనే. అది విన్న ఆమె పెదవులమీద జాలిగొలిపే చిరునవ్వు కదలాడింది. డాక్టరు రాసిచ్చిన ప్రిస్క్రిప్షన్‌తో దుకాణానికి తిరిగివచ్చిన ఆమె ఆరోజంతా పరధ్యానంగా ఉండటం చూశాడు మంగపతి. రాత్రి ఆరుబయట తాను మంచంమీద పడుకుని వుండగా పక్కకు కుర్రకుర్చీలో కూర్చున్న ఆమెను కారణం అడిగాడు మంగపతి. "ఎందుకమ్మా... అలా పరధ్యానంగా ఉన్నావు మధ్యాహ్నంనుండీ?"

ఈ రెండు నెలలలోనే వారిమధ్య యజమానీ, పనిమనిషీ అన్న భావన కాకుండా తండ్రీకుమార్తెల మధ్య ఉండే అనుబంధం పెరిగింది.

"బాబాయి- ఒక విషయం చెప్తాను, ఏమీ అనుకోవు కదూ?"అని నెమ్మదిగా అడిగింది.

"చెప్పమ్మా నాకన్న కుమార్తెవు నువ్విప్పుడు" అన్నాడు మంగపతి.

"ఆరోజు పనిలో చేరే ముందు నీకబద్ధం చెప్పాను బాబాయి.... నా అసలు కథ అది కాదు...."

వింతగా ఆమె వైపు చూసి అన్నాడు అతడు "మరి?"

అప్పుడు ఏదీ దాచకుండా తనకు జ్ఞానం వచ్చినప్పటి నుండి ఒంగోలు స్టేషన్‌లో దిగేవరకూ జరిగిన తన గతజీవిత చరిత్ర అంతా పూసగుచ్చినట్లుగా అతనికి చెప్పింది చాలా రాత్రివరకు.

మధ్యలో లేచి కూర్చున్నాడు అతను ఆశ్చర్యంగా వింటూ.

అంతా చెప్పిన తరువాత ఎప్పుడూ జాకెట్టులోనే పెట్టుకుని ఉండే పర్సు తీసి, పది వేల రూపాయల డ్రాఫ్టూ, చంద్రం ఉత్తరమూ అతనికి ఇచ్చింది విమల.



అవి తీసుకువెళ్లి అక్కడ పాకనడుమ రాటకు కట్టిన లాంతరు హెచ్చించి కళ్లజోడు పెట్టుకొని పరీక్షగా చూసి అన్నాడు మంగపతి ఆశ్చర్యంగా: "అదృష్టవశాత్తూ ఇంకా టైం అయిపోలేదు ఈ డ్రాఫ్టుకి. నెల పైగా ఉంది మార్చుకోడానికి! అయినా ఇంత డబ్బున్నదానివి ఈ బీద హోటలులో పిండి రుబ్బుతూ, కప్పులు కడుగుతూ పని చేస్తున్నావా? నువ్వు మరేదో లోకానికి సంబంధించిన మనిషిలా ఉన్నావు తల్లీ? నీ జరిగిపోయిన బతుక్కి నీ తప్పేమిటుంది? నిజంగా చాలా గొప్పగా నడుచున్నావు" అని కళ నెంబడి. ఏదో అభిమానంతో కన్నీళ్లు జారుతుండగా ఆమె తల మీద చేయిపెట్టి, "నేనున్నంతకాలం నీకేం లోటు రానివ్వను అమ్మడూ! మా పిల్లను అలాగే పిల్చేవాణ్ణి- ఇవాళ్టి నుండి నిన్నూ అలాగే పిలుస్తాను" అని డ్రాఫ్ట్, ఉత్తరం ఆమెకిచ్చి "నాకు స్టేట్ బ్యాంక్‌లో అకౌంట్ ఉందమ్మా! రేపే నిన్ను తీసుకువెళ్లి నీ పేరట అక్కౌంటు ఓపెన్ చేయించి ఈ డబ్బు అందులో జమ అయ్యేలా చూస్తాను" అన్నాడు.

తన జబ్బుకు ఆమె డబ్బు ఖర్చు పెట్టినప్పుడు ముందు వద్దన్నాడు. కాని ఆమె బలవంతాన చివరకు ఆ ఖర్చుకు ఒప్పుకోక తప్పలేదు. అప్పటినుండి ఆమె ఖర్చుపెట్టిన వెయ్యి రూపాయల చిల్లర బాకీకింద తనకు వచ్చే ఆదాయం నుండి నెలకు యాభై ఆమె అక్కౌంట్‌లో జమచేస్తున్నాడు ఆమెకు తెలియకుండా. బ్యాంక్ అక్కౌంట్ మాత్రం రేఖ పేరు మీదనే నడుస్తూంది.

ఆమె గర్భవతి అని తెలిసిన రోజు నుండి ఆమెను ఎక్కువ పని చేయనివ్వకుండా చూసుకునేవాడు మంగపతి. ఆమె వచ్చిన దగ్గర నుండి బేరాలు బాగా పుంజుకోవడంతో నాలుగైదు నెలలుగా కష్టమైన పనులు చేయడానికి ఒక పని మనిషినీ, కప్పులూ అవి కడగడానికి ఒక పనికుర్రవాడినీ పెట్టుకున్నాడు.

విమల ఇప్పుడు చేస్తున్న పనల్లా అప్పుడప్పుడు టీలూ, టిఫిన్లూ అందరికీ ఇవ్వడమూ, గల్లాపెట్టె దగ్గర కూర్చుని బిల్లుల డబ్బు అందుకోవడమూ.

ప్రతి నెలా లేడీ డాక్టర్‌చేత పరీక్ష చేయించుకుని మందులూ, ఇంజక్షనులూ తీసుకుంటున్నది. ఆమె తన పాత జబ్బు గురించి ఏదీ దాచకుండా చెప్పింది డాక్టరుకు ముందుగానే. ఈ మందుల ఖర్చుఅంతా బ్యాంకులోని డబ్బు నుండే పెడుతున్నది. తక్కినవన్నీ మంగపతే చూసుకుంటున్నాడు. ఆమె తిండీ, బట్టా మొదలైన వాటికోసం — ఆమె తన సొంతానికి బాంకు డబ్బు ఏనాడూ వాడటం లేదు... అది పుట్టబోయే సంతానం కోసమే ఖర్చు పెట్టదలచుకుంది ఆమె.




ఆది పుష్యమాసం.

విమల బిడ్డ "దశమి"కి ఇప్పుడు నాలుగు నెలలు నిండబోతున్నాయి.

ఆ పాపలో చంద్రం పోలికలు స్పష్టంగా గోచరిస్తున్నాయి.

ఆరోజు క్లినిక్‌కు తాను తిరిగి వెళ్లివుంటే ఏమైవుండేదో అన్న ఆలోచన అప్పుడప్పుడు వస్తూవుంటుంది విమలకు.

సంక్రాంతి పండుగ గడిచి వారంరోజులైంది. ఆరోజు శనివారం. పక్కనే ఒక చిన్నపాకలో లాండ్రీ వుంది. ఇస్త్రీ చేయడానికి ఇచ్చిన బట్టల విషయంలో ఆ లాండ్రీ మనిషి పేరయ్యకూ, ఒక స్టూడెంటుకు పేచీ మొదలై వాళ్లిరువురూ కొట్టుకునేంతవరకూ వచ్చింది. పేరయ్య ఆగ్రహావేశంలో ఆ స్టూడెంటును ఒక రాయితో కొట్టగా అది అతని చెవికి తగిలి నెత్తురు కారింది. మంగపతీ, తక్కిన మరికొంత మంది దుకాణాదార్లూ ఎలాగో సమాధానపరిచి ఆ స్టూడెంటును పంపించేశారు.

అయితే ఆ రాజుకున్న మంట అక్కడతో చల్లారలేదు. ఆ రాత్రి ఒంటిగంటకు స్టూడెంట్ మూకవచ్చి పేరయ్యను చితకకొట్టి,

అతని భార్యను అవమానించి ఆ లోపలవున్న బట్టలన్నీ పైకి తీసుకువచ్చి, రోడ్డుమీద పోగు పెట్టి నిప్పంటించి పారిపోయారు. ఇంతలో హఠాత్తుగా సుడిగాలి వచ్చి కాలుతున్న బట్ట లలో ఒకటి రివ్వున ఎగిరివెళ్లి అక్కడికి వందగ జాల దూరంలోవున్న ఒక పాకమీద పడింది. నిప్పంటుకుని మంటలు రేగాయి. మంగవతీ, ఆ బజారులో తక్కిన మనుమలూ వెళ్లి ఆ మంటలు పక్కఇళ్లకు సోకకుండా అతిక ష్టంమీద ఆపారు. ఫైరింజన్ రావడంతో ఆ ఒక్క పాకమటుకే బూడిదఅయి అంతటితో ఆగిపోయింది.

పోలీసులూ వచ్చారు. ఆ తెల్లవారుఝామున పేరయ్యనూ, మంగవతినీ, మరికొంతమందినీ పిలిచి స్టేట్‌మెంట్లు తీసుకున్నారు.

అప్పటికి బాగా తెల్లవారింది.

పోలీసులతో ఎప్పుడూ మంచిగా వుండే మంగవతి వాళ్లకోసం టీ తయారుచేసి తన దుకాణానికి వాళ్లని పిలుచుకు వచ్చాడు.

మంగవతి టీ దుకాణంముందు రెండు కుర్చీలు, ఒక బెంచీమీద ముగ్గురు పోలీసు కానిస్టేబుళ్లూ, హెడ్‌గారూ, సబ్‌ఇన్‌స్పెక్టరుగా రూ కూర్చున్నారు. రాత్రి చేసివుంచిన పకోడీ లూ, సమోసాలూ అయిదు ప్లేట్లలో విమల సర్దిఇవ్వగా మంగవతి స్వయంగా ఆ అధికారు లందరికీ అందించాడు. ఆపూట పనివాళ్లు రాలేదు. ఆదివారం ఉదయం సెలవు. సబ్‌ఇ న్‌స్పెక్టర్ నాగేశం అంతకుముందు ఏదో ఊళ్లో హెడ్డుగా వుండి ఒక నెలకిందట ప్రమోషనై ఆ పట్టణానికి బదిలీఅయి వచ్చినవాడు. కొత్తగా వచ్చిన అధికారి కావడంవల్ల అతనికి హెడ్‌కా నిస్టేబుల్ మంగవతి గురించి వివరించి చెబు తున్నాడు. మంగవతి ఆ ఊళ్లో పదేళ్లకుపైగా వుంటున్నాడనీ, చాలా నమ్మకమైనవాడనీ, ఆ ఊరి బాడ్‌కారెక్టర్స్ గురించి,కొత్తగా స్టేషన్‌లో దిగి ఆ బజారులో తచ్చాడే అనుమానాస్పదు లైన మనుమల గురించీ తనకు తెలిసినంతవ రకు బోగట్టా పోలీసువాళ్లకు అందజేస్తాడనీ చెప్పాడు ఆ హెడ్డు.అలా చెప్పడం వింటున్న మంగవతికి పొంగిపోయినట్లుగా అని పించింది. లోపలికి వెళ్లి మరిన్ని పకోడీలూ, సమోసాలూ తెచ్చి నాగేశం ప్లేట్లోనూ, హెడ్డు లతీఫ్ ప్లేట్లోనూ వద్దంటున్నా వేసి ఆ వెనుక తక్కిన ముగ్గురు కానిస్టేబుల్సుకు కూడా ఇచ్చా డు.

ఆ ప్రత్యేకమైన మన్ననకు సంతోషం పొందిన లతీఫ్ అక్కడ గాడిపొయ్యి ముందు నిలబడి టీపొడి వున్న గుడ్డమూట మరుగుతూ న్న నీళ్లలో ముంచుతూ పైకెత్తుతూన్న విమల ను గమనించి నాగేశంతో అన్నాడు-

"అసలు మనిషిగా కూడా మంగవతిగారు చాలా దయగల మనస్సువాడండి. అనాథల ను ఆదుకోవడంలో అతనిలాటివాళ్లు లేరు. అంతెందుకు ఆమధ్య పాపం భర్త తన్ని తరిమేసిన అమ్మాయొకతె వస్తే ఆమెను తన దుకాణంలో పెట్టుకుని కన్నకుమార్తెలాగే సాకు తున్నాడండి... పాపం రెండేళ్ల కిందట వాళ్ల మ్మాయి పోయింది. ఇప్పుడీ పెంపుడు కుమా ర్తెకు పురుడు కూడా వచ్చిందండి. ఆడపిల్ల నాలుగునెలలు" అన్నాడు. తన మంచితనం కొత్త ఎస్సైగారి దృష్టిలోకి బాగా వెళ్తున్నందుకు మరింతగా పొంగిపోయి విమల కలిపి వుంచిన టీ గ్లాసులలో మరింతగా పాలుపోసి ట్రేలో గ్లాసులన్నీ సర్ది స్వయంగా తీసుకెళ్లి వినయంగా అందించాడు మంగవతి.

తన పాతజీవితపు అనుభవాలతో పోలీసు లంటే ఒకరకమైన జుగుప్సా, అసహ్యాభావ మూ ఉంది విమలలో. మంగవతి వాళ్ళకోసం అంతగా ప్రత్యేకమైన శ్రద్ధ చూపించడం నచ్చ లేదు. ఇటువంటివాళ్ళు పాములాటివాళ్ళు, వాళ్ళతో ఎక్కువ స్నేహంగా ఉండకూడదు. పాలుపోసి పెంచిన చేతినే కాటువేసేవాళ్ళు అనుకొంటూ వెళ్లి గల్లాపెట్టె ముందు కూర్చుంది.

మంగవతిలాగే ఆమెకూ కొన్ని సెంటి మెంట్లు వున్నాయి. అందులో బోణీబేరం ఎప్పుడూ నగదు బేరమే అయి వుండాలి కానీ అరువుబేరం కాకూడదు అన్నది ఒకటి. ఇప్పు డు నడుస్తున్నది అరువుబేరం కూడా కాదు, చేతిడబ్బుల చెరువుబేరం. తను పాతవృత్తిలో నూ ఇటువంటి బేరాలతో రోజు మొదలైతే ఆ రాత్రి ఆదాయం అర్ధకి అర్ధ తగ్గుతుందనీ, ఆమె, ఆమె తోటివాళ్లూ అనుభవం వల్ల

అనుకుంటూ వుండేవారు. ఆరోజు ఆదివారం ఎలాగూ అర్థ బేరమే! ఆ అర్థలో మరొక అర్థ తగ్గుతుంది అని చిరాకు పడుతూవుంది ఆమె.

అప్పుడే ఉదయిస్తున్న సూర్యుడి ఎర్రని కాంతి ఆమె కూర్చున్న చోటుకి ఎదుటి వాటంగా వచ్చిపడుతూ బంగారురంగులో వుండే ఆమె ఒంటిఛాయను నారింజరంగుగా చేస్తూ అందంగా చూపెడుతోంది. ఆమె కట్టుకుని ఉన్న లేతపసుపురంగు చీరా, ముదరపసుపురంగు జాకెట్టూ, ఆ జాకెట్టులోపలి తెల్లని బాడీ, చెవులకున్న నకిలీ కెంపురాళ్ళ చెవుల పువ్వులూ, చేతిగాజులూ, మెళ్ళో ఉన్న పసుపు కొమ్ము తాడూ, పూసముత్యాలహారం అన్నీ ఆ అందానికి ఆ లేతబంగారు వెలుగులో మరింత మెరుగులుపెడుతున్నాయి. ఆ దృశ్యం ఏదో కలర్ సినిమాలో బీద పరిస్థితులలో అందంగా నీటుగా అలంకరించుకుని ఉన్న హీరోయిన్‌లా ఆమె రూపాన్ని సృష్టించేస్తున్నది.

టీ చప్పరిస్తూ లతీఫ్ నాగేశ్‌తో అన్నాడు: "అదిగోనండి... అక్కడా గల్లాపెట్టి దగ్గర కూచుంది, ఆ అమ్మాయేనండి - కష్టాల్లో ఉన్నప్పుడు మంగపతి ఆదుకుని సొంత కూతురిగా చేసుకున్న పిల్ల"

అక్కడ ఉన్న పోలీసులందరిలో తానే పెద్దకావడంవల్లా, అందులోనూ మొదటిసారిగా ఆ ఊళ్లో ప్రమోషన్ మీద ఎస్సైగా జాయిన్‌అవడంవల్లా కొద్దిగా అహంభావం, దర్పం నిండుకునివున్న నాగేశం ఠీవిగా, నవిలాసంగా మెడ తిప్పి గల్లాపెట్టె వైపు చూశాడు.

అక్కడ విమలను చూడగానే అతని కళ్ళు ఆశ్చర్యంగా మిలమిల మెరిశాయి. చూపులు మరల్చుకుని టీ తాగడం పూర్తిచేసి ఖాళీకప్పు పక్కనున్న స్టూలుమీద పెట్టడానికి అన్నట్లుగా నటించి కుర్చీ విమల బాగా కనిపించేలా తిప్పుకుని ఆమెవైపే పరకాయించి కొంతసేపు చూశాడు. అంతకుముందే వచ్చిన పత్రిక చదువుతున్న విమల అతనివైపు చూడలేదు.

హొటలుకు వచ్చిన ప్రతివాళ్ళూ పసిడిబొమ్మలా ఉన్న విమలను పరకాయించి చూడటం మంగవతికి బాగా అలవాటయిపోయింది. మొదట్లో తన దుకాణంలో అటువంటి అందమైన ఆమె ఉన్నదన్న ఆకర్షణలో మనుషులు ఎక్కువగా రావడం మొదలుకావడమూ, మందకొడిగా ఉన్న తన వ్యాపారం పుంజుకోవడం జరిగి కొంత సంతృప్తిపొందాడు, కానీ ఆతరువాత ఆమె తన సొంత కుమార్తెలాగే మారాక ఆమెను ఎవరైనా ఆకలి చూపుల్తో చూస్తే చిరాకుగా అనిపించడం మొదలుపెట్టింది. ఆమధ్య ఆమెకు ఆరునెలలు గర్భంరోజులలో ఎవరో కొంటెమనిషి ఆమెతో ఏదో అసభ్యంగా హాస్యం ఆడటం చూసిన అతడు ఆ మనిషిని కొట్టినంత పనిచేసి దుకాణం నుంచి గెంటివేశాడు. ఆరోజు రాత్రి విమల మృదువుగా అంది అతనితో: "చూడు బాబాయ్... నాకోసమని ఉదయం నువ్వెవరో ఆ తుంటరివెధవతో పేచీపడ్డావు. మనుమల నైజమే అంత! అనవసరంగా ఇలాంటివాటి నంతగా పట్టించుకోకు నువ్వు. నా పాతవృత్తి సంగతి నీకు తెలిసిందే. ఎవళ్ళెలా చూసినా, ఏమన్నా లక్ష్యపెట్టకపోవడం నాకు అలవాటయిపోయిందిలే"

"అప్పటి సంగతి వేరు అమ్మడూ... ఇప్పుడు నువ్వు ఈ మంగపతి కూతురివి..."

ఆమాటతో తృప్తిగా అనిపించిన విమల నవ్వి అంది: "అవునులే బాబాయి... అయినా ఇలాంటి పేచీలు అనవసర చికాకులు తెచ్చిపెడతాయి ఒక్కొక్కసారి"

కొత్త ఎస్సై విమలవైపు వింతగా చూడటం గమనించాడు హెడ్డుతోపాటు, మంగవతి కూడా. కొద్దిగా చిరాకుగా అనిపించింది కాని విమల ఆరోజు అన్న మాటలు జ్ఞాపకంవచ్చి సహించి ఊరుకున్నాడు.

లతీఫ్ మటుకు తనమీది అధికారి విలాసపురుషుడని అంతకుముందే విన్నవాడు కనుక విమలమీద అతని కన్నుపడటం చూసి, విమలను కాకపోయినా వీలయినప్పుడు ఇలాటి మరో మనిషిని తన బాస్‌కు ఏర్పాటుచెయ్యొచ్చు అవసరం వుంటే అనుకున్నాడు. అతనికి విమల గతచరిత్ర తెలియదు.

అతనికేకాదు, ఆ ఊళ్ళో ఎవ్వరికీ కూడా తెలియదు. అలా అజ్ఞాతంగా తెలియకుండా




# మీ బిడ్డల భవిష్యత్తును గురించికాక మీ ఆరాటం వేరేముంటుంది!



# మార్గదర్శి

మీ బిడ్డల భవిష్యత్తు తీర్చిదిద్దడానికి తలపెట్టే ప్రయత్నంలో ఆచితూచి అడుగువేయాలి. అందుకు లాభప్రదమైన సంస్థలో మీ డబ్బు పెట్టుబడి పెట్టండి. మీరు నిశ్చింతగా ఎంచుకోదగ్గ సంస్థ మార్గదర్శి ఒక్కటే.

మీ డబ్బుకు సురక్షిత దుర్గం మార్గదర్శి. ఎన్నో ఏళ్ళుగా తన ఎనలేని సేవలతో వేనవేల సభ్యులలో కలిగించిన అనంతమైన సంతృప్తి, అచంచల విశ్వాసం మార్గదర్శి నిజాయితీకి నిబద్ధతకు నిదర్శనం. ఆర్థిక పాటవంగల సభ్యుల్ని చేర్చుకోవటంలో మార్గదర్శి చూపే శ్రద్ధ సభ్యుల ప్రయోజనాలకు శ్రీరామరక్ష. సభ్యులందరి అభ్యుదయానికే ఈ అవిరళ కృషి.

ఈ అనన్య ప్రతిష్ఠ ఆర్జించడానికి మార్గదర్శి ఇరవైనాలుగు సంవత్సరాలు పరిశ్రమించి ఈనాడు యావద్దేశంలో అగ్రగామి చిట్‌ఫండ్ సంస్థగా పురోగమిస్తున్నది. అంచెలంచెలుగా ఎదుగుతూ మార్గదర్శి వార్షిక వ్యాపారం ఇప్పుడు రు.60 కోట్లు దాటింది. మీ వివిధ అవసరాలకు అనుగుణంగా రకరకాల మొత్తాలలో ఎన్నెన్నో చిట్‌లు మార్గదర్శి మీ కోసం సిద్ధం చేసింది.

ప్రస్తుత పథకం

| చందా | నెలలు | మొత్తం | సభ్యులు |
|---|---|---|---|
| 400 | 25 | 10,000 | 25 |
| 1000 | 25 | 25,000 | 25 |
| 2000 | 25 | 50,000 | 25 |
| 200 | 50 | 10,000 | 50 |
| 400 | 50 | 20,000 | 50 |
| 500 | 50 | 25,000 | 50 |
| 1000 | 50 | 50,000 | 50 |
| 2000 | 50 | 1,00,000 | 50 |
| 4000 | 50 | 2,00,000 | 50 |
| 5000 | 50 | 2,50,000 | 50 |
| 8000 | 50 | 4,00,000 | 50 |

బ్రాంచీలు :

- బషీర్‌బాగ్, హైదరాబాద్.
- లక్డీకాపూల్, హైదరాబాద్.
- చిక్కడపల్లి, హైదరాబాద్.
- అమీర్‌పేట్, హైదరాబాద్.
- ఎమ్.జి.రోడ్, సికింద్రాబాద్.
- ఎ.ఎమ్.సి.కాంప్లెక్స్, విజయవాడ.
- బందర్‌రోడ్, లబ్బీపేట్, విజయవాడ.
- జగదాంబ జంక్షన్, విశాఖపట్నం.
- స్టేషన్‌రోడ్, గుంటూరు.
- జె.పి.యన్.రోడ్, వరంగల్.
- టి.నగర్ రాజమండ్రి.
- సుభాష్‌రోడ్, కాకినాడ.
- [illegible]రోడ్, కర్నూలు.
- వైరారోడ్, ఖమ్మం.
- నరసింహారావుపేట, ఏలూరు.
- ఆర్.ఆర్.స్ట్రీట్, నెల్లూరు.

**డబ్బుకోసమేనా మీ చింత !**
**మార్గదర్శి ఉన్నది మీ చెంత !!**



**మార్గదర్శి చిట్‌ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్**

రిజిష్టర్డ్ మరియు సెంట్రల్ ఆఫీసు:
ఆబిడ్ సెంటర్, హైదరాబాద్ - 500 001.

ఉండే ఉద్దేశంతోనే ఇంతదూరం వచ్చింది విమల.

టీ తాగడం పూర్తయిన తర్వాత బెంచీమీది కానిస్టేబుల్సూ, హెడ్డూ లేచారు. "ఆ స్టూడెంట్స్ హాస్టల్‌కి వెళ్దామా సార్" అన్నాడు లతీఫ్.

కుర్చీలోనుంచి కదలకుండా నాగేశ్ అతడితో "ఒక కానిస్టేబుల్‌ని కాలిపోయిన పాకదగ్గర కాపలాపెట్టు. ఒకణ్ని స్టేషన్‌పంపి అక్కడ పళ్లదుకాణం రామయ్యని తీసుకురమ్మని చెప్పు. అతడూ రాత్రి ఈ మంటలు ఆర్పుతున్నప్పుడువచ్చి సాయం చేశాట్టకదూ... పారిపోతున్న స్టూడెంట్లలో ఎవరినన్నా చూశాడేమో? నువ్వూ, పైడితల్లీ హాస్టలుకువెళ్లి మన లిస్టు ప్రకారం వాళ్లందర్నీ తీసుకురండి. ఆ ఉమేశ్ అనే అబ్బాయిని, పేరయ్యని తన్నినవాణ్ని బేడీలువేసి తీసుకురండి. నేనిక్కడే ఉంటాను" అని ఆదేశం ఇచ్చాడు.

ఆ ఆదేశంతో అందరూ వెళ్లిపోగా నాగేశ్ ఒక్కడే అక్కడ మిగిలాడు.

మామూలుగా రిక్షావాళ్ళూ, ముష్టివాళ్లూ, కొత్తగా ఆ ఊరికివచ్చి వెళ్లేవాళ్లూ వీళ్ల బేరాలు ఆదివారమైనా కొద్దిగా వుంటాయి. కాని ఆరోజు మటుకు ఆ బజారులో అల్లర్లు జరిగి పోలీసు ఉుద్రిక్తస్పులో. మంగపతి దుకాణందగ్గర ఉండటంతో ఎవరో నక్కృత్తుగా తప్ప అక్కడికి రావడంలేదు. అందరికీ పోలీసు మనుమలంటే భయమే. దుష్టులకు దూరంగా ఉండాలన్న సంగతి వారికి తెలునును- శిష్టరక్షణకోసమే వాళ్లు ఉద్యోగాలలో ఉన్నారన్నదీ, అందులోనూ నూటికి యాభైమందిపైగా నీతిపరులు ఉంటారన్నదీ నమ్మలేని మనుమలు కనుక.

నాగేశ్ కళ్లు మాటిమాటికీ వీధులవైపు తిరగడం గమనిస్తూనే, అతనితో ఏదో మాట్లాడుతున్నాడు మంగపతి. అతనికి కొద్దిగా చిరెత్తుతున్నది. కానీ అవతలి మనిషి ఆ ప్రాంతాలకు అధికారంలోవున్న మనిషి కావడంతో తనను తాను నిగ్రహించుకుంటున్నాడు. అసలు శాంతమూర్తి అనిపేరు అతనికి వున్నా విమల మీద మటుకు ఈగవాలడం అతనికి ఇష్టంలేదు. విమలమటుకు ఇదేమీ పట్టించుకోకుండా పేపరు చదువుకుంటూ కూర్చుంది. అప్పుడప్పుడు లేచి కెటిల్‌లో టీ వేడిచేసి గ్లాసులలో పోసి కస్టమర్స్‌కి ఇస్తూ, ఆమె ఒకసారి కూడా నాగేశ్‌వైపు చూడలేదు.

అక్కడ అప్పుడు టీతాగుతున్న ఇద్దరు ఊళ్లకు వెళ్లే మనుమలు స్టేషన్‌వైపు వెళ్లగానే కుర్చీ పూర్తిగా విమల వైపు తిప్పుకుని కూర్చుని నాగేశ్ ఆమెను తీక్షగా చూస్తూ మంగపతితో అన్నాడు- "చూడు మంగపతీ... ఆ అమ్మాయి పేరేమిటి?"

ఆ ప్రశ్న విమల చెవులలో చొరబడింది. కాని పట్టించుకోలేదు ఆమె- ఆ ప్రశ్న ఎందుకు వేస్తున్నాడో కొద్దిగా ఆశ్చర్యం మటుకు కలిగినా. అందులోనూ ఎప్పుడో విన్నట్లుగా అనిపించింది ఆ గొంతు. వాళ్లమాటలు సరిగ్గా అంతకుముందు వినకపోవడంవల్ల అంతకుముందెప్పుడో దుకాణానికి వచ్చిన పోలీసు మనిషై ఉంటాడనుకుంది ఆమె మనస్సులో.

"విమలండీ. ఎందుకలా అడుగుతున్నారు?"

బాబాయి గొంతులో కొద్దిగా చిరాకు స్ఫురించి, ఆపోలీసు మనిషి తనవైపు చూసి ప్రశ్న అడగడం అతనికి చికాకు కలిగిస్తున్నట్లుంది అనుకుని మంగపతి వైపు చూసింది.

ఇంతలో కరకుగా ధ్వనించింది నాగేశ్ గొంతు. "నీవు మంచివాడివని లతీఫ్ ఎంతచెప్పినా ఇప్పుడుమటుకు వచ్చి అబద్ధాలాడుతున్నావ్! నిజం చెప్పు... ఆ అమ్మాయి అసలు పేరేమిటి?"

ఆ గొంతు ఇప్పుడు స్పష్టంగా విన్న విమల కొద్దిగా తుళ్లిపడి నాగేశ్‌వైపు చూసి వెంటనే గుండె ఆగిపోయినట్లయి కుర్చీలో నుండి లేచి నిలబడింది.

మంగపతి ఆ కరుకు గొంతువిని గాభరాతో పాటు భయమూపడ్డాడు కొద్దిగా. కలిగిన తడబాటు కప్పిపుచ్చుకుని అన్నాడు- "విమలేనండి. నాపెంపుడు కూతురండి"

వెర్రిగా నాగేశ్‌వైపు చూస్తున్నది విమల. ఆమె అతనిని పూర్తిగా పోలిక పట్టింది. క్లినిక్కు తాను వెళ్లకముందు రాజమండ్రి స్టేషన్ ఆవరణ అవతల బీట్ కానిస్టేబుళ్లమీద హెడ్




కానిస్టేబుల్‌గా ఉండేవాడు అతడు.

ఒకసారి ఒక చిన్నలాడ్జిమీద ఎవరో నిజాయితీ అయినపైఅధికారి అజమాయిషీలో దాడి జరిగినప్పుడు ఒక గదిలో ఒక కస్టమర్‌తో వున్న తాను దొరికిపోవలసిందేకాని ఆ దాడి చేసిన బృందంలో ఉన్న ఈ నాగేశ్ తన అందాన్ని చూసి లోభించి అక్కడవున్న కస్టమర్ శేషగిరి భార్య కామినీ అనీ, వాళ్ళు ఆఊరికి చికిత్సకోసం వస్తుంటారనీ, తనకు వాళ్లకు బాగా తెలుసుననీ పైఅధికారికి అబద్ధం చెప్పి తనను తక్కినవాళ్లతోపాటు అరెస్టు కాకుండా ఆ పూట తప్పించాడు.

ఒకవేళ తాను దొరికినా ఏదో ఫైనో, రెండు మూడురోజుల కారాగారశిక్షోతప్ప జరిగే పెద్ద ప్రమాదమేమీ లేదని తెలిసినా ఆరోజు బేరాలు ఎక్కువగా ఉండి దగ్గర దగ్గర ఏభైరూపాయల వరకు గడించిన ఆమె అది తన జాకెట్టులోపలే ఉండటంవలన అది పోలీసు వాళ్లు స్వాహాచేయకుండా మిగిలిందన్న సంతృప్తితో నాగేశ్ అంటే కృతజ్ఞతాభావం కలిగి డబ్బు పుచ్చుకోకుండా ఊరికేనే అతనికి అయిదారు సార్లు సెక్సు సుఖం కలిగించింది. ఒకరికి ఒకరు బాగా తెలిసినవాళ్లు నాగేశూ తానూ... అయితే ఇప్పుడు ప్రమోషన్‌పై ఈ ఊరికి వచ్చాడన్నమాట!

తనను అంత బాగా ఎరిగిన నాగేశ్ బాబాయి ఎంత చెప్పినా ఆమాట నమ్మడని తెలిసిన విమల ఇంక లాభంలేదని మంగపతిని అడ్డు ప్రశ్నలు వేస్తున్న నాగేశ్ దగ్గరకు వచ్చింది. నమస్కారం పెట్టిఅంది- "బాగున్నావా నాగేశు బాబూ! బాబాయికి నా అసలు పేరు తెలీదులే. నేను రాజమండ్రి కామినినే. అమద్దె జబ్బని వురితి మానేసి ఒయిద్యం చేయించుకుని ఆ తర్వాత ఒకమనిషిని నమ్మి పెళ్లిచేసుకున్నాక కడుపుసేసి నన్ను తరిమేశాడు ఆదొంగెదవ. పంచాయితీ పెట్టించానుగాని ఆడికి అంతకు ముందే పెళ్లాలూ బిడ్డలూ గట్రా ఉండటంవల్ల నా పెళ్లిచెల్లదన్నారు. దాంతో ఇంక గతిలేక ఈ ఊరు సేరుకొని, మరి ఆ జబ్బు అనుభవంతో అవృత్తి చెయ్యడం ఇష్టంలేక ఈ హొటలులో పనికికుదురుకున్నా. కుదురుకున్న యేలాయిశేషమేమిటోగాని కన్న తండ్రిలాగే చూసుకుంటున్నాడు మంగపతి బాబాయి. బాబాయికి ముందే ఇడమర్చి చెప్పేశాలే అంతా. కాని పైవాళ్లకి ఆ సంగతి తెలీడం ఇష్టంలేక ఏదో సెప్పాడు. ఇక్కడ ఇమల అని పేరెట్టుకున్నా. నీకు తెలిసిందేకదా, ఊరికోపేరు మాలాటి మడుసులకు..." నవ్వుతూ అంది విమల.

అవిధమైన యాసభాషతో విమల మాట్లాడగా మంగపతి వినటం అదే మొదటిసారి. ఆశ్చర్యంగా ఆమెవైపు చూశాడు అతను. అతడికి తెలియదు. సంస్కారం గల పూర్వకాలపు వేశ్యల కుటుంబంలో ఆమెపుట్టి పెరిగినదైనా చదువుకుని మంచి భాషమాట్లాడగలదైనా ఆభాష గౌరవంగా ఇంట్లో వుండి వ్యభిచారవృత్తి నెరిపే మనుమల మధ్య పనికివస్తుందితప్ప, బజారు వృత్తికి దిగిన మ నుమల నడుమ అవిధంగా మాట్లాడితే వృత్తిగడవటం కష్టమనీ, బజారు పడతులు అలాటివాళ్ళను తమలో ఒకరిగా జమకట్టరనీ, అందువల్ల తానూ వాళ్ళ భాషే నేర్చుకుని అలాగే మాట్లాడేదనీ.

అంతేకాకుండా అలాటి సంస్కారవంతమైన భాషమాట్లాడే చదువుకున్న మనిషి ఒకతె బజారు వ్యభిచారి వృత్తి చేస్తున్నదని తెలిస్తే సంఘాన్ని ఏదో ఉద్ధరిద్దామని వెర్రిగా అనుకునే సంఘసంస్కరణ సేవాపరాయణులైన మనుమలు, కాకుల్లా పీక్కుతింటారు, అనికూడా ఆమెకు బాగా తెలుసు.

ఈ అన్ని కారణాల వల్లా తనకు వచ్చిన మంచిభాష తనపాత వృత్తిలో ఎన్నడూ విమల వాడేది కాదని మంగపతికి తెలియదు. అందుకే అతనికి అంత ఆశ్చర్యమైంది. అయితే ఈమధ్య సుమారు రెండేళ్ళుపైగా ఆ అలవాటు తప్పిపోవటంతో ఆమె ఆ యాసభాష మాటలకు కొద్దిగా తడుముకోవలసి వచ్చింది ఈరోజు.

తనను ఆమె గుర్తుపట్టి ఆప్యాయంగా మాట్లాడినందుకు పొంగిపోయిన నాగేశ్, ఆమెతో తాను పొందిన అనుభవాలను గుర్తుకు తెచ్చుకుంటూ నవ్వుతూ అన్నాడు. "ఈమధ్య ఎస్సైగా ప్రమోషనొచ్చిందే కావీ! అప్పుడొక

అబ్బాయి ఉండేవాడు కదూ? ఈమధ్య మరో అబ్బాయి పుట్టాడు. అవును... ఈమధ్య పురుడొచ్చిందిటకదూ నీక్కూడా? ఏంపిల్ల?''

''ఆడకూతురు''

''ఏంపేరు పెట్టావ్?''

''దశమని - యినాయక నవితెల్లిన దశమినాడు పుట్టింది. మంచిదినమూ, ఆపేరే పెడదామన్నాడు బాబాయి''

''కొత్తపేరు, బాగుంది. అవును, ఎన్నోనెల?''

''అయిదోనెలొత్తది వచ్చేదశమికి.''

''అయితే మళ్ళా వృత్తి మొదలెట్టావా?''

విమలా, మంగవతీ ఇద్దరిమొహాలూ ముడుచుకున్నాయి.

అంతలో నవ్వుతెచ్చుకుని అంది విమల. ''లేదు, నాగేష్‌బాబూ - ఆ వురితి మానేసినాను... ఆజబ్బుతో - నపిలీను - యమయాతనా ఐనాది. ఆకాడ రాజమెండ్రిలో డాకటేరు బాబొకరు అతికష్టంమీద కుదిర్చినారు. ఏదో బగమంతుడి దయవల్ల రోజులు సుకంగా గడిసిపోతుండై. మరా వురితి సెయ్యదలుచుకోలేదు''

''మంచిదే- ఎవరన్నా బాగుపడడమే కావాలి... నేనే పెద్ద అధికారంలో ఉంటే నిన్ను రెండోపెళ్ళి చేసుకొని వేరే కాపురం పెట్టివుండేవాణ్ణి ఈ సినిమా యాక్టర్లలాగే. నీలాటిది పెళ్ళాంగా దొరకటం ఎంత అదృష్టమో''

''అలాటి వివాహాలు సెల్లవుటకదండీ... అది తెలీకే ముందు కనుక్కోకుండా గోతిలో పడిపోయినాను''

''పేరుకు చెల్లవు... డబ్బుంటే అంతా చెల్లుతుంది''

ఇలాగే కొంతసేపు సరదాగా సంభాషణ జరిగింది. ఇంతలో తాను పంపిన హెడ్డూ కానిస్టేబుల్నూ తనకు కావలసిన మనుమలను తీసుకురావటంతో తనడ్యూటీ చేయటానికి వెళ్తూ ''వస్తానుకావీ... వస్తాను మంగవతీ'' అన్నాడు నాగేశ్.

మంగవతి అన్నాడు నెమ్మదిగా, కొద్దిగా దూరంలో ఉన్నమనుమలకు వినపడకుండా - ''ఆపేరును ఊళ్ళో వాడకండి విమల అనే పిలవండి దయవుంచి''

''అలాగేలే''



అతడువెళ్లిపోయాక మంగపతి కొద్దిగా చిరాకుగా అన్నాడు "ఆయనకెందుకు చెప్పావమ్మా, నీ పాత సంగతి? ఎలాగో అది కప్పిపుచ్చి మాయమాటలు చెప్పి పంపేద్దును కదా? మనిషిని పోలిన మనుషులు ఎంత మంది ఉండరు లోకంలో?"

ఎప్పుడూ అతని మొహం మీద చిరాకు ఆవిధంగా -తనతో మాట్లాడుతున్నప్పుడు - చూడని విమల నవ్వు తెచ్చుకుని అంది "అతడికి నేను బాగా తెలుసును బాబాయి... నాలుగైదుసార్లు అతనితో వెళ్లాను నేను. నీదగ్గర దాపరికమెందుకు? నువ్వుఅబద్ధాలు చెప్తే రేపు అసలు సంగతి తెలిసి నిన్ను అల్లరిపెడ్తాడు ఆ మనిషి. మా అమ్మ అంటూండేది... "నీకొంగుననున్నా నమ్మొచ్చు కాని పోలీసు మనుమలని నమ్మొద్దు అని!"

★ ★ ★

ఆమె చెప్పినట్లే అయింది ఆ రాత్రి.

పన్నెండు దాటిన తర్వాత బాగాతాగివున్న నాగేశ్, హెడ్డు లతీఫ్‌తో వచ్చి పాకముందు భాగంలో తడక దించి పడుకునివున్న మంగపతిని లేపి తాను లోపల తడికిల గదిలో వున్న విమల దగ్గరకు వెళ్తానని అన్నాడు. లతీఫ్ దూరంగా రోడ్డుకు అవతల కట్టేసిన ఒక దుకాణం దగ్గర నిలబడి బీడీ కాల్చుకుంటున్నాడు. అతడికి నాగేశ్ ద్వారా విమల గత చరిత్ర తెలిసింది. అందువల్ల తన బాస్‌కి దన్నుగా అతడితోపాటు వచ్చాడు. ఇటువంటి పనుల్లో బాగా అనుభవం ఉన్నవాడు అతడు.

మంగపతికి ముందు షాక్ తగిలినట్లుగా అయింది. ఆ తరువాత పట్టరాని కోపం కూడా వచ్చింది. మర్యాదగా అక్కడినుండి వెళ్లకపోతే కేకలు వేసి పదిమందినీ పిలుస్తాననీ, నాగేశ్‌ను అల్లరిపెడ్తాననీ బెదిరించాడు. ఈ గోలతో మేలుకున్న విమల పైకివచ్చి, తాను అటువంటి వృత్తి ఇంకా చేయదలచుకోలేదనీ, అతనిని వెళ్లిపొమ్మనీ బతిమలాడింది. పక్కలోంచి తల్లి లేచిపోవడంతో తనకూ నిద్రభంగమైన దశమి గట్టిగా ఏడవడం మొదలుపెట్టింది. కాని బాగా మత్తులో ఉన్న నాగేశ్‌కు ఆ ఏడుపు వినిపించలేదు.

పసిపిల్లను సముదాయించి లోపలికి వెళ్తూ నాగేశ్‌వైపు తిరిగి అంది - "నాగేశుబాబూ-ఈయేల్టినుంచీ నన్ను నీ తోడబుట్టులా చూసుకో... నామాటినుకుని ఎల్లిపో. అంతమరీ తాగమాకు, నీ తోడబుట్టులా సెపుతుండా... యేటీ అనుకోకు" లోపలికి వెళ్లిపోయింది ఆమె.

"తోడబుట్టు కాదే తొడబట్టు మనిషివి నాకి దివరకు. ఈవాళేదో పత్తిత్తులా మాట్లాడుతున్నావూ!"అంటూ అతడూ లోపలికి వెళ్ళబోగా అడ్డుగావెళ్లి ఆగ్రహావేశంలో ఉన్న మంగపతిని లాగి లెంపకాయ కొట్టి మెడబట్టుకుని వీధిలోకి ఈడ్చుకువెళ్ళాడు. హడావిడిగా విమల వచ్చి అతని పట్టు విడిపించి నాగేశ్‌ను వెళ్లిపొమ్మని బతిమలాడింది. ఇంతలో లతీఫ్ అక్కడికి వచ్చాడు. పదిమందీ మూగి అల్లరి అవుతుందని భయపడ్డాడు. అందులోనూ తన బాస్ ఒంటిమీద తెలివిలేకుండా తూలిపోతున్నాడు. మంగపతిని వెళ్లి పడుకోమని చెప్పి నాగేశ్‌ను బలవంతాన పైకితీసుకువచ్చాడు.

"ఈవేళకి తప్పిపోయావు. లతీఫ్ బతిమలాడటంవల్ల-చూద్దురు గాని నాతడాఖా..." అని వాళ్లను బెదిరిస్తూ లతీఫ్ సాయంతో వెళ్లిపోయాడు.

★ ★ ★

నాగేశ్ అల్లరిచేసి వెళ్లిపోయిన నాటి తెల్లవారు ఝామున గుండెపోటు మూడవసారిగా వచ్చింది మంగపతికి. అంతకుముందు డాక్టరు చెప్పినట్లుగా అతనిని పడుకోబెట్టి ఇవ్వమన్న మాత్ర ఇచ్చింది విమల అతనికి. కొంత సేపు తగ్గినట్లుగానే ఉండి తెలతెలవార్తున్నప్పుడు మంగపతికి హఠాత్తుగా కొద్దిగా నెత్తుటి రంగులో వాంతికావడంతో భయపడిపోయిన విమల అప్పటికి పనికివచ్చిన ఆడమనిషికీ, పనిపిల్లవాడికీ హోటలు అప్పజెప్పి అతనిని పెద్దాసుపత్రికి తీసుకువెళ్లింది. వెంటనే అతనిని అక్కడ అడ్మిట్ చేయించింది.

రెండురోజులు స్పృహలేకుండా ఉన్న అతడు మూడవరోజు తెల్లవారు ఝామున మరి తెలివిరాకుండా శాశ్వతంగా కన్నుమూశాడు.

తన జీవితానికి ఒక ఆసరా దొరికిందన్న తృప్తితో జీవితం వెళ్లబుచ్చుతున్న విమల ఇంకా జ్ఞానం రాని పసికందు దశమి తప్ప

ఇంకెవళ్లూ తనవాళ్లు లేకుండా ఏకాకి అయిపో యింది.

మంగపతి పోయాడని తెలిసిన సాయంత్రం సబ్‌ఇన్స్‌పెక్టర్ నాగేశ్ తాను చేసిన తప్పువలివల్ల మంగపతి ఆగ్రహోద్రేకం తెచ్చుకున్నాడని, దానితో గుండెనొప్పి మళ్ళీ వచ్చి, ఘోరం జరిగింది అనీ పశ్చాత్తాప పడటానికి బదులుగా తనను అవమానించి లెంపకాయ కొట్టినందుకు దేవుడు అతనికి తగినశాస్తి చేశాడని లతీఫ్‌తో అన్నాడు గొప్పగా. మంగపతివంటి మంచివ్యక్తి ఈవిధంగా మరణించడం లోపల బాధగా అనిపిస్తున్నా పైఅధికారులకు అసంతృప్తి కలిగించరాదన్న సిద్ధాంతం అమలులోపెట్టే అతడు పైకి మటుకు "అవునండి సార్! తమలాటి నిజాయితీ మనుషులకి ఆ లింగందేవుడు ఎప్పుడూ దన్నుగానే వుంటాడు!" అన్నాడు.

అది తననూ, తాను పుట్టిన మతాన్నీ లతీఫ్ వ్యంగ్యధోరణితో విమర్శిస్తున్నాడని బోధపడని నాగేశ్ పకపకనవ్వాడు.

"శెభాష్... మంచిమాట చెప్పావు!" అన్నాడు, అప్పుడే సాయంత్రపు మొదటి డోసు, లోపల పని చేయడం మొదలుపెడ్తుండగా.




రెండు నెలలు గడిచాయి.

ఇప్పుడు హోటల్ తానే నడుపుతున్నది విమల పని మనుషుల సాయంతో.

మంగపతితో తండ్రీకుమార్తెల అనుబంధం మొదలైనప్పటినుండి ముఖ్యంగా ఆమె గర్భవతి అని తెలిసినప్పటి నుండి ఆ దశలో ఉన్నవాళ్ళూ కొంతవరకు అటూ ఇటూ నడవడం మంచిది అనీ, భారీ శ్రమకాకుండా కొద్దిగా ఎక్సర్‌సైజ్ చేయడం మంచిదనీ ఎప్పుడో పేపరులో చదివిన అతడు ఆమెను బలవంతపెట్టి ప్రతిరోజూ ఉదయం, సాయంత్రం స్టేషన్‌వైపు షికారు పంపేవాడు.

పురుడు వచ్చిన తరువాత ఉదయంపూట వెళ్లడం మానేసినా సాయంత్రంపూట అలా రోజూ తిరిగిరావడం మటుకు మానుకోలేదు ఆమె.

ఆమె స్టేషన్‌లో లైసెన్సు కూలీల దగ్గర నుండి అక్కడ రకరకాల వస్తువులమ్మే లైసెన్స్‌- వెండార్స్ అందరికీ తెలుసును. రైల్వే టికెట్ల కలెక్టర్లు, ఆర్.ఎం.పి.ఎఫ్. కర్మచారులూ, జి.ఆర్.పి. పోలీసులు మొదలైనవాళ్ళతోనూ బాగా పరిచయం వుంది. ఆమె అందానికి చాలామంది ముగ్ధులైనా ముఖ్యంగా ఆమె సౌమ్య ప్రవర్తన, అందరితోనూ నవ్వుతూ మాట్లాడుతూ వాళ్ల కష్టసుఖాల గురించి మాట్లాడటం, చాలామందిని ఆకట్టుకుని ఆమెపట్ల వాళ్ళందర్నీ ప్రసన్నం చేసింది.

అయితే వెలుగు ఉన్న చోట నీడా ఉండేటట్లే ప్రసన్నంగా ఉండే వాళ్ళు ఉన్నచోట్ల అప్రసన్నంగా ఉండే మనుషులూ వుంటారు.

అలాటివాళ్ళలో అక్కడ పటకాలలో అరలక ట్రపెట్టె మెడలో వేసుకుని ట్రెయిన్‌లు వచ్చినప్పుడు పాన్- సిగరెట్- బీడీ అమ్ముతూ తక్కిన రద్దీ సమయాల్లో ఎంట్రన్స్ గేటుకు దగ్గరలో కూర్చుని వ్యాపారం నెరిపే అప్పారావు ఒకడు. జొన్నపొత్తుపీచులాటి మీసాలుండటంవల్ల అందరూ అతన్ని పీచుమీసాల అప్పారావు అనేవాళ్ళు. విమల అక్కడికి షికార్లు రావడం మొదలు పెట్టిన తరువాతనే తండ్రి పోవడమూ, ఆ తరువాత అప్పారావు తండ్రి వ్యాపారంలో కుదురుకోవడమూ జరిగింది.

వచ్చిన కొత్తలో విమల సత్ప్రవర్తన గురించి తెలియని అతడు ఏదో ఆమెతో వేళాకోళంగా మాట్లాడాడు. ఆమె ఒకసారి అతన్ని మందలించినా వినక మళ్ళీ అదే పని చేశాడు. దాంతో తనంటే అభిమానంగా చూసుకునే లైసెన్స్ కూలీలలో పెద్ద అయిన రంగన్నకు చెప్పింది విమల. కూలీలందరూ అప్పారావును మందలించడమేకాక ఒకసారి కొద్దిగా దేహశుద్ధి చేయడమూ జరిగింది. అందువల్ల అతడికి విమల అంటే అక్కసు.

రెండో మనిషి స్టేషన్ ప్రాంతాల్లో వ్యభిచార వృత్తి నడిపే నలుగురైదుగురు ఆడవాళ్ళ నాయకురాలు ముత్యం ఒకతె. విమల అక్కడి కి కొత్తగా వచ్చిన రోజులలో ఆమె అందం చూసి ఆమెను తన ముఠాలో కలుపుకుంటే తన ఆదాయం ఎక్కువవుతుందన్న ఆశతో ఆ ప్రయత్నం చేసింది. విఫలురాలై విమల అంటే అక్కను పెంచుకుంది ముత్యం. తన పాతవృత్తి చేసేవాళ్ళ మీద జాలీ, అభిమానం ఉన్నా విమల ముత్యంతో ఎంతమంచిగా ఉందామన్నా ఆమెలోని విరోధభావం మటుకు తగ్గించలేకపోయింది.

ఇలాటివాళ్ళే ఒక లైసెన్స్ కూలీతోపాటు నలుగురైదుగురు విమల అంటే పడనివాళ్ళు ఉన్నారు అక్కడ.

మంగవతి పోయి రెండునెలలైంది. ఒక రోజు మధ్యాహ్నం విమల టీ దుకాణంలో అంతగా రద్దీ లేనప్పుడు లతీఫ్ వచ్చాడు. సమోసాల ప్లేటు ఒకటి తీసుకుని తీరుబడిగా తింటూ బాతాఖానీ మొదలుపెట్టాడు. ఆరోజు అర్ధరాత్రి నాగేశ్‌తో అతడు రావడమూ, అల్లరి జరిగి మంగవతి పోవడమూ జరిగినప్పటి నుండి అతడంటే ఒక రకమైన హేయభా వంవుంది ఆమెకు- అయితే ఈ పూట అతడు చెప్పింది విన్నప్పుడు మటుకు అతనిమీద ఆ భావం జారి గౌరవభావం పెరిగింది.

అటూఇటూ చూసి అన్నాడు ఇంకెవళ్ళూ లేని సమయంలో గొంతుతగ్గించి- "నేనొకటి చెప్తా, ఏమీ అనుకోకు బుల్లెమ్మా.... ఆవేళ రాత్రి మా ఎస్సైబాబుతో నేనూ వచ్చానని నామీద నీకు కోపం ఉండొచ్చు- కాని కడుపు కోసం ఉద్యోగాలు చేసేవాళ్లం పైఅధికార్ల మాట తీసెయ్యలేంకదా? ఆయన ఎందుకో ఇలా గస్తీ తిరుగుదాంరమ్మంటే వచ్చాను రాత్రి, కాని చెడుద్దేశంతో కాదమ్మా- నీ సంగతి నాకు తెలియదూ? అందుకే ముందుగా చెప్తున్నా- నేనిలా అన్నానని మరెవళ్ళ దగ్గరా అనబోకు- నా ఉద్యోగం ఊడిపోతుంది. చూడమ్మా- ఆరోజు మీ అయ్య మా బాబుని లెంపకాయ కొట్టాడు కదా, అప్పటినుండి నువ్వంటే కసిగా వుంది ఆయనకి. నీ గురించి వాళ్ళతో వీళ్ళతో చెడ్డగా అనడమే కాదు, నీమీద గూడు పుఠాణీ కూడా జరుగుతోంది స్టేషన్‌లో. నువ్వంటే పడనివాళ్ళతో కలిసి దొంగసాక్ష్యాలు పుట్టించడానికి మా బాబుగారు గుసగుసలాడ్తుంటే విన్నా" మళ్ళీ అటూ ఇటూ చూసి ఎవరో కస్టమర్ రావడంతో ఆగిపోయాడు. సమోసాలు పూర్తిచేసి, టీ ఆర్డర్ చేసి బీడీ వెలిగించుకుని కాల్చుకుంటూ తీరికగా కూర్చున్నాడు.

వచ్చినమనిషి వెళ్ళాక గల్లాపెట్టి దగ్గరకు వచ్చి రహస్యంగా అన్నాడు - "నీకు తెలుసుకదా, అప్పుడప్పుడు మా పోలీసు లెక్కల కోసం నీ పాతవృత్తివాళ్లమీద రైడ్స్ జరుగుతాయని? ఈసారి రెయిడైనప్పుడు నిన్ను లాక్కెళ్ళి లాకప్ లోపెట్టడానికి ప్లానేస్తున్నాడు మా బాబు. అందువల్ల చీకటి పడ్డాక స్టేషన్ దగ్గర ఉండబోకు- సాక్ష్యాలకేముంటుంది... నీకు తెలిసిందే కదా?"

ఆ మాటలు విన్నప్పుడు లతీఫ్ అంటే గౌరవభావం పెరగడంతోపాటు విమలకు భయంకూడా అనిపించడం మొదలుపెట్టింది. న్యాయచట్టాల్లోవున్న కొన్ని నిబంధనలు నిజాయితీలేని నాగేశ్‌లాంటి కొంతమంది కి కొంతమందిమీద తమకున్న కసీ, అక్కసూ తీర్చుకోడానికి బాగా ఉపయోగపడతాయి. ఆ విషయంలో ఆమెకు బాగా స్వానుభవం వుంది.

అందువల్ల ఆ తరువాత కొన్నాళ్లపాటు స్టేషన్‌వైపు షికారుకు వెళ్ళినా చీకటి పడకుండా ముందుగానే తిరిగి వచ్చేయడం మొదలుపెట్టింది. కొన్నాళ్లకు అసలు పూర్తిగా స్టేషన్‌వైపు వెళ్ళడం మాని పెద్దబజారులో డాక్టర్ అంబేద్కర్ విగ్రహం ఉన్నంతవరకు నడిచివెళ్ళి తిరిగివచ్చేది.

ఆ దారిలో ఉన్న ఒక క్రిస్టియన్ కుటుంబంతో ఆమెకు బాగా పరిచయమైంది. ఆ ఇంటి యజమాని జాన్సన్ జీవితంలో కొన్ని ఆదర్శాలున్న మధ్యవయస్కుడైన మనిషి. అయితే వాళ్ల కుటుంబానికి తన గతచరిత్ర చెప్పడం ఇష్టంలేక తనను ఎదురుకుంటున్న సమస్య గురించి చెప్పలేకపోయింది.

ఆ తరువాత ఒక నెలకు లతీఫ్ చెప్పినట్లే ఒకరాత్రి స్టేషన్ ప్రాంతాల్లో నాగేశు నాయక




త్వంలో రెయిడ్ జరిగింది. ఆ పూట మధ్యా హ్నంనుండీ విరోచనాలు అవుతున్నాయన్న నెపంమీద గడుసువాడైన లతీఫ్ శెలవుపెట్టా డు.

పోలీసు పార్టీ స్టేషన్‌వైపు ఏడూ - ఏడున్న రకు వెళ్ళడం చూసింది విమల!— వాళ్ళలో ఇద్దరు ముగ్గురు తప్ప తక్కివాళ్ళు మఫ్టీలో ఉన్నారు. కాని వాళ్ళందరూ ఆమెకు తెలిసిన వాళ్ళే. ఆ రాత్రి ఎనిమిదికే బేరం ఆపి దుకాణం కట్టేసి ముందు తడక దించింది.

రాత్రి పదకొండు కావస్తున్నది.

పోలీసు జీపువచ్చి విమల దుకా ణంముందు ఆగింది. అందులో ముగ్గురు "బజారు" ఆడమనుషులూ, నలుగురు విటు లూ— అందరూ త్రాళ్లతో కట్లతో ఉన్నవారే. యూనిఫారంలోవున్న నాగేశూ, ఒక కానిస్టే బుల్, మఫ్టీలోవున్న ఇద్దరు పోలీసువాళ్ళూ, పోలీస్ డ్రైవరూ కిక్కిరిసివున్నారు.

జీపు స్టేషన్‌వైపునుండి వస్తూ స్లో అవుతున్న చప్పుడు వినగానే నిద్రపోకుండా మేలుకునేవు న్న విమల గుండె ఒకసారి ఆగిపోయినట్లయి జోరుగా కొట్టుకోవడం మొదలుపెట్టింది. తనకు సాయంగా అక్కడ నిద్రపోతున్న పనివా డు సీతయ్యనూ, అతని కొడుకు పదేహేనేళ్ల రామాన్నీ లేపింది.

వాళ్ళు కళ్ళు నులుపుకుంటూ లేచేటప్పటికి జీపు ఆ దుకాణం ముందు ఆగడం జరిగింది. అందులోనుండి డ్రెస్సులోవున్న కానిస్టేబులూ, మరొక మఫ్టీమనిషీ దిగి దుకాణంముందు తడిక దగ్గరకువచ్చి "సీతయ్యా... సీతయ్యా" అని పిలిచారు.

సీతయ్యా తడికవైపు వెళ్లబోతుండగా "ఉండు సీతయ్యా" అని ముందు అతనిని ఆపింది విమల. కాని పోలీసువాళ్ల సంగతి తెలిసిన ఆమె కొద్దిగా ఆలోచించింది. తాము తడిక లోపల వేసిన తాళాలుతీసి అది ఎత్తకపోతే జబర్దస్తీచేసి దాన్నిఛిన్నాభిన్నంచేసి లోపలకు ఎలాగూ రావడం మానరువాళ్ళు.

వళ్ళు బిగించి కొద్దిక్షణాలు అలాగే నిలబ డి, ఏమి జరగాలని వుంటే అది జరుగు తుందని ఊరుకుంది. అవతలనుండి తడిక తలుపు తీయకపోతే దాన్ని విరగగొడ్తామన్న బెదిరింపులూ, గద్దింపులూ జోరుగా వినవస్తు న్నాయి.

సీతయ్యను తాళాలు తీసి తడిక ఎత్తమని చెప్పి లోపలికి వెళ్లి అప్పటికి ఎనిమిదవ నెల వచ్చినదశమిని రబ్బరుగుడ్డా, పొత్తిళ్లతోపాటు ఎత్తుకోబోయి అంతలోఆగి, ఒక కాగితంతీసి పెన్సిలుతో డాక్టర్ చంద్రం అడ్రెస్సు రాసి రామాన్ని పిలిచి వెంటనే వెళ్లి ఆ వీధిలో ఉన్న జాన్సన్‌కు ఆ కాగితం చూపించి జరిగింది చెప్పమనీ ఆ అడ్రెస్సుకు టెలిగ్రాం ఇమ్మని కూడా ఆయనకు చెప్పమనీ చెప్పింది. ఆ తరువాత దశమిని ఎత్తుకుని హఠాత్తుగా ఒకటి స్ఫురించి ఆ కాగితం తీసుకుని విమల అని అడుగున రాసి ఆ పేరుతో టెలిగ్రాం పంపమని చెప్పింది ఆమె.

అప్పటికే తడిక పైకెత్తడమూ, పోలీసులు లోపలకు రావడమూ జరిగింది.

ఒక పదినిముషాలకు తాళ్లతో కట్టుబడిన విమల అలాగే దశమిని ఎత్తుకుని అప్పటికే కిక్కిరిసివున్న జీపులో ఇరుక్కుని కూర్చుని పోలీసు స్టేషన్‌కు బయలుదేరింది.

'బజారు' పడతుల్లో ఇద్దరు తమలో తాము నవ్వుకున్నారు.

ఆరాత్రి ఒంటి గంటకు మొదట నాగేశం, ఆతరువాత ఆరుగురు పోలీసువాళ్లూ విమల ను రేప్ చేయడమూ, ఆమె షాక్‌తో స్పృహత ప్పిపోవడమూ యథావిధిగా జరిగింది. రెండు గంటలకు చివరి గడియలలో ఉన్న స్పృహ లేని విమలనూ, చంటిపిల్లనూ పోలీసు జీపు వాళ్ల దుకాణానికి తీసుకువెళ్లింది. అక్కడ ఆమెను మంచంమీద పడుకోబెట్టి చంటిపిల్ల ను సీతయ్యకు ఒప్పగించారు పోలీసులు.

తర్వాత వాళ్లు సీతయ్యను తాళ్లతో కట్టి— ఎవళ్లో నలుగురు గూండాలు అర్థరా త్రి వచ్చి తడికతలుపు విరిచి లోపలకు జొరబ డి అతన్ని బంధించి ఆ హోటలు యజ మాని విమలను రేప్ చేశారనీ, సీతయ్యా కొడుకు రామం భయపడి పారిపోయాడనీ సాక్ష్యం చెప్పాలన్నారు. లేకపోతే అతని ప్రాణా లూ అతని కొడుకూ, భార్యా ప్రాణాలూ దక్క

వనీ బెదిరించారు. భయపడిన సీతయ్యా వణికిపోతూ 'అలాగే' అన్నాడు.

విమల తేరుకుని బతికితే అసలు సంగతి బయటపడుతుందని వెళ్లిపోయేముందు- వాళ్లలో ఒక మనిషి పీకపిసికి మరీ వెళ్లాడు.

స్పృహలోలేని ఆమె ఒక పది నిముషాలలో ఏలోకాలకో వెళ్లిపోయింది, తన భౌతిక దేహాన్ని మాత్రం అక్కడ నులకమంచం మీద వదిలి.

రామం చీటీ కబురు అందుకున్న జాన్సన్ వెంటనే పోలీసు స్టేషన్‌కు వెళ్లబోయాడు కాని అతని భార్యా, చెల్లెలూ అతనిని వారించారు.

ఒక్కడూ వెళ్లి చేసేది ఏమీ ఉండదనీ, అందువల్ల తాము ముగ్గురం కలిసి వెళ్లి ఆవీధిలో పదిమందినీ— ఆడా— మొగా అందరినీ— కూడగట్టుకుని స్టేషన్‌కు వెళ్లి విమలను తప్పించడానికి ప్రయత్నిద్దామనీ అన్నారు వాళ్ళు.

వాళ్లు చెప్పింది సబబే అనిపించిన జాన్సన్ పెద్ద టార్చిలైటూ, దుడ్డు కర్రా తీసుకుని భార్యతో, చెల్లెలితో బయలుదేరి ఆచుట్టుపక్కల ఇంటింటికీ వెళ్లి అందర్నీలేపి జరిగిన సంగతి చెప్పాడు.

పోలీసు జులుంను సంఘటితంగా ఎదుర్కుందామన్నాడు. చాలా మంది స్త్రీలూ, పురుషులూ పోగయ్యారు. రెండు గంటలకు గుంపుగా వారంతా పోలీస్ స్టేషన్‌కు వెళ్లారు.

అక్కడ నాగేశ్ లేడు అప్పుడు. డ్యూటీలో ఉన్న ఒక హెడ్‌కానిస్టేబుల్ అరెస్టు చేసి తెచ్చినవాళ్లలో హొటల్ విమల లేదనీ, కావలిస్తే చూసుకోండనీ లాకప్ దగ్గరకు తీసుకువెళ్లి చూపించాడు. దొరికిన విటులను పోలీసులు అప్పటికే వదిలి వెయ్యడంవలన లాకప్‌లో ముగ్గురు "బజారు" పడతులు మాత్రమే వున్నారు. వాళ్లు కూడా తమతోపాటు హొటల్ విమలను అక్కడికి పోలీసులు తీసుకురాలేదనే చెప్పారు.

జనాన్ని అక్కడే ఉండమని చెప్పి జాన్సనూ, రామం, మరి ఇద్దరు వ్యక్తులూ మోటార్ సైకిళ్లమీద విమల హొటల్‌కు వెళ్లారు. అక్కడ తాళ్లతో కట్టబడి వున్న సీతయ్యానూ, ప్రాణంలేని విమలనూ, క్యారు క్యారుమని ఏడుస్తున్న దశమినీ చూశారు.

ముందు సీతయ్యా పోలీసువాళ్లు తనను చెప్పమన్నట్లే చెప్పాడు. కాని అతని కుమారుడే తండ్రి మాటలకు ఎదురుతిరిగి పోలీసులకు భయపడి అబద్ధాలు చెప్పవద్దని అనడంతో జరిగిన సంగతి జాన్సన్‌కూ, తక్కినవాళ్లకూ చెప్పాడు అతడు.

సీతయ్యను కట్లనుండి విడిపించి, అతన్నీ రామాన్నీ, మరొక వ్యక్తినీ అక్కడే విమల శవానికి కాపలాగా వదిలి దశమిని ఎత్తుకుని ఒక మనిషి తన వెనుక కూర్చుండగా పోలీస్ స్టేషన్‌కు వెళ్లాడు మిగిలిన వ్యక్తితోపాటు జాన్సన్.

దశమిని తన చెల్లెలికప్పగించి ఆ పసికందును ఇంటికి తీసుకెళ్లి పాలుపట్టి ఎలాగో పడుకోబెట్టమని చెప్పాడు జాన్సన్.

హొటల్ సైకిలు మీద జాన్సన్‌తోపాటు వచ్చిన వ్యక్తి ఆమెను వెనుక కూర్చుండబెట్టుకుని జాన్సన్ ఇంటికి వెళ్లాడు.

అప్పటికప్పుడే అయిదారు వందలమంది వరకు స్త్రీపురుషులు పోలీస్‌స్టేషన్ వద్ద మూగారు.

గోల మొదలైంది. తనకు కబురందినా అక్కడికి వెళ్తే తన ప్రాణాలు దక్కవని భయపడిన నాగేశ్ ఇల్లువదిలి ఎక్కడికో పారిపోయాడు.

ఉద్రిక్తులైన మనుషులు కొంతమంది పోలీస్‌స్టేషన్‌లోనికి జొరబడి అక్కడి రికార్డులూ, కాగితాలూ చింపి విసరడమూ, టెలిఫోన్లూ, కుర్చీలూ బల్లలూ మొదలైనవి విధ్వంసం చేయడమూ మొదలెట్టారు. ఎవరో వెళ్లి పోలీసు లాకప్ తాళాలు పగులగొట్టగా అందులో ఉన్న ముగ్గురు ఆడవాళ్లూ బయటపడ్డారు. వాళ్లు కూడా జనసందోహంలో ఆడవాళ్ల గుంపులో కలిసిపోయి స్లోగన్లు ఇవ్వడం మొదలెట్టారు.

పోలీసులేమో లాఠీఛార్జి చేసినా లాభంలేదని డ్రెస్సులు విప్పిపారేసి మూకలో కలిసిపోయారు.

ఆ తర్వాత...?

ఇప్పటికి ముగింపు ఇంతే! 

చతురఫీచర్

# 'పరిశ్రమ' గా సినిమా

'ఫిల్మ్' ఇండస్ట్రీ' అనగానే మన కళ్ల ముందు ఓ అందమైన ఊహా లోకం కనబడుతుంది. మందు, మగువ, విందులూ, వినోదాలూ ఖరీదైన విదేశీ కార్లు, టెక్నికలర్‌లోనూ, బ్లాక్ అండ్ వైట్‌లో నోట్ల కట్టలూ కనబడతాయి. వీటన్నిటితోబాటు నిరంతరం చుట్టుముట్టే ఫొటోగ్రాఫర్లు, జర్నలిస్టులు.... పొగడ్తల వెల్లువలో ముంచెత్తే అభిమానులూ ఓహ్! .. ఎంత సుందరమైనలోకం... ఈలోకంలో విహరించాలని మనలో చాలామంది కలలుకంటూ వుంటారు. అయితే కాసేపు ఆ ఊహలు వెనక్కి నెట్టి వాస్తవాన్ని గమనిస్తే సినిమా ప్రపంచంలో కూడా కష్టాలూ, కన్నీళ్లూ, లాభాలూ, నష్టాలూ, దోపిడీలూ, రాజకీయాలూ... అన్నీ దర్శనమిస్తాయి.

నిజానికి చిత్ర పరిశ్రమ కూడా అన్ని పరిశ్రమల్లా ఒక పరిశ్రమే. ఇక్కడ నిర్మాత 'ఇండస్ట్రియలిస్ట్' అయితే సినిమా 'ప్రొడక్ట్' అవుతుంది. కానీ 'ఫిల్మ్ ఇండస్ట్రీ' ని మామూలు పరిశ్రమగా ఎవరూ భావించరు. ప్రభుత్వం, జాతీయ బ్యాంక్‌లు కూడా ఇతర పరిశ్రమలకు ఋణాలను ఇచ్చినట్టుగా సినిమా నిర్మాణానికి ఇవ్వరు. ఒక్క నేషనల్ ఫిలిమ్-డెవలప్‌మెంట్ కార్పొరేషన్‌కు మాత్రమే ఋణాలు లభిస్తాయి. ఎంతో మంది హఠాత్తుగా ధనవంతులై పోవాలన్న ఆశతో తమ సర్వస్వాన్నీ సినిమాల్లో ఫణంగా పెడుతూవుంటారు. వారిలో ఎందరు తమ కలలు నిజం చేసుకోగలుగుతున్నారన్నది ప్రశ్నార్థకమే!

ప్రస్తుతం ప్రపంచంలో సినిమాలు నిర్మించడంలో భారతదేశానిదే అగ్రస్థానం. 1985 డిసెంబర్ నాటికి మన దేశంలో 25,500 సినిమాలు నిర్మించారు. థియేటర్లు, లాబ్‌లు, స్టూడియోలు నిర్మించడానికి 1400 కోట్ల రూపాయలు ఖర్చయితే సినిమాలు తీయడానికి మరో 500 కోట్ల రూపాయలు ఖర్చుపెట్టారు. విడుదలయే చిత్రాల సంఖ్య రోజురోజుకీ పెరిగిపోతోంది. 1950లో 250 చిత్రాలు నిర్మిస్తే 1985 లో 985 చిత్రాలు నిర్మించారు. యన్.యఫ్.డి.సి. వారి అంచనా ప్రకారం మనదేశం ఏటా పదిహేను కోట్ల విలువ చేసే ముడి ఫిల్మ్‌ను దిగుమతి చేసుకొంటోంది. దీనితో దాదాపు వెయ్యి చిత్రాలు నిర్మిస్తున్నారు. అంటే పదిహేను కోట్లవిలువచేసే ముడి ఫిల్మ్‌తో 900 కోట్ల రూపాయలు ఆర్జిస్తున్నారు.

ప్రస్తుతం ఫిల్మ్ ఇండస్ట్రీలో ప్రొడ్యూసర్లు, డైరెక్టర్లు, అసిస్టెంట్లు, రచయితలు, కెమేరామన్, లైట్‌బాయిస్ వగైరా అనేకరకాలవారు

కలిసి దాదాపు లక్షమంది ఉంటారు. అయితే ఇందులో ఒకశాతం మాత్రమే ఆర్థికంగా ఉన్నతస్థాయిలో ఉన్నారు. మిగతావాళ్లు ఏరోజు కారోజు పొట్టనింపుకొనేవాళ్లే. జూనియర్ ఆర్టిస్టులు. లైట్‌బాయ్స్‌వంటి వారి పరిస్థితి మరీ హీనంగావుంటుంది. హీరోహీరోయిన్లకు లక్షలకు లక్షలు అర్పించే నిర్మాతలు జూనియర్ ఆర్టిస్ట్‌కు రోజుకు పాతికరూపాయలకంటే ఎక్కువ ఇవ్వరు. వారేమో ఆశలన్నీ అడుగంటిపోగా, నిస్పృహతో జీవితాలను సాగిస్తుంటారు. సినిమాలు ప్రదర్శనద్వారా సంపాదించే మొత్తం ఆదాయంలో 65 శాతం వివిధరకాల పన్నుల రూపంలో ప్రభుత్వానికి పోతుంది. మిగిలిన 35 శాతంలో చిత్రనిర్మాణానికయ్యే ఖర్చుకు, నటీనటులకుకలిపి 15 శాతం, ఎగ్జిబిటర్స్‌కు 7 శాతం, ఎలక్ట్రిసిటీ డిపార్ట్‌మెంట్‌కు 5.5 శాతం, ప్రొడ్యూసర్‌కు 5శాతం డిస్ట్రిబ్యూటర్‌కు 2.5 శాతం లభిస్తుంది.

చిత్రనిర్మాణంలో అన్నిటికంటే ఖరీదయిన అంశం హీరో, హీరోయిన్లకయ్యే ఖర్చు. చిత్రానికి ప్రాణంపోసేదీ వీరే, తీసేదీ వీరేనని నిర్మాతల నమ్మకం. అనేకసార్లు తారలనుబట్టే చిత్రం 'హిట్' అవడం, లేదా 'ఫ్లాప్' అవడం జరుగుతూవుంటుంది. ప్రస్తుతం సినీఫీల్డ్‌లో ఉన్న అగ్రశ్రేణి నటీనటులు తీసుకొనే పారితోషికాలనుచూస్తే విభ్రాంతి కలుగుతుంది. ఆదాయపుపన్నుశాఖవారి రికార్డుల్లో మాత్రం తారల అసలు ఆదాయాలకుబదులు చాలా బీద ఆదాయం కన్పిస్తుంది. ఒక్క 'లాడ్‌లా' సినిమాలో నటించినందుకే అమితాబ్‌బచ్చన్ అరవైలక్షల రూపాయలు తీసుకొన్నాడట. దిలీప్ కుమార్ రేటు చాలాఏళ్లుగా 21 లక్షలు. ధర్మేంద్ర ఒకప్పుడు పదిలక్షలు తీసుకొనేవాడట. ప్రస్తుతం ఆరులక్షలు తీసుకొంటున్నాడు. మిథున్‌చక్రవర్తి, జాకీష్రాఫ్‌లరేటు 8 లక్షలు. ఇక శ్రీదేవి,


తెరవెనుక కార్మికులు ఎందరో!



అత్యధిక పారితోషికం పొందే అమితాబ్‌బచ్చన్

రేఖవంటి అగ్రశ్రేణి తారలు పదిలక్షలు తీసుకొంటే షబానా, పూనమ్ వంటివారు ఒకటినుండి అయిదులక్షలవరకూ తీసుకొంటారుట. తమాషా ఏమంటే కేరక్టర్ యాక్టర్లకు మాత్రం పారితోషికం వేలలోనే ఉంటుంది. ప్రస్తుతం ఓ 'బి'క్లాస్ సినిమా నిర్మించాలంటే 60 నుండి 70 లక్షల వరకూ ఖర్చవుతుంది. 'ఎ' క్లాస్ సినిమా అయితే కోటిరూపాయలదాకా అవుతుంది

సినిమానిర్మాణం తరువాత ముఖ్యమైన విభాగం ప్రదర్శనాలయాలు. మనదేశ ప్రస్తుత జనాభా 77 కోట్లు. ఇటీవల జరిగిన సర్వేలో తేలిన లెక్కప్రకారం ప్రతిరోజూ దాదాపు కోటీ యాభైలక్షలమంది సినిమాలు చూస్తున్నారు. చిత్రనిర్మాణంలో భారతదేశానిదే అగ్రస్థానం అయినా థియేటర్లుమాత్రం మనదేశంలో తగినన్నిలేవు. ప్రస్తుతం మనదేశంలో 12701 థియేటర్లు ఉన్నాయి. ప్రతి వెయ్యి మందికి మనదేశంలో 7 సినిమాహాల్స్ మాత్రం ఉంటే, శ్రీలంకలో 13 , సింగపూర్‌లో 27. జపాన్‌లో 21 ఉన్నాయి. మనదేశంలో నిర్మిస్తున్న చిత్రాల సంఖ్యకు అనుగుణంగా థియేటర్ల సంఖ్య పెరగకపోవడంవల్లనే టిక్కెట్లు బ్లాక్‌లో కొనవలసిరావటం కొన్ని చిత్రాలు డబ్బాల్లోనే మగ్గుతూవుండిపోవటంవంటి అనర్థాలు జరుగుతున్నాయి.

మనదేశంలో నిర్మిస్తున్న చిత్రాల్లో పదిశాతం మాత్రమే విజయవంతం అవుతున్నాయి. మరి తొంభైశాతం చిత్రాలు ఫెయిల్

అవుతున్నా చిత్రాలసంఖ్య రోజు రోజుకీ పెరుగుతూనే ఉందేమిటనేది ఓ పెద్దప్రశ్న. ఇదే ప్రశ్న కొంతమంది నిర్మాతలను అడిగితే "ఇంకేం చెయ్యం? మాకింకే పనీరాదే..." అంటారు అయోమయంగా. మరి కొంతమంది "ఈ పరిశ్రమకున్న గ్లామర్ మరేపరిశ్రమకూ లేదు. అందువల్ల రోజు రోజుకీ కొత్తవాళ్లు చిత్రరంగంలో ప్రవేశిస్తూవుంటారు. ఒకచిత్రం ఫెయిల్ అయినా మరో చిత్రమయినా విజయవంతం అవుతుందన్న ఆశతో శక్తి ఉన్నంతవరకు సినిమాలు తీస్తూనేవుంటారు" అన్నాడు. ఒక ఫైనాన్సర్‌ని పట్టుకోగలిగితే చాలు. సినిమా తియ్యడానికి ముందుకు వస్తారు చాలామంది. మనదేశంలో సగంపైన చిత్రాలు నిర్మాణదశలోనే అనేకకారణాలవల్ల ఆగిపోతూ వుంటాయి. సినిమాలు తీసేచాలామందికి 'ఆర్ట్'గురించి 'క్రాఫ్ట్' గురించి ఆలోచించే సమయంగానీ, సామర్థ్యంగానీ ఉండదు. అన్ని తరగతుల ప్రేక్షకులనూ ఆకర్షించడానికి కావలసినన్ని హంగులు పెడితేచాలనుకొంటారు. సాధారణంగా సెక్స్, వైలెన్స్, డాన్స్‌ల మోతాదు ఎక్కువగావుండి చివరికి బాంబె భేల్‌పూరీలాగానో, మద్రాసు మసాలా దోశలాగానో తయారవుతాయి. నిర్మాత అదృష్టం బాగుండి ప్రేక్షకులు ఆదరిస్తే కనకవర్షం కురుస్తుంది. లేదా నిర్మాత దివాలాతీస్తాడు.

టి.విలు, వీడియోలు సినీపరిశ్రమ ఆర్థికపరిస్థితిని కొంతవరకు దెబ్బతీశాయి. వీటివల్ల దాదాపు ప్రతి ఇల్లూ ఓ మినీథియేటర్



అగ్రశ్రేణితార రేఖ



గ్లామర్ తార శ్రీదేవి-
కమర్షియల్ చిత్రదర్శకుడు రాఘవేంద్రరావు

అయిపోయింది. అన్నివయసుల వారిని ఆకర్షించేవిధంగా టీ.వీ కార్యక్రమాలు రూపొందించడంవల్ల కొంతవరకు సినిమాలకు డిమాండ్ తగ్గింది. మనదేశంలో ప్రతిరోజూ కోటీ డెభ్భైఅయిదు లక్షలమంది టీ.వీ చూస్తున్నారు. టీవీలు, వీడియోలు కలిగించిన మరో సదుపాయం ఏమిటంటే, ఎక్కడికీ వెళ్లనవసరం లేకుండా, క్యూల్లో నుంచోకుండా, ఇంట్లోనే హాయిగా సినిమాలు చూడగలగటం. ఒక సర్వేలో తేలిన లెక్కప్రకారం మనదేశంలో దాదాపు రెండులక్షల వీడియో లైబ్రరీలు, తొమ్మిదివేల వీడియోపార్లర్స్ ఉన్నాయి. ప్రతిరోజూ దాదాపు ఇరవైలక్షల మంది వీడియో సినిమాలు చూస్తున్నారు. వీటివల్ల ప్రేక్షకులకూ, సినిమాలకూమధ్య దూరం పెరుగుతోంది. వీడియో పార్లర్లలో చట్టవ్యతిరేకంగా కొత్త చిత్రాలనుకూడా ప్రదర్శించడంతో ఆ చిత్రాలు బాక్సాఫీసువద్ద దెబ్బతింటున్నాయి. దాంతో ఆ చిత్రానికి సంబంధించినవారందరూ నష్టపోతున్నారు. కాబట్టి గులాబికి ముళ్లున్నట్టు ఈ గ్లామర్ ప్రపంచంలో సుఖాలు, సంతోషాలు, లాభాలేకాకుండా కష్టాలు, నష్టాలు, కన్నీళ్లుకూడా ఉంటాయని తెలుసుకొని అడుగుపెడితే మంచిది. అడుగుపెట్టాక వాటిని తప్పించుకొనే నేర్పూ, తట్టుకొనే ఓర్పూ అలవరచుకోవడం అవసరం.

—వెన్నెల



# చతుర సమీక్ష

ఈ శీర్షిక ద్వారా ప్రతి నెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని పాఠకులకు కల్పిస్తోంది 'చతుర'. పాఠకులు 'చతుర' నవలపై ఏ నెలకానెల తమ అభిప్రాయం వెల్లడిస్తూ, ఆ నవల ఎందువల్ల తమను ఆకట్టుకుందో, లేదా ఎందువల్ల ఆ నవల తమకు నచ్చలేదో వివరిస్తూ, రచన బాగోగుల గురించి రాయాలి. పాఠకులు గమనించవలసిన కొన్ని ముఖ్యాంశాలు:

1. మీ **"చతుర సమీక్ష"** అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏనెల నవల సమీక్షలు ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవర్‌పై **చతుర సమీక్ష కు** అని పేర్కొని, ఎడిటర్ 'చతుర', ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడా, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించినవాటిలో తొలి మూడింటికి రు. 100/-, రు. 75/-, రు. 50/- చొప్పున; మరో మూడింటికి రు. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

## కూపన్

**జూన్ 'చతుర' నవల : ఊబి**

సమీక్షకుని పేరు: ..............................

చిరునామా: ..............................

..............................

..............................

..............................

# జీవితం చేజారనీయకు

"ఎవరో అన్నట్టు 'మేరేజ్ ఈజ్ నథింగ్ బట్ జస్ట్ ఎన్ ఎడ్జస్ట్‌మెంట్'. ఒకరి కోరికలు, ఆశలు, ఆశయాలు మరొకరికి నచ్చకపోయినా సర్దుకుపోయే అండర్‌స్టాండింగ్ వున్నవారి కాపురం చిన్నచిన్న ఒడుదుడుకులున్నా సాఫీగా సాగిపోతుంది. ఆ ఎడ్జస్ట్‌మెంట్ తెలియని దంపతులు తిట్టుకుంటూ, కొట్టుకుంటూ బతుకీడుస్తారు. అంతే తప్ప ప్రేమలు, అనురాగాలు, సినిమాల్లో మాదిరి ఒకరిని చూసి ఒకరు మైమరచిపోవటం, కళ్ళలోకి అనురాగంతో చూసుకోవటం, ఒకరికోసం ఒకరు త్యాగాలు చేసేసుకోవటం - అంతా అందమైన కల్పన! నిజజీవితంలో అదంతా సత్యదూరం! పరస్పర అవగాహనతో, పరస్పర గౌరవం ఇచ్చిపుచ్చుకునే దంపతులు నూటికి ఒకరున్నా సంతోషమే" అని బోధించిన ఆమె ఓ లెక్చరర్!

**ఆ పాఠాలు ఎవరికి?**

**అధ్యాపకురాలైన ఆమెకు ఈ విధంగా జీవితపాఠాలు నేర్పే అవసరమేమిటి?**

**కన్నె పిల్లలు కలల్లో పెళ్లి చుట్టూ అల్లుకునే ఊహలకీ, నిజజీవితంలో ఎదుర్కొనే వాస్తవాలకీ మధ్యగల అంతరాన్ని అర్థవంతంగా చెప్పిన డి. కామేశ్వరి నవల 'జీవితం చేజారనీయకు'**

# చతుర కథలు



## రసికుడు

ప్లాట్‌ఫాం కిటకిటలాడుతోంది జనంతో. జనాన్ని తోసుకుంటూ అతికష్టంమీద రైలెక్కగలిగాడు చిదంబరం.

ఓ అయిదు నిమిషాల వాగ్వివాదం తరువాత కిటికీ పక్కసీటు సంపాదించగలిగాడతను. సీట్లో కూలబడి కిటికీ తెరిచాడు. బయటినుంచి వస్తూన్న చిరుగాలితో ప్రాణంలేచి వచ్చినట్లయిందతనికి.

రైలు బయలుదేరవచ్చు అన్నట్లుగా గార్డు పచ్చజెండా చూపించాడు.

రైలు నిండు గర్భిణిలా కదిలింది.

సరిగ్గా ఆ సమయంలో ఓవ్యక్తి ఆదరాబాదరాగా కంపార్ట్‌మెంట్‌లోకి వచ్చిపడ్డాడు.

'హమ్మయ్య' అనుకొంటూ తనఒంటికంటిన దుమ్ము దులుపుకుంటూన్న ఆ వ్యక్తిని చిత్రంగా చూశాడు చిదంబరం.

ఎర్రషర్టు, నల్లప్యాంట్‌లో టక్‌చేశాడు. కళ్ళకి గాగుల్స్, కాళ్ళకి షూస్, రేగినతల. సన్నగా ఎర్రగా ఉన్నాడతను. వయస్సు పాతికేళ్ళకు మించదు.

"గురువుగారూ! కొంచెం అలా సర్దుకోండి" అంటూనే చిదంబరం పక్కన బైఠాయించాడతను.

రైలువేగాన్ని పుంజుకొంది.

రైలుతోపాటు పరుగెడుతున్న టెలిగ్రాఫ్ స్తంభాలను, చెట్లను చూస్తూ కూర్చొన్నాడు చిదంబరం.

జేబులోంచి దువ్వెన తీసి రేగినజుట్టు దువ్వుకుంటూ చెప్పాడతను- "నాపేరు రాజశేఖర్. మిత్రులు శేఖర్ అంటారు. ఊరూరా తిరుగుతూ మాకంపెనీ తయారుచేసిన టూత్ పేస్టుల్ని అమ్మటం నాడ్యూటీ. బ్రహ్మచారిగాడిని." తనను తాను పరిచయం చేసుకున్నాడా వ్యక్తి. ఒక్షణం ఆగి "అబ్బ! చెమట చంపేస్తుంది" అని చిదంబరం ఏమీ మాట్లాడకపోయేసరికి "ఏంసార్ మాట్లాడరు...? మీ పేరేమిటి? ఏంచేస్తుంటారు?—" అంటూ తనే అడిగాడు రాజశేఖర్.

"నేనెవరినయితే మీకెందుకు... ఓగంటప్రయాణం చేస్తే నేను దిగవలసిన చోటు వస్తుంది. అందాకా మౌనంగా ఉండలేరూ?" కోపంగా చూస్తూ అన్నాడు చిదంబరం.

"భలేవారే! రిజర్వుడు టైపు మనిషిన్న మాట మీరు. సరే... ఎవరి పద్ధతి వారిది. నేను సేల్స్‌మన్‌ను.మాటలను అమ్ముకొని బతకడం నా వృత్తి. అందుకే సైలెంట్‌గా ఉండటం నాకురాదు. అసలు కబుర్లు చెప్పే మగవాళ్లంటే ఆడవాళ్ళు ఎలాపడిఛస్తారో తెలుసా.....?" సిగరెట్ తీసి వెలిగిస్తూ అన్నాడు రాజశేఖర్.

"అయితే మీరంటే ఆడవాళ్ళు పడిఛస్తారంటారు?" అతడిని నిశితంగా చూస్తూ అన్నాడు చిదంబరం.

"హమ్మయ్య! ఇప్పటికి మాట్లాడారు" అని "అవును... పెళ్ళికాని పిల్లలేకాదు, పెళ్ళయిన ఆడవాళ్ళు కూడా నా వెంటపడుతూంటారు" సిగరెట్ పొగ రింగులు రింగులుగా వదుల్తూ చిద్విలాసంగా అన్నాడు రాజశేఖర్.

"నిజమా....?"

"ఏమనుకొన్నారు...? అసలు ఇప్పుడు నేనెక్కడి నుంచి వస్తున్నాననుకొన్నారు....? ఓ పతివ్రతా శిరోమణి కౌగిట్లో కరిగిపోయి వస్తున్నా: ఆవిడకు పెళ్ళై ఇద్దరు పిల్లలు కూడా. నేనంటే పడిఛస్తుంది. ఈ ఊరు వచ్చినప్పుడల్లా గుప్తా గార్డెన్‌కెళ్ళి ఆవిణ్ని కలవందే వెళ్ళను!!"

"గుప్తాగార్డెనా?"

"అవును! గుప్తాగార్డెన్లోని మూడంతస్తుల భవనంలో ఉండే రజని!!"

"రజని!?" పిడికిళ్ళు బిగించి వత్తిపలుకుతూ అడిగాడు చిదంబరం.

"అదేమిటి? రజని పేరు వినగానే అలా అయిపోయారు...?" ఆతృతగా అడిగాడు రాజశేఖర్.

"నువ్వు చెప్పింది మా ఆవిడ గురించి కాబట్టి" పెన్‌నైఫ్ తీసి అతడి మీదకు ఉరుకుతూ అన్నాడు చిదంబరం.

"మైగాడ్" అని అరచి పక్కకు తప్పుకొన్నాడు రాజశేఖర్.

"నిన్నివాళ చంపందే వదల్ను!" అతడితో కలబడుతూ అన్నాడు చిదంబరం.

ఓ చేత్తో చిదంబరం చేతిలోని కత్తి దెబ్బను కాచుకొంటూ, మరో చేత్తో అతణ్ని దూరంగా నెట్టివేయడానికి విశ్వప్రయత్నం చేస్తున్నాడు రాజశేఖర్.

ఉన్నట్టుండి చిదంబరం పట్టుకాస్త సడలింది. అదే అదనుగా రాజశేఖర్ ఒక్క ఉదుటన పరుగెడుతూన్న రైల్లోంచి ధైర్యం చేసి దూకేశాడు.

తలుపు దగ్గరకొచ్చి బయటకు చూశాడు చిదంబరం. రైలు ఎక్కువ వేగంగా వెళ్తూండక పోవడంతో దెబ్బలేమీ తగిలినట్లు లేదు రాజశేఖర్‌కు. బట్టల కంటిన మట్టి దులుపుకొంటున్నాడు.

తన సీట్‌పక్కన తగిలించిఉన్న రాజశేఖర్ షర్టుతీసి అందులో వున్న పర్సుతెరిచాడు చిదంబరం.

పర్సునిండుగా వందరూపాయల నోట్లున్నాయి. ఆ డబ్బుతీసి చిద్విలాసంగా నవ్వుకొన్నాడు చిదంబరం.

నిజానికి అతనికి పెళ్ళే కాలేదు.

— హరిబాబు

# ప్లాన్

"ఒరేయ్ లక్ష్మణ్ ఇక్కడ తిరుగుతున్నావే మిటి ?"

"నమస్కారంసార్. హెడ్‌కానిస్టేబుల్ ఎప్పు డయ్యారు"

"ఈమధ్యే అయ్యానుగానీ, ఇంట్లో చుట్టాలొ చ్చార్రా. ఖర్చులకి డబ్బుల్లేవు. నెలాఖరురోజు లు. చాలా ఇబ్బందిగా వుంది"

"ప్రస్తుతం నేనా వ్యాపారం చేయడంలేదు సార్. అన్నీ మానేశాను. ఇప్పుడు నేను బసంత్ టాకీసులో గేట్‌కీపర్‌గా పనిచేస్తున్నాను"

"నేను చెప్పేది పూర్తిగా వింటావా. నాలు గంటించనా ? చెప్పినట్లు వినకుంటే బొక్కలోకి దోస్తాన్నాకొడకా"

"చెప్పానుగా సార్. ఇప్పుడు నేనాపనిచేయ డంలేదు"

"అరె కుర్రనాయాలా... నా దగ్గరట్రా నీ బుకాయింపు. అయినా నీ దగ్గరేం డబ్బులడగ డంలేదు. ఓ పని చెబుతాను చేసిపెట్టు చాలు. తర్వాతదంతా నేను చూసుకుంటాను"

"చెప్పండి ఏంచేయమంటారు ?"

"అదిగో... ఎదురుగా కనిపిస్తున్న టైర్ల దుకా ణంలోకి తిన్నగా వెళ్లి ఒక టైరును బయటికి నెట్టేయ్. అది చూసి ఆ కొట్టతను దొంగ దొంగ అని అరుస్తాడు. నిన్ను పట్టుకుంటాడు. ఆ తరువాత వ్యవహారమంతా నేను చూసుకుంటా ను"

ఈ పథకం వేసి హెడ్ కానిస్టేబుల్ అటే కొద్దిదూరంలో తచ్చాడసాగాడు. లక్ష్మణ్ దుకా ణంలోకి దూరాడు. ఒక టైరును గభాల్న బైటికి

నెట్టేశాడు.

దుకాణదారు 'దొంగ దొంగ' అని అరుస్తూ బయటికి గెంతి, లక్ష్మణ్ని పట్టుకున్నాడు. కొంద రు ఇతర దుకాణదారులు ఆ కేకలు విని పరుగెత్తుకొచ్చారు. ఆ గుంపును చూసి హెడ్ కానిస్టేబుల్ లాఠీని నేలకు తాటిస్తూ అక్కడికి చేరుకున్నాడు.

"ఏమయింది. ఏమయింది? గుమి గూడా రెందుకు?" బిగ్గరగా అడిగాడు గుంపును చెదరగొడుతూ.

"రండి హెడ్ కానిస్టేబుల్‌గారు! రండి. సమ యానికొచ్చారు. ఈ వెధవ టైరు దొంగతనం చేస్తుంటే పట్టుకున్నాము" దుకాణదారు చెప్పా డు.

హెడ్‌కానిస్టేబుల్ లక్ష్మణ్ చొక్కా కాలరు పుచ్చుకుని, ఈడ్చి ఒకటిచ్చి గద్దించాడు. "ఏవి ట్రా పొద్దుపొద్దున్నే దొంగతనమా? నడువ్. పోలీస్ స్టేషన్‌కి. చర్మం వలిచేస్తాను" ఆతరు వాత దుకాణదారుని ఉద్దేశిస్తూ చెప్పాడు "వెంటనే ఓ రిక్షా తెప్పించండి"

దగ్గరలోనే రిక్షా వాడుండటంతో దుకాణ దా రు కేకేస్తూనే వచ్చేశాడు.

"ఏమండి... ఆ టైరు రిక్షా ఎక్కించండి. మీరుకూడా పోలీస్‌స్టేషన్‌కు నడవండి. ఈ వెధవను నా సైకిల్‌మీద కూర్చోబెట్టుకుంటా ను" అని చెప్పాడు హెడ్‌కానిస్టేబుల్.

టైరు రిక్షాలోకి ఎక్కించుకుని కొద్దిదూరంపో గానే హెడ్‌కానిస్టేబుల్ దుకాణ దారుతో అన్నా డు- "ఏమండి... ఈ వ్యవహారం ఇక్కడే తేల్చే సుకుంటే పోలా? అనవసరంగా పెంచుకో వడం ఎందుకు? కేసు తేలేవరకు ఈ టైరు కూడా పోలీస్‌స్టేషన్‌లోనే మగ్గుతుంది. మీరు నేను చెప్పినట్టు వినండి. ఈ దొంగవెధవను వేరే కేసులోకి ఇరికించి బొక్కలోకి దోస్తాను"

దుకాణ దారు కూడా ఆలోచించాడు. ఈ ఐడియా బాగానే వుంది. లేకుంటే వేల రూపా యల టైరు కోర్టులో జడ్జిమెంట్ వచ్చేవరకు పోలీస్‌స్టేషన్‌లోనే మగ్గిపోతుంది.

అతను ఎదోరీతిగా బేరం కుదుర్చుకుని రెండువందల రూపాయలు హెడ్ కానిస్టేబుల్ చేతిలో పెట్టి, టైరు తీసుకుని వెనక్కి వెళ్ళిపో యాడు దుకాణ దారు.

కొద్దిదూరం వెళ్ళాక హెడ్ కానిస్టేబుల్ ఒక ఇర వై రూపాయలనోటు లక్ష్మణ్‌కిస్తూ గద్దించా డు. "ఒరేయ్, అబ్బాయి! ఇంద... ఇలాగే నిజాయితీగా బతకాలి. మళ్ళీ ఎక్కడైనా దొంగ తనంచేసినట్టు తెలిస్తే మక్కెలిరగొడతాను. వెళ్ళు"

(మహమ్మద్ ఇమాముద్దీన్ గోహర్--ఉర్దూకథ ఆధా రంగా)

—'భూషాలూ'

# వీడ్కోలు

రామకృష్ణా బార్ ముందాగింది ఆటో. అందు లోంచి చేతిలో సూట్‌కేసుతో ఒకరు, బ్రీఫ్‌కేస్ లతో ఇద్దరు దిగారు. మీటర్‌చూసి ఆటోవాడికి డబ్బులిస్తూ చెప్పాడు రామలింగం- "లైట్‌గా పుచ్చుకొని వెళ్దాం!"

"ఆల్‌రైట్... పద!" అనాడు సోమలింగం.

"నాకు విస్కీ అయితేనే సరిపోద్ది!" చెప్పా డు కోటిలింగం వారిననుసరిస్తూ.

డోర్‌వద్దనున్న ఘూర్కా సలాం అందు కొంటూ బార్‌లోకి అడుగుపెట్టారా ముగ్గురూ.

తమకు కావాల్సిన పదార్థాలు ఆర్డరిచ్చి, కబుర్లలో పడ్డారు.

పదినిముషాల్లో సర్వర్ తెచ్చిన మూడు బీర్ బాటిల్స్ ఖాళీచేశారు.

"ఓల్డ్ టావర్న్ విస్కీ రెండు ఫుల్‌పట్రా!" ఆర్డరిచ్చాడు కోటిలింగం.

"నాకు త్రీరోసెస్ ఒక ఫుల్!" చెప్పాడు రామలింగం.

"బ్లూబుల్ ఓ ఫుల్‌బాటిల్!!" అన్నాడు సోమలింగం.

ఓ ఐదునిముషాల తరువాత తమ తమ బాటిల్స్ ఖాళీచేయడంలో సీరియస్‌గాముని గిపోయారా ముగ్గురు.

ఓ అరగంట గడిచింది.

బాటిల్స్ దాదాపు ఖాళీ అయ్యాయి.



ఞషా నషాళానికి అంటుతోంది నెమ్మది నెమ్మదిగా. ఉన్నట్టుండి చేతిగడియారం చూసుకొన్న రామలింగం- "ట్రైన్ బయల్దేరటానికింకా పావుగంటే వుంది" అని అరిచాడు.

మిగతా ఇద్దరూ "అవును గురూ... బయల్దేరదాం పదండి!" అంటూ హడావిడి చేశారు.

సర్వర్ తెచ్చిన బిల్ చూడకుండానే సాసర్‌లో మూడువంద రూపాయలనోట్లు పడేసి కంగారుగా బయటకు పరుగెత్తారు.

వాళ్ళ అవసరాన్ని గుర్తించిన ఆటోడ్రైవర్ మీటర్‌మీద ఐదురూపాయలు ఎక్స్‌ట్రాఇస్తేనే స్టేషన్‌కొస్తానన్నాడు.

అందుకు వప్పుకొని ఆటో ఎక్కారు ముగ్గురూ. ఆటోడ్రైవర్ ఆఘమేఘాలమీద స్టేషన్ చేర్చాడు.

ప్లాట్‌ఫాంమీద రైలు బయల్దేరటానికి సిద్ధంగా వుంది.

వాళ్ళు ఆటో దిగుతూండగానే గార్డు విజిల్ ఊది, పచ్చజండా చూపించాడు.

రైలు బయల్దేరింది.

పడుతూలేస్తూ లోనికి పరుగెత్తారా ముగ్గురు. రైలు అప్పుడే వేగాన్ని అందుకుంటోంది. దాన్ని అందుకోడానికి పరుగులు పెడుతున్న వారినిచూసి రైల్లో ఫుట్‌బోర్డ్‌మీద ప్రయాణిస్తున్న ఓ పెద్దమనిషి చేయిచాచి రామలింగం, కోటిలింగాలను లోనికి లాక్కోగలిగాడు. ప్లాట్‌ఫాంమీద వంటరిగా మిగిలిపోయాడు సోమలింగం.

ఏడుపొచ్చింది సోమలింగానికి. గొల్లుమని ఏడుస్తున్న సోమలింగాన్ని ఓదారుస్తూ అన్నాడు టి.సి- "మరేం ఖంగారుపడకండి! ఓ అరగంట తర్వాత బయల్దేరే ఎక్స్‌ప్రెస్ లో వెళ్ళి మీవాళ్ళను కలవ వచ్చు!"

బావురుమంటూ చెప్పాడు సోమలింగం-

"ఆ రైల్లో వెళ్లాల్సినవాడిని నేనే! నాకూడా వచ్చిన ఆ ఇద్దరూ నాకు సెండాఫ్ ఇవ్వడానికి వచ్చినవాళ్ళు!'

— శ్రావ్య

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications; Printed at Colorama Printers Private Limited, 7-1-19, Begumpet, Hyderabad- 500016, TEL: 220728.
CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad- 500482

వివాహములకు....

ప్రత్యేక పట్టు చీరల షోరూం.



- వెంకటగిరి
- గద్వాల్
- పరయూర్
- వెండి జరీచీరలు
- బెనారస్–ఆర్గంజా
- చిన్నీ జార్జెట్
- చందేరీ
- సాఫ్ట్ సిల్కు
- గార్డెన్ సిల్కు

# చందన కంచి సారీస్

కోటగుమ్మం, రాజమండ్రి.

గమనిక :- స్త్రీలకు నచ్చే అన్నిరకముల ప్రత్యేక పట్టు చీరలతోపాటు అన్ని ఫ్యాన్సీ చీరలు సరసమైన ధరలకు అందించటం మా ప్రత్యేకత.

URA Telugu Monthly, Hyderabad-500 004. No. H/ HD